

తల్లి, తండ్రి, గురువు, దైవం

అయిన

అమ్మకూ, నాన్నకూ

ప్రేమతో, భక్తితో

ఈ కృతి అంకితం

# ఆంధ్రమహాభారతము - సూక్తిరత్నాకరము

1990లో మద్రాసు విశ్వవిద్యాలయం వారి
పి. హెచ్. డి. పట్టంపొందిన సిద్ధాంత వ్యాసం.

డాక్టరు గుత్తా సురేష్ బాబు

ప్రథమ ముద్రణ : 1994.
కాపీలు : 1,000.

(తిరుమల తిరుపతి దేవస్థానముల వారి
ఆర్థిక సహాయంతో ప్రచురితము.)

వెల : రు. 80-00

ప్రతులకు :

1. డాక్టరు గుత్తా సురేష్ బాబు
"శాంతివిలయం"
విజయవాడ-8
ఫోన్. 472115

2. గుత్తా రాధాకృష్ణమూర్తి
మల్లవల్లి (B.P.O)
బాపులపాడు మండలం
కృష్ణా జిల్లా. (A. P.)
ఫోన్ : 08656-82-249

ముఖ చిత్రం :
బాలి.

ముద్రణ :
శ్రీకృష్ణా ప్రింటర్స్.
నవోదయ కాలనీ.
విజయవాడ - 10
ఫోన్ : 473009

## ముఖచిత్ర వివరణ



# ఆశీస్సులు

**Dr. V. RAMACHANDRA, M.A.Ph.D.**
Professor and Head,
Department of Telugu,
University of Madras,
Marina, Madras-600 005.

చిరంజీవి సురేష్ Ph.D. డిగ్రీ కోసం రూపొందించిన సిద్ధాంత వ్యాసం "ఆంధ్ర మహాభారతము-సూక్తి రత్నాకరము" నకు ఒక ప్రత్యేకమైన విలువ ఉంది. పండితులకు మాత్రమే ఉపయోగకరంగ ఉండే విషయం సాధారణంగా సిద్ధాంత వ్యాసాల్లో ఎక్కువగా ఉంటుంది. చదువరులందరికూ ఉపయోగపడే విషయం తక్కువ. అటువంటి విషయాన్ని అందిచ్చే సిద్ధాంతవ్యాసాలు కొన్నింటిలో ఇది యెన్నదగింది.

ఆంధ్ర మహాభారతం నిజంగా సూక్తి రత్నాకరమే. ప్రధాన కథలోగాని, ఉపాఖ్యానాల్లోగాని అనేక సందర్భాల్లో వచ్చే అమూల్యమైన సూక్తులు ఆంధ్ర మహాభారతంలో కోకొల్లలు. అవి మూలంతో సంబంధం ఉన్నవా లేక తెలుగు కవులే విగదించిన సూక్తులా? అన్నది విషయం కాదు.

"సహస్రముపైగాగల సూక్తులను విశ్లేషించి వివరించుటయే యీ సంశోధనావశ్యకత" అన్నది రచయిత దృష్టి. ఆ పనిని చి॥ శా॥ సురేష్ ఎంత సమర్థతతో నిర్వహించాడో ఈ సిద్ధాంతవ్యాసం నిరూపిస్తుంది.

ఆంధ్ర మహాభారతంలోని ప్రతిపద్యాన్ని పరిశీలించి, సూక్తులను ఎన్నుకొని వాటిని సముచితంగా విశ్లేషించి వివరించిన విధానం రచయిత ప్రతిభకు నిదర్శనం. సూక్తులు ఎన్నో రకనల వల్ల మనకు తెలుస్తున్నా, ప్రజావ్యవహారంలో తరతరాలుగా అవి ప్రచలితాలవుతున్నా, సూక్తులకు ఒక ప్రామాణికతను సంతరించిన గ్రంథం మహాభారతమని చెప్పవచ్చు. వేయి సంవత్సరాలుగా ప్రచారంలో ఉన్న మహాభారత కథతోపాటు అందలి సూక్తులు కూడా ప్రజా

రాన్ని పొంది ప్రామాణ్యాన్ని సంతరించుకొన్నాయి. అటువంటి సూక్తులకు అర్థాలు తెలుసుకోవడం, వాటిని జీవితంతో సమన్వయించుకొని బ్రతకగలగడం ప్రజలకు నిజంగా ఒక వరం. అయితే మహాభారత గతమైన ఈ సూక్తులు చాల వరకు ప్రజలకు అందుబాటులోకి రాకుండా దూరంగానే ఉంటున్నాయి. అప్పు డప్పుడూ రేడియో, దూరదర్శన్ మొదలైన వాటిద్వారా ఈ సూక్తుల ప్రచారం కొంత జరిగినా అవి ప్రజలకు కావాలనుకొన్నప్పుడు లభించేవికావు. అందుచేత ఆ సుభాషితామృతాన్ని సిద్ధాన్నంగా వడ్డించే ఈ సిద్ధాంతవ్యాసం ప్రజలకు నిజంగా ఎంతో ఉపయోగకారి అవుతుంది.

చిరంజీవి సురేష్ ఈ సిద్ధాంత వ్యాస రచనచేసి డాక్టరేట్ సంపాదించడం హర్షదాయకమైన విషయం. "విద్య యొసగును వినయంబు" అన్న మాటల్ని సార్థకం చేయగల విద్య, సత్ప్రవర్తన కలిగిన వ్యక్తి చిరంజీవి సురేష్. ఇట్టి మంచి గుణాలు ఉన్న వ్యక్తులు జీవితంలో తప్పకుండా వృద్ధిలోకి వస్తారు. త్రికరణ శుద్ధిగా కృషి చేసే సురేష్ వంటివారు తాము అభ్యున్నతిని పొందడమే కాకుండా సారస్వతానికి కూడా సేవ చేసిన వారౌతారు. డా॥ సురేష్ కూడా ఉత్తమ సాహిత్య సేవ చేసి సాహిత్యరంగంలో ఉన్నతోన్నత పదవులను చేపట్టగలడని ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.

మద్రాసు–5
12–3–'92.

# సాధువాదము


నాగళ్ల గురుప్రసాదరావు

ఆంధ్ర శాఖాధ్యక్షుఁడు

పర్వతనేని బ్రహ్మయ్య సిద్ధార్థ

స్వయం ప్రతిపత్తి కళాశాల

విజయవాడ-10


"పారిజాతము తనకంటఁ బడెడు వఱకె
ద్రుమము ద్రుమమునఁ దిరుగు మధువ్రతమ్ము;
భారత కవిత్వరుచి పట్టువడెడు వఱకె
యితర కావ్యాలు తడవు సాహిత్యవటువు"

అని పింగళి లక్ష్మీకాంతముగారు "మధుర పండితరాజము"న (పుట 37. 1962 సం॥ ప్రథమ ముద్రణము) వక్కాణించిరి-ఆంధ్ర మహాభారతము నుద్దేశించియే వారీ సూక్తి చెప్పిరని నాయూహ. వాస్తవముగా పై పద్యమునందలి మొదటి రెండు పాదములకు జగన్నాథ పండితరాయల శ్లోకము మాతృక.[1] చివరి రెండు పాదములు పింగళి మహాకవి స్వతంత్ర కల్పనము. అది సాహిత్య రసికుల యనుభవమునకు దర్పణము.

"పున్నెము పండి పండి మనభూమి కవిత్రయమున్ గడించెరా!" అని యొకచో తుమ్మల సీతారామమూర్తిగారు పలికిరి. ఉత్తమ కావ్యస్రష్టలను లెక్కించునపుడు నాటికి నేటికి ముందుగా సహృదయుల మనస్సులకెక్కు వారు నన్నయ తిక్కన యెఱ్ఱాప్రెగ్గడలే. ఆ ముగ్గురు కవుల లక్ష్యశుద్ధి, కవితా శిల్పము, పాత్రపోషణము, రసనిర్వహణము, ఔచితీపాలనము, వాక్సంయ

---

1) యావదేనం నజానాతి పారిజాతం మధువ్రతః
తావద్భ్రమణ మేవాస్య కుంజే కుంజే ద్రుమే ద్రుమే.

షము, సాన్వతో ఽదర్శనీయములు. అందున "అంధ్రావలి మోదముం కొరయు నట్లుగ" సంస్కృత మహాభారతము నాంధ్రీకరించిన యాంధ్రవ్యాసుఁడు, కవి బ్రహ్మ తిక్కన కవితాకళ నెంతని కొనియాడఁగలము?

ఋషికల్పు లయిన నన్నయ తిక్కన యెఱ్ఱాప్రెగ్గడలు వ్యాసభగవానుఁడు లోకోపకారార్థము సంస్కృతమున రచించిన భారతము తెలిఁగించిరి. అది యితిహాసము. లక్ష శ్లోక పరిమితము. సంస్కృత మహాభారతము వంటి గ్రంథము విశ్వసాహిత్యమున మృగ్యము. హోమర్ రచించిన ఇలియడ్, ఒడిస్సీ కావ్యముల జంట కంటె నెనిమిదిరెట్లు పెద్దది. అదియొక విశ్వవిజ్ఞానకోశము. దాని విషయ గౌరవములు విశ్వ సాహితీ విద్వాంసుల నాశ్చర్య చకితులను గావించెను. "ధర్మార్థ కామ మోక్షములకు సంబంధించినంతవఱకు నిక్కడ నున్నదే తక్కిన వానియందున్నది. ఇందు లేనిది మఱియెందునులేదు."[1] అని సంస్కృత మహాభారతముననే కలదు. ఇది కౌరవ పాండవుల విరోధమును, రాజ్యవినాశమును, జయ ప్రాప్తిని ఆవిష్కరించు పురావృత్తము[2] అనగా నితిహాసము. ఇతిహాసమే చరిత్ర.

సంస్కృత మహాభారత రచనా విధానమును విపులముగా గాఢముగా వీక్షించిన విద్వాంసు లందు మూడు ఘట్టములను గనుఁగొనిరి. మొదటిది 'కౌరవ పాండవ యుద్ధానంతరము వ్యాసభగవానుఁడు మూడేండ్లు దీక్షవహించి రచించిన గ్రంథము. దానిపేరు "జయ". అందు 8800ల శ్లోకములు గలవు. (అష్టౌశ్లోక సహస్రాణి హ్యష్టౌ శ్లోక శతానిచ) సంస్కృత మహాభారతముననందే రెండు మూఁడు చోట్ల జయనామధేయము కలదు. గ్రంథారంభముననందే "....జయమును

---

1) ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ!
యదిహాస్తి త దన్యత్ర య న్నేహాస్తి న తత్ క్వచిత్
ఆది. 62-53, స్వర్గారోహణ. 5-50

2) ఏవ మేతత్ పురావృత్తం తేషా మక్లిష్ట కర్మణామ్
భేదో రాజ్యవినాశశ్చ జయశ్చ జయతాం వర. ఆది. 61-53

బలుక వలయును" (జయ ముదీరయేత్) అని యున్నది. ఉద్యోగపర్వము నందును [1] స్వర్గారోహణ పర్వమునందును[2] ఈ నామము గోచరించును.

వ్యాసుని శిష్యు లయిన వైశంపాయనాదులు వేర్వేరు భారత సంహితలను వెలయించిరి. తుదకు వైశంపాయనుని భారతమే నిలిచెను. అందు 24000ల శ్లోకములు గలవు (చతుర్వింశతి సాహస్రం చక్రే భారత సంహితాం). దీనినే జనమేజయుఁడు వినెను. ఇది ఉపాఖ్యానములు లేనిది.

ఇఁక మూఁడవది సౌతి మహాభారతము. ఇది ఉపాఖ్యానములతో కూడి నట్టిది. దీనిలో లక్షశ్లోకములు గలవు. (ఇదం శతసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్య కర్మణాం, ఉపాఖ్యానైస్సహ జ్ఞేయం శ్రావ్యం భారత ముత్తమం) దీనినే రోమ హర్షణుని కుమారుఁడు, ఉగ్రశ్రవసుఁడను సూతుఁడు నైమిశారణ్యమున శౌనకాది మహర్షులకుఁ జెప్పెను.

ఆశ్వలాయన గృహ్యసూత్రముల నాఁటికే భారతము, మహాభారతము భిన్నములుగా నున్నవనియు, వైశంపాయనాదులు భారత కర్తలనియు భారతీయులు విశ్వసించిరి.[3]

సౌతి మహాభారతమునే కవిత్రయము వారనువదించిరి. మహత్త్వము వలన, భారవత్త్వము వలన మహాభారతమను పేరు సార్థక మయ్యెను.[4] మహాభారతము బహుముఖీనమయిన యితిహాసము. అది పంచమవేదము, ధర్మశాస్త్రము, పురాణము, ఇతిహాసము, రాజనీతిశాస్త్రము, కావ్యము. ఏమిగా దది?

---

1) జయోనామేతిహాసోఽయం శ్రోతవ్యో విజిగీషుణా
ఉద్యోగ. 136-18

2) జయోనామేతిహాసోఽయం శ్రోతవ్యో మోక్ష మిచ్ఛతా
స్వర్గారోహణ. 5-51

3) సుమంతు-జైమిని-వైశంపాయన-పైల-సూత్ర-భాష్య-భారత-మహాభారత-ధర్మాచార్యాః (తృప్యంతు) ఆశ్వ. గృ. సూ. III. 4. 4

4) మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే ఆది-1-274

నన్నయ మహాభారతము నందలి "ధర్మ తత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని" (ఆది. ఆశ్వా 1. ప 31) అను పీఠపద్యము మహాభారత తత్త్వము నావిష్కరించు చున్నది. రాజనీతి, యుద్ధతంత్రము, బ్రహ్మవిద్యోపదేశము నను మూఁడును మహాభారత ప్రమేయములని పింగళి లక్ష్మీకాంతము గారు చెప్పిన మాట నిజము.

చిరాయువు గుత్తా సురేష్‌బాబు ఆంధ్ర మహాభారత సముద్రమున మునిఁగి, సూక్తి రత్నము లెత్తి తెలుగు సాహితీ ప్రియుల కందిచ్చి, వారి కృతజ్ఞతకు యోగ్యుఁడయ్యెను. "ఆంధ్ర మహాభారతము-సూక్తి రత్నాకరము" అను నీ గ్రంథము మద్రాసు విశ్వవిద్యాలయమునకు సమర్పించిన సిద్ధాంత-ప్రబంధము, ఇది సురేష్ బాబునకు డాక్టరేట్ పట్టము గడించిపెట్టిన యత్కృష్ట పరిశోధ గ్రంథము.

ఈ సిద్ధాంత ప్రబంధమున నెనిమిది యధ్యాయములు గలవు. మహాభారత ప్రాశస్త్యమును మున్ముందుగాఁ బ్రకటించి, పిదప నాంధ్రమహాభారతమును సూక్తిరత్నాకరముగా నిరూపించి, ధర్మపద తత్త్వమును సూక్ష్మాతి సూక్ష్మముగా పూర్వపక్షరహితముగా సమీక్షించి, తరువాత సురేశ్‌బాబు సత్యవైశిష్ట్యమును, దానమహిమమును, దయామాధుర్యమును, పాపపుణ్య వైచక్షణ్యమును సర్వం కషముగాఁ బరిశీలించి నీతి వివేచనమును గావించెను. అంతమున అకారాదిక్రమ ముగా నానారుచిరార్థ సూక్తులను గూర్చియనుబంధముగా నిబంధించెను.

ఇందలి ప్రతిపుటయు సురేశ్‌బాబు పరిశ్రమమును నిరూపించుచున్నది ఆంధ్రమహాభారతమునందలి గద్యపద్యముల సంఖ్యను నిర్ణయించుట, అందు సూక్తులను బరిగణించుట ఆ సూక్తుల ఛందములను నిరూపించుట మున్నగు కార్యములు క్లేశకరములు. అయినను రచయితృ శ్రమ విజయాంతమయ్యెను. సూక్తిరచనకు నాంధ్రమహాభారతకవులు కందమునే యధికముగా స్వీకరించిరని సురేశ్‌బాబు నిర్ణయము. ఇది యథార్థమే.

ఈ సిద్ధాంత ప్రబంధమున సర్వత్ర సాక్షాత్కరించు మఱియొక లక్షణము సురేశ్‌బాబు పరిశీలన దక్షత. ఒక సూక్తితో ముడివడిన బహువిషయములను సర్వ పర్వములనుండి సేకరించి యొకచోట గుదిగ్రుచ్చి నిలిపి, సముచితముగా వ్యాఖ్యానించుట బహుధా ప్రశంసనీయముగా నున్నది. ఆంధ్ర మహాభారతము నందలి 21,516 గద్య పద్యములనుండి 1063 సూక్తులను సేకరించి రచయిత వివరించెను. ఇది సామాన్యకార్యము గాదు.

అయినను సురేశ్‌బాబు కొన్ని ముఖ్యసూక్తులను వదలినాఁడేమో యను సందేహము నాకుఁ గలిగినది. ఒక యుదాహరణము చూపుదును. ఉద్యోగ పర్వము ప్రథమాశ్వాసమున రాయబారిగా వచ్చిన సంజయునితో ధర్మనందనుఁ డిట్లనెను (పద్య 334).

చం. అనవుడుఁ బాండురాజ తనయాగ్రణి సంజయు మోముఁజూచియి
ట్లను: నదియెల్ల నీపలికి నట్టిద: ధర్మువు లట్లయుండి బో
ధను లరయంగ వచ్చిన నధర్మములై చెడుఁ గొన్ని,ధర్మ వ
ర్తనములుగాక తోఁచి తుది ధర్మములై చనుఁ గొన్నికర్మముల్

ఇది యసాధారణ మయిన సూక్తియని నాయభిప్రాయము. ధర్మకర్మ నిర్ణయమెంత క్లిష్టమో యిది పట్టి చూపుచున్నది. అనేక పద్యములలో నొక కొన్ని పాదములకే పరిమితమయిన సూక్తులను గ్రహించిన సురేశ్‌బాబు దీని నేల వదలెనో నా కర్థము కావుటలేదు.

కాముఁడైన సైంధవుఁడు ద్రౌపదితో ".... మనుజవిభులకుఁ బ్రమదా జనుల యెడ వావి వెదకం జనదు; వలసినట్ల వేడ్కనలుపఁగఁ జెల్లు" (అరణ్య ఆశ్వా 6. పద్య 171) నని యమను. ఇది సూక్తి యగునా? "మానవునకు నిత్య జీవితమునందు మార్గదర్శకములగు మంచిమాటలే సూక్తు"లగునని సురేశ్‌బాబు చేసిన వివరణము సైంధవుని వాక్యముల కన్వయించుటెట్లు?

ఒకచోట వ్రాఁత పొరపాటున నొకపెద్ద తప్పు దొరలినది. ".... కేవలము తెలుగునాట వెలసిన సంస్కృత భారతప్రతులు" నాలుగిటిని జూపుచు సురేశ్‌బాబు మొట్టమొదట వేదం వేంకటరాయశాస్త్రిగారు క్రీ. శ. 1850లో ముద్రించిన ప్రతిని బేర్కొనెను. ఉస్మానియా విశ్వవిద్యాలయము వారి ఆదిసభా పర్వ సంశోధితముద్రణమునకు దివాకర్ల వేంకటావధానిగారు పీఠిక వ్రాయుచు 98వ పుటలో ఆచార్య పి. పి. యస్. శాస్త్రిగారి వాక్యముల నుద్ధరించిరి. ఆ వాక్యములను బట్టి వేంకటరాయశర్మగారు 1850లో సంస్కృత మహాభారతమును ముద్రించినట్లు తెలియుచున్నది. ఆ వాక్యములనే సురేశ్‌బాబు యథాతథముగా ననుకరించెను. వేంకటరాయశర్మగారికి బదులుగా వేదం వేంకటరాయశాస్త్రిగా రెట్లులిక్కడ నిలిచిరి? అపరమల్లినాథులయిన వేదం వేంకటరాయశాస్త్రిగారు

క్రీ. శ. 1863లో జన్మించిరి. వీరుగాక పందొమ్మిదవ శతాబ్దిలో మతొక వేంకటరాయశాస్త్రి గారున్నారా?

ఇటువంటి దోషముల కేమిగాని,యీ సిద్ధాంత ప్రబంధమును జదివినపుడు మతొక కారణము వలనఁ గూడ నాకు మహానందము గలిగెను. క్షేమేంద్రుఁడు "ఔచిత్య విచారచర్చ" యను సాహిత్య శాస్త్రగ్రంథములో తత్త్వానౌచిత్యమున కుదాహరణముగా మాఘుని దని చెప్పి యొకశ్లోకము తార్కాణించెను. "ఆకలి గొన్నవారు వ్యాకరణము తినరు. దప్పికయినవారు కావ్యరసమును త్రాగరు విద్యచేత ఎవ్వరును కులము నుద్ధరింపలేదు. కావున ధనమునే సంపాదింపుము, కళలన్నియు వ్యర్థము" అని యీ శ్లోకము భావము.1

ఈ శ్లోక మీనాఁటి సామాజిక మూలతత్త్వమునకు సైతము తార్కాణమే ఈనాఁడర్థము ప్రధాన పురుషార్థము, దాని నేనీచ మార్గమున సంపాదించినను దోషముగాదు. నీతి యశక్తుని లక్షణము. ధన మింతగా నవీన సమాజమును మోహింపఁజేయుచున్నది గావుననే యుదాత్త సాహిత్య పఠనము కఱవయినది. క్షణిక సుఖము ప్రసాదించు పారస్వత పఠనము సాగుచునే యున్నది. సాహిత్యోపజీవులయిన వారే రసానంద దాయకమగు సాహిత్యపఠనమునకు స్వస్తి పలికినపు డితరులమాట చెప్పనేల?అందును ప్రాచీన సాహిత్యపఠనమునుగూర్చి పలుకఁ దగినదేముండును?

ఇట్టిచో సురేశ్‌బాబు వంటివారు పరిశోధనము పేరనైన నుదాత్తప్రౌఢ ప్రాచీన సాహిత్యమును క్షోదక్షమముగాఁ జదివి, తమ పరిశోధన ఫలమును ప్రకటించినపుడు విస్తృతసాతదృష్టి గల సహృదయు లెవరైనను సంతోషింతురు. సురేశ్‌బాబు ఇంతకంటెక్కుమిన్నగా నాంధ్రసాహితీసేవచేసి,సుస్థిరములయిన పదవీ ప్రతిష్ఠల సముపార్జించును గాక! యని యాశీర్వదించుచున్నాను.

పీఠిక వ్రాయుఁడని నన్నుఁ గోరి గౌరవించిన యీసాటియోజ్ఞకు సర్వదా సర్వథా కృతజ్ఞుఁడను.

---

1) బుభుక్షితైః వ్యాకరణం న భుజ్యతే
పిపాసితైః కావ్యరసో నపీయతే
న విద్యయా కేనచి దుద్ధృతం కులం
హిరణ్య మేవార్జయ; నిష్ఫలాః కలాః

# కృతజ్ఞతలు

1989 వ సంవత్సరము డిసెంబరు నెలలో మద్రాసు విశ్వ విద్యాలయము నకు పి. హెచ్. డి. పట్టము కొరకు సమర్పింపబడిన ఈ సిద్ధాంత గ్రంథ రచ నకు ప్రధాన కారకులయిన—

ఎం. ఫిల్ చేయకుండగనే 'సరాసరి' పి హెచ్. డి. పరిశోధన చేయు టకు అనుమతించిన మద్రాసు విశ్వ విద్యాలయాధి కారులకు—

1986 వ సంవత్సరము డిసెంబరు మాసములో ప్రెసిడెన్సీ కళాశాలలో చేర్చుకొని పరిశోధన కవకాశమిచ్చిన ప్రెసిడెన్సీ కళాశాల ప్రిన్సిపలు గారికి—

పరిశోధన చేయుటకు ప్రోత్సహించి ఆశీర్వదించిన ఆనాటి తెలుగు శాఖాధ్యక్షులు గురువులు ఆచార్య శ్రీ సాళ్వ కృష్ణమూర్తి గారికి—

పరిశోధన గావించుటకు వెన్నుదట్టి, సలహాల నిచ్చిన ఈనాటి మా తెలుగు శాఖాధ్యక్షులు గురువులు ఆచార్య శ్రీ దేవళ్ళ చిన్ని కృష్ణయ్య గారికి—

ఈ లోకము నందు సుగుణవంతుడైన మానవునకు గురువు, తండ్రి తల్లి, దైవము ఉత్తరోత్తరము బలీయమైన ఆరాధ్యులు, నాకు జన్మమును ప్రసాదించిన అస్మదీయ జననీ జనకులకు—

విద్యా బుద్ధులు కరపిన బోళా శంకరులు గురుదేవులు శ్రీ లింగం నేని జనవ శంకరరావు గారికి, గురుపత్ని శ్రీమతి సుజాతమ్మ గారికి—

తనదైన మహిమతో నాకు మానవ జన్మమును దయచేసి అనుదినము ప్రపంచ లీలలను దర్శింపజేయుచున్న ఆ పరమేశ్వరునకు—భక్తి ప్రపత్తు లతో కృతజ్ఞతాభి వందనములు—

అలసిన వేళలో నాకు మనోబలమును చేకూర్చిన నా తోడబుట్టువు సౌభాగ్యవతి కృష్ణకుమారికి, బావగారు పొట్లూరి రామకృష్ణ గారికి కృతజ్ఞతాభి వందనలు___

ఆశీర్వదించిన గురువర్యులు డాక్టర్ వి. రామచంద్ర చౌదరిగారికి, గురువులు, సాహితీ మార్గదర్శకులు శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారికి, మనః పూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణ సమయంలో ప్రూఫ్ రీడింగ్ చేసిన, ధైర్యమిచ్చిన మిత్రుడు డాక్టర్ కిలారి సురేంద్ర గారికి,

సామాజిక, నైతిక బలాన్ని ఇచ్చి ప్రోత్సహించిన పొత్తూరి వెంకటేశ్వర్లు గారికి, అన్నయ్యలు జయకుమార్, రాజ్‌కుమార్, బదరీనాథ్ గార్లకు. మిత్రులు దశరథరామ్, వీరభద్రరావు, కోటేశ్వరరావు గార్లకు హృదయ పూర్వక కృతజ్ఞ తాభి వందనములు.

గుత్తా సురేష్ బాబు

9-3-1998

# విజ్ఞాపనలు

ఈ సిద్ధాంత గ్రంథ రచనలో స్పష్టత కొరకు సంస్కృతము నందును, ఆంధ్రము నందును కొన్నిచోట్ల విసంధి పాటించబడినది—

ఉదాహృత పద్యములందే అర్ధబిందువు, మరియు శకట రేఫము పాటించ బడినది—కాని అలవాటు బలిమిచే ఎక్కడైనను కొన్ని తావులందు వ్రాతలో శకటరేఫ ముండవచ్చును—

ఈ పరిశోధనకు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటింపబడిన ఆంధ్ర మహాభారత ప్రతులు పరిగ్రహింపబడినవి-పద్యసంఖ్యా నిర్దేశము ఈ ప్రతుల ననుసరించియే యున్నది—

ఈ సిద్ధాంత గ్రంథరచనకు ఉపయోగపడిన ప్రధాన గ్రంథములు మాత్రమే ఉపయుక్త గ్రంథ సూచికలో నీయబడినవి—మరియు నా గ్రంథములు సుప్రసిద్ధములైన వగుటచే ప్రచురణ సంస్థలు, సంవత్సరములు ఇత్యాది విషయ ములు ఉజ్జగింపబడినవి-పరిశోధనా పద్ధతులకు వ్యతిరిక్తముగా నొనరింప వలయు నన్ను ఇచ్చ మాత్రము కాదని మనవి—

మద్రాసు విశ్వ విద్యాలయము వారి నిబంధనల ననుసరించి ఈ సిద్ధాంత గ్రంథము సంగ్రహముగ రెండువందల ఏబది పుటలకు పెద్దగా పెరుగకుండ రచింపబడిన దనుట గమనార్హము....

మహాభారతముపై ఇతః పూర్వము పరిశోధన చేసిన మహోదయు లంద రికి వందనములు—

విబుధాళికి వినయాంజలి.

# విషయ సూచిక

# ఇష్ట ప్రార్థనము

సీ. ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని
యధ్యాత్మ విదులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్య మనియు
లాక్షణికులు సర్వ లక్ష్య సంగ్రహమని
యైతి హాసికు లితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁగొని యాడు చుండ

ఆ. వివిధ వేద తత్త్వ వేది వేద వ్యాసుఁ
డాది ముని పరాశరాత్మ జుండు
విష్ణు సన్నిభుండు విశ్వ జనీనమై
పరఁగు చుండఁ జేసె భారతంబు [ఆది-1-32]

# పరిశోధనోపక్రమము

వేదములు ప్రభు సమ్మితములు-పురాణములు మిత్రసమ్మితములు కావ్యములు కాంతా సమ్మితములు-ఈ లక్షణత్రయము మహాభారతము నందుండుటచే నిది పంచమ వేదముగను పురాణ సముచ్చయముగను, ఒక మహా కావ్యముగను పరిగణింపబడుచున్నది. బ్రహ్మ చతుర్ముఖములనుండి ఉదయించిన వేదములు తొలుత ఏకీభూతములై ఉండగా పారాశర్యుడు వానిని చతుర్వేదములుగా వ్యాసము చేసిన కారణముగా నాతడు వేదవ్యాస భగవానుడుగ ప్రకీర్తితుడైనాడు. వేదవ్యాస కృతమైన భారతము పంచమ వేదముగ, పరమ పవిత్ర గ్రంథముగ పరిగణింపబడుటలో నాశ్చర్యములేదు-భారతము నందలి ప్రధానకథ కురుపాండవులది. వీరి వంశ బీజకారకుడు వ్యాసుడే.

వేదవ్యాసుడు భారతమును లోకహితార్థముగ సంవత్సరత్రయము నిర్మించినాడు-తొలుత ఈ గ్రంథరాజము జయనామక భారతేతిహాసముగ 8800 శ్లోకములతో విరాజిల్లినది-దీనిని దేవలోకమునందు వక్కాణింప నారదుని పంచెనట-పితృలోకమునందు పరివ్యాప్తి నొందిప అసితుండైన దేవలుం బంచివాడు వ్యాసుడు, మరియు గరుడ గంధర్వ యక్షాదిలోకములందు ప్రవచించుటకై నిజ పుత్రుడగు శుకుని పంపించెను. నాగలోకమునందు వక్కాణింప శిష్యుడగు సుమంతుని పంచినాడు, మానవలోకమునందు పచించుటకై నిజశిష్యుడైన వైశంపాయనుని నియోగించినాడు. జనమేజయుని సత్రయాగమున వైశంపాయనునిచే ప్రవచింపబడిన భారతము-24000 శ్లోక విస్తృతమని పరిశోధకుల భావన. పిమ్మట ఈ కథ కథాకథన దక్షుడగు రౌమహర్షణిచే నైమిశారణ్యమున శౌనకాది మహామునులకు చెప్పబడునపుడు శాఖోపశాఖలుగ విస్తరిల్లి, అనేకోపాఖ్యాన సంభరితమై లక్ష శ్లోకములు పైగా నభివృద్ధి చెంది మహాభారతమైనదని చెప్పుదురు-

అష్టాదశ పురాణములతో సమానముగ తులతూగు నీ మహాభారతము అష్టాదశపర్వ సమంచితము-ఇందలి భగవద్గీత అష్టాదశాధ్యాయి-కురుక్షేత్ర

సంగ్రామమున పాల్గొనిన సైన్యము అష్టాదశాక్షౌహిణీ సమన్వితము-కురుపాండవ సంగరము నడచినది అష్టాదశ దినములందగుటచే నీ మహాభారతమునకు అష్టాదశమునకేదో ఒక అవినాభావ సంబంధమున్నది-

శ్రీ మహాభారతము నందు నీతి ధర్మశాస్త్రార్థ రహస్యములు, చతుర్వేద సారము, చతుర్వర్గ వర్గానుబంధ బంధుర కథేతిహాసములు, చతుర్యుగ మహాక్షితి రాజవంశ చరితలు, చతుర్వర్ణాశ్రమ ధర్మక్రమములు, శ్రీకృష్ణ పరమాత్మని మాహాత్మ్యము, భీష్మ, ధర్మజాది పాండవవీరుల మహాగుణములు కీర్తింపబడినవి. ఈ గ్రంథరాజము ధర్మార్థకామమోక్షాది పురుషార్థ ప్రదానార్థమై సంతరింపబడినది. నిఖిలలోక హితార్థము, లోకోద్ధరణమునకై మహాభారతమును వేదవ్యాసుడు విరచించినాడు-ధర్మము, సత్యము, యోగము, ఆధ్యాత్మికవిషయ బోధనార్థమై ఈ కావ్యము సృజింపబడినది- ఐహికాముష్మికములకు సంబంధించిన సర్వధర్మ సమంచితమైనదీ గ్రంథము. ఇందు ప్రాచీన భారతీయార్ష విజ్ఞానము, ప్రజల సంస్కృతి, నాగరకత, చిత్తవృత్తి ప్రతిబింబించు చున్నది. సంస్కృత సాహిత్యమునందే కాదు ప్రపంచ సాహిత్యమునందును నింతటి ఉద్గ్రంథము 'నభూతో నభవిష్యతి' అనిన అతిశయోక్తి కానేరదు.

మహాభారతము నందు చెప్పబడినదియే ఇతర గ్రంథములందును కలదు- ఈ గ్రంథరాజములో నేదిలేదో అది ఏ ఇతర గ్రంథములందును కానరాదట. అందువలన మహాభారతము అవశ్య పఠనీయ గ్రంథమగుటలో నాశ్చర్యమేమి? మహాభారతము ప్రాతస్మరణీయమైన ఒక పరమ పవిత్ర గ్రంథము. ఈ మహాభారతము పఠించువారి మనఃప్రవృత్తి ననుసరించి వారివారి చిత్తవృత్తి కనుగుణముగ-ధర్మశాస్త్రముగను, వేదాంతముగను, నీతిశాస్త్రముగను, మహాకావ్యముగను, సర్వలక్ష్య సంగ్రహముగను, ఇతిహాసముగను, బహుపురాణ సముచ్చయముగను గోచరించు చుండును.

మహాభారత కథకు ఉత్తర హిందూదేశమునందు కంటె దక్షిణ హిందూదేశమునందు ప్రాముఖ్యము చాల ఎక్కువ-అందును ఆంధ్రదేశమునందు భారతమునకు 'భారీ' ప్రచారమున్నది-'వింటే భారతమే వినాలి-తింటే గారెలే తినాలి' అనెడి నానుడి ఆంధ్రులందుగలదు, పలనాటి కథను పలనాటి భారతముగ

నాంధ్రులు పేర్కొనుచున్నారనగ వారికి భారతముపై గల మోజు యెంతటిదో వేరుగ చెప్పనక్కరలేదు.

దాదాపు ఒకలక్ష శ్లోకములతో నున్న సంస్కృత మహాభారతమును కవిత్రయమువారు 21,516 పద్యగద్యములతో నొక చంపూకావ్యముగ నాంధ్రీకరించినారు. పూర్వకాలమున నాంధ్ర దేశమునందు దేవాలయములలోనో, పంచలలోనో మహా భారతకావ్య పాఠప్రవచనములు జరుగుచుండెడివి. హరికథలలో భారతకథ సంకీర్తింప బడెడిది. కాలము మారినది. జీవన సరళి మారిపోయినది. చలన చిత్రములు, దూరదర్శనులు వచ్చి పాఠ ప్రవచనములు, హరికథా కాలక్షేపములు అంతరించినవి. జానపదులు చలన చిత్రములద్వార, దూరదర్శినులందు ప్రసారమగు భారతకథలద్వార భారతకథాకాలక్షేపము గావించుచున్నారు.

దాదాపు ద్వావింశతి సహస్ర పద్య గద్యములతో విలసిల్లుచున్న ఆంధ్ర మహాభారతమును శ్రద్ధతో ఏకబిగువున పఠించు పండిత జనులే కరవగుచున్నారు. ఆంధ్ర మహాభారతమునంతను చదివితిమని గుండెమీద చేయివైచుకొని చెప్పగల ఆంధ్రపండితులెందరున్నారు? ఆంధ్రకవితా పితామహుడగు అల్లసాని పెద్దన కృతమను చరిత్ర కావ్యమును మొదటి మూడాశ్వాసములు మాత్రమే పఠించి ముగించుచున్న ఈ కాలములో మహా భారతమువంటి సుదీర్ఘ కావ్యమునంతయు చదువగల ఓర్పు నేర్పు ఎంతమందికి ఉన్నది. సందర్భాను సారముగ కొన్ని ఉపాఖ్యానములనో, అవసరమైన ప్రధానకథా ఘట్టములనో పరిశీలించుటయేగాని భారత కావ్యమునంతను చదువువారరుదు మహాభారతముపై పరిశోధన చేయువారు మాత్రము ఆద్యంతములు చదువు చున్నారు.

ఈ మహాభారతముపై జరిగినంతటి పరిశోధనా వ్యాసంగము ఆంధ్ర వాఙ్మయమున మరి ఏఇతర గ్రంథముపైనను జరుగలేదనుట అతిశయోక్తికాదు. మహాభారతమునందలి రసము, అలంకారము, వర్ణనలు, మానవప్రవృత్తి ప్రధాన పాత్రలగు శ్రీకృష్ణుడు, భీష్ముడు, ద్రోణుడు, దుర్యోధనుడు, ద్రౌపది అర్జునుడు, కర్ణుడు మున్నగు పెక్కు అంశములపై పరిశోధనా గ్రంథములు వెలువడుచునే యున్నవి. కాని ఆంధ్ర మహాభారతము నందలి సూక్తులపై ఎవరి దృష్టి ప్రసరించలేదు. కావున 'ఆంధ్ర మహాభారతము సూక్తి రత్నాకరము'

అను విషయముపై పరిశోధనావశ్యకత అవశ్యము అనుసంధింప దగినది-విజ్ఞునకు మహాభారతము నందలి వివిధ సూక్తులు నిత్యజీవితము నందు మానవులు అనుసరించి పాటింపదగినవి. భారత గత సూక్తుల వైశిష్ట్యమును. పరిశీలించుటయే ప్రస్తుత పరిశోధనలోని ప్రధానోద్దేశము.

ఆంధ్ర మహాభారతములోని సూక్తుల పరిశీలనయేపరిశోధన గ్రంథమున గలదు-సంస్కృత మూలముతో భేదసాదృశ్యముల పరిశీలన ఈ సిద్ధాంత గ్రంథమునందు వ్యగ్యము, అది ఒక ప్రత్యేక పరిశోధన గ్రంథమగును. కేవలము ఆంధ్ర మహాభారతము నందలి సూక్తులు మాత్రమే ఈ పరిశోధన సిద్ధాంత గ్రంథములో చోటు చేసికొన్నవి.

మహాభారత సముద్రమును దరియంగ నీదుట విధాతృనకైనను నేరబోలునె? అని నన్నయ ప్రశ్నించినాడు. మరి బాల స్వభావుడైన నేనెక్కడ? 'మహాగజాః పలాయన్తే మశకానాంతుకాకథా'- నా సంగతి వేరు చెప్పనేల? 21, 5.6 పద్యగద్య సంభరితమైన ఆంధ్రమహాభారతము నా మూలాగ్రముగ పఠించుటయే కష్టసాధ్యము. అందలి సూక్తులన్నిటిని ఏరి కూర్చుట మరికొంత కష్టసాధ్యమైనది-పునరుక్తములైన సూక్తులు కొన్ని ఎక్కడైనను తప్పిపోయి యుండనగును. కొన్ని సూక్తులు పరిశోధకుని కనుబ్రామి యుండనోపును-మొత్తము పరిశోధనలో లభించిన సూక్తుల సంఖ్య 1063. ఆంధ్ర మహాభారతమొక సూక్తి రత్నాకరముగా పున గంభీరులైన వారు మరింత గంభీరముగ శోధించిన మరికొన్ని సూక్తులు లభింపవచ్చునేమో? లభించిన సూక్తులనన్నిటిని అకారాదిక్రమము ననుసరించి అనుబంధమున సంకలనము చేయుట జరిగినది-

సహస్రముపైగా గల సూక్తులను విశ్లేషించి వివరించుటయే ఈ పరిశోధనావశ్యకత. ఈ సిద్ధాంత గ్రంథము 'ఆంధ్ర మహాభారతము-సూక్తిరత్నాకరము' మను పేర వెలయింపబడుచున్నది-ఈ సిద్ధాంత గ్రంథము అష్టాధ్యాయ సమన్వితము-

'మహాభారత ప్రాశస్త్యము'ను నీ ప్రథమాధ్యాయము నందు- వ్యాస భగవానుడు, భారత విస్తరణ, పర్వసంఖ్యావిషయము, అష్టాదశ వైశిష్ట్యము, కర్త-వక్త-శ్రోత, భారతరచనాకారణము, మహాభారత ప్రాశస్త్యము, భారతము

ఆంధ్రులు, సంస్కృత మహాభారత శ్లోకసంఖ్య, మహాభారతాంధ్రీకరణోద్దేశము ఆంధ్రమహాభారత పద్య గద్య సంఖ్య, ఫలశ్రుతి, సంస్కృత భారత ప్రతులు, ఆంధ్రభారత ప్రతులు, మహాభారతకాలము, మున్నగు నంశములు పరిశీలింప బడినవి.

ద్వితీయాధ్యాయమగు 'ఆంధ్రమహాభారతము-సూక్తిరత్నాకరము'నందు- కావ్యప్రయోజనములు, ఉక్తి భేదములు, సూక్తిప్రస్తావనలు, పూర్వకవుల సూక్తులు-సూక్తినిర్వచనము, సూక్తులపద్య గద్య సంఖ్య, సూక్తులు-శాంతిపర్వ ప్రాధాన్యము, సూక్తులు-ఛందములపట్టిక, సూక్తులు-కందపద్య ప్రాధాన్యము, ప్రధానసూక్తులు-సూక్తులు నాడు-నేడు మున్నగు విషయములన్నియు శీలింప బడినవి.

'ధర్మవివరణము' అనునది తృతీయాధ్యాయము-ఇందు ధర్మపద ప్రయోగము, ధర్మలక్షణము, ధర్మ సందేహనివృత్తి మార్గము-ధర్మశాస్త్రోత్పత్తి, ధర్మరక్షణము, ధర్మనిర్వచనము, ధర్మార్థకామములు, ధర్మము, అర్థము, కామము, మోక్షము గృహస్థధర్మము, లోకధర్మము, రాజధర్మము, యుద్ధధర్మములు, ఉదాహరణ సహితముగ వివరింపబడినవి-

చతుర్థాధ్యాయమగు 'సత్యవైశిష్ట్యము' నందు సత్యపద ప్రయోగము, సత్యనిర్వచనము, సత్యదర్శి, సత్యవాక్ప్రబంధము, సత్య సమన్వితులు, మౌన వ్రతము, పలుకుల భేదములు, పలుకులబప్పు అప్రియములగు పల్కులు, పథ్యమగు పలుకు, వాఙ్నియతి, పలుకువినమి ఫలము, సత్యాన్వేషణ, సత్యపరిశీలనము, సత్యవ్రతము, సత్యమహిమ, సత్యఫలము, అసత్యఫలము, సత్యమాడరాని సందర్భములు, సత్యాసత్యముల ధర్మ సూక్ష్మత, అసత్యము పల్కనగు సందర్భములు, సత్యస్థాపన మున్నగు నంశము లన్నియు నను శీలింపబడినవి-

'దాన మహిమము' అను పంచమాధ్యాయమునందు-దాత జనన సంశయము, మహాదాతలు, యశఃకాయులు, దాత గుణములు, దానమిచ్చి తీసికొనుట, న్యాయాన్యాయార్జిత ధనదానము, ధర్మాధర్మ లబ్ధదానము, అయాచకదానము, పాత్రతాపాత్రతలు, దాన విశేషములు, ప్రాణదానము, భూదానము, ధనదానము, సువర్ణదానము, గోదానము, అన్నదానము, పానీయదానము, తటాక నిర్మాణ ఫలవిశేషము, తిలదానము, ధూపదీపదానము, వానిఫలములు విశేషింపబడినవి.

షష్ఠాధ్యాయము 'దయామాధుర్యము'ను వివరించుచున్నది. ఇందు మానవ దయ, భూతదయ, దయాగుణము, హింస, అహింస, దయాఫలము, భూతరక్షణ, క్రౌర్య గుణము, కారుణ్య గుణము అను శీర్షికలలో సూక్తులు కొన్ని వివరింప బడినవి.

'పాపపుణ్య వైచక్షణ్యము' అనునది సప్తమాధ్యాయము. ఈ అధ్యాయము నందు పాప కార్యములు, పాపరహిత కార్యములు, పాపప్రక్షాళనము, పాప ఫలములు, పుణ్యకార్యములు, పుణ్యఫలములు మరియు కర్మఫలములు అను నంశము లన్నియు వివక్షింపబడినవి.

అష్టమాధ్యాయమగు 'నీతి వివేచనము' నందు లోకనీతి, రాజనీతి, యుద్ధనీతి, అను శీర్షికలలో భారతము నందలి నీతిని వివేచించు సూక్తులు వివరింపబడినవి.

ఈ సిద్ధాంత గ్రంథాంతము నందలి అనుబంధములో ఆంధ్రమహాభారతము నందలి నానారుచిరార్థ సూక్తులు అకారాది క్రమములో పొందుపరప బడినవి. మధుకరము లెట్లు మధువును అనేక పుష్పముల నుండి సంగ్రహించి తేనెతుట్టగా నేర్పరచు చుండునో అట్లే ఆంధ్ర మహాభారతము నందలి సూక్తులు అనేక పర్వములనుండి గ్రహింపబడి ఇందు సంకలనము చేయబడినవి. సూక్తుల నన్నిటిని సంకలనము చేయుట ఒక ఎత్తు, వానిని విశ్లేషించి ఈ సిద్ధాంత గ్రంథమును రూపొందించుట మరియొకఎత్తు.

గుణగ్రాహులు ఈసిద్ధాంత గ్రంథ మకరందమును గ్రోలుదురు గాక. దోషగ్రాహులు ఈ తేనెతుట్టులోని పిప్పిని వేర్పాటు చేయుదురు గాక. సద్విమర్శకులు చూపించు లోపములను సహృదయముతో సవరించు కొనువాడను 'కష్టేన లిఖితమ్ గ్రంథమ'నుట అనుభవైక వేద్యము. ఈలోకమున అనుభవించు వారికే అందలి కష్టము తెలియునుగాని అనుభవింపని వారికేమి తెలియును? ఈ విషయమును సుబోధకము గావించు సంస్కృత సూక్తి యొకటి స్ఫురణకు వచ్చుచున్నది.

శ్లో. "విద్వానేవ విజానాతి-విద్వజ్జన పరిశ్రమమ్
నహివంధ్యా విజానాతి-గుర్వీం ప్రసవ వేదనామ్"

'సర్వే జనాస్సుఖినో భవంతు'

# మహాభారత ప్రాశస్త్యము

వేదములు ప్రభు సమ్మితములు. పురాణములు మిత్ర సమ్మితములు. కావ్యములు కాంతా సమ్మితములు. మహాభారతము ఈమూడు లక్షణములతో నొప్పారు చున్నది. వేదమువోలె భారత మొకప్పుడు శాసించును. పురాణమువలె భారత మొకచో బోధించును-కావ్యమువలె నక్కడక్కడ లాలించి హిత బోధ గావించును. వేదాంతార్థ మిందిమిడి యుండుటచే నీ గ్రంథరాజము పంచమ వేదముగ పరిగణితము. పురాణ సముచ్చయ సమన్వితమగుటచే నీ భారతము మహాపురాణముగ పేర్కొనబడుచున్నది. కావ్యలక్షణాన్వితమై నలరారు చుండుటచే నిద్దానిని మహా కావ్యముగ కీర్తించుచున్నారు. ఇంతటి సర్వలక్షణ సమన్వితమగు నీ మహాభారత కర్త మహోదయుడగు వేదవ్యాసుడు.

## వ్యాసభగవానుడు :

ఇతడనేక నామములచే స్తుతింపబడుచున్నాడు. వ్యాసుడు సత్యవతీ పరాశరాత్మజుడు. పరాశరాత్మజుడగుటచే పారాశర్యుడుగ ప్రకీర్తితుడు. సత్యవతీ తనయుడగుటచే సాత్యవతేయుడు. కృష్ణద్వీపమున నుదయించుటచే కృష్ణద్వైపాయనుడుగ కీర్తితుడు. వేదములు సృష్టి కర్తయగు బ్రహ్మ చతుర్ముఖముల నుండి వెలువడినవి. అప్పుడవి ఏకరాశీ భూతములై నొప్పినవి ఏకీభూతములై ఏర్పడకుండ 'కలగాపులగముగ' నున్న ఆ వేదములను, కష్టసాధ్యములైన వానిని వ్యాసము చేసినదీ పరాశరాత్మజుడే.1 అందువలన నితడు వేదవ్యాసుడైనాడు-బ్రహ్మముఖ గహ్వరములనుండి జనించుటచే నీ వేదములు అపౌరుషేయములుగ పరిగణింపబడుచున్నవి. చతుర్ముఖములనుండి ఉదయించిన ఈ వేదములను చతుర్వేదములుగ ఋగ్యజుస్సామాథర్వణ వేదములుగ విభజించినాడీ వేదవ్యాసుడు-చతుర్ముఖములనుండి వెలువడిన వానిని చతుర్విధములుగ వింగడించుట సమంజసముగ నున్నది.

'వ్యాసో నారాయణో హరిః' అని స్తోత్రము. వ్యాసుని సాక్షాత్తు విష్ణువుగ పేర్కొనుట గలదు. వ్యాసుడు విష్ణ్వంశ సంభూతుడు. నారాయణుని అవతార

మునులలో నొకడుగ స్తుతింపబడుచున్నాడు. వ్యాస-విష్ణువులకభేదము చెప్పబడు చున్నది. "వ్యాసాయవిష్ణు రూపాయ

వ్యాసరూపాయ విష్ణవే" అని కీర్తించుట వైష్ణవులందరు ఎరిగినదియే- అందువలననితడు వ్యాసభగవానుడుగ కొనియాడబడుచున్నాడు. ఇంతటి మహో దయుని కృతమగుటచే మహాభారతము పంచమవేదమై పరగుచు, పరమ పవిత్ర మైన ప్రామాణిక గ్రంథముగ సర్వమానవాళిచే సంకీర్తింపబడుచున్నది.

వ్యాసభగవానుడీ మహాభారతములో నొక ప్రధానపాత్ర. కౌరవపాండ వంశ బీజకారకుడు-కౌరవపాండవులు ఇతని సంతతియే- మహాభారతకథ ప్రారంభమునుండి అంతమువరకు మిగిలియున్న ప్రధానపాత్ర వేదవ్యాసు డొక్కడే-భారతమునందంతర్వాహినిగ నీతనికథ యుండుటచే నొకరకముగ దీనిని వేదవ్యాసుని స్వీయచరిత్ర (Auto biography)గ పేర్కొన వచ్చునా? అను ప్రశ్న ఉదయించును. కాని నాయకుడు ధర్మజుడు గదా! భారతమునందలి ప్రధానకథ కౌరవపాండవులదే గాని వేదవ్యాసునిది కాకపోవుటచే నిద్దానిని వ్యాసుని స్వీయ చరిత్రగ పేర్కొనుట సమంజసముకాదు. స్వీయచరిత్ర వంటిది అనిన ప్రామాదికముకాదు-వ్యాసులు పెక్కురు కలరను వాదమొకటి కలదు ఒక్కొక్క కాలమున ఒక వ్యాసుడు కలడనియు, వ్యాసపీఠమొకటి కలదని యును చెప్పుదురు.

**భారత విస్తరణ :**

వేదవ్యాసుడు భారతమును లోకహితార్థము సంవత్సరత్రయంబు వినిర్మించినాడు. [3] మరియు నీ గ్రంథరాజమును నిఖిలలోకములందు వ్యాప్తి గావింపదలచినాడు-వ్యాస కృతమగు నీ భారతము తొలుత జయభారతముగ ప్రసిద్ధినొందెనందురు. ఈ జయనామక భారతేతిహాసమును 8800 శ్లోకములతో వ్యాసభగవానుడు రచించి. దానిని దేవలోకమునందు వక్కాణించుటకై నారదుని పంచెను, పితృలోకమునందు వ్యాప్తి నొందింప అసితుండైన దేవలుంబనిచెను. గరుడ గంధర్వయక్షాది లోకములందు ప్రవచించుటకై నిజపుత్రుడగు శుకుని పంపించినాడు. నాగలోకమునందు వక్కాణింప సుమంతుని పంచినాడు. మరియు మనుష్యలోకమున వక్కాణించుటకై వైశంపాయనుని నియోగించినాడు. [4]ఈ

వీవురి కారణముగ గ్రంథము ప్రక్షిప్తములతో, విస్తరణలతోనభివృద్ధి పొంది భారతముగ పరిణతి నొందినదందురు. జనమేజయుని సత్రయాగ సందర్భమున వైశంపాయనునిచే పఠింపబడిన భారతము 24, 000 శ్లోక విస్తృతమని విమర్శకులు భావించుచున్నారు. 5 ఈ కథను సుపౌరాణికుడగు ఉగ్రశ్రవసుడను సూతుడు వినినాడు. సూతుడు రోమహర్షణుని కుమారుడగుటచే రౌమహర్షణిగ ప్రఖ్యాతుడు, మరియునితడు సౌతి. ఉగ్రశ్రవుని తండ్రి రోమహర్షణుడు కూడ వేద వ్యాసునిశిష్యుడే[6] బహుపురాణ కథా కథన దక్షుడగు రౌమహర్షణి కారణముగ భారతముశాఖోప శాఖలుగ విస్తరింపబడి లక్షశ్లోక సమన్వితమై మహాభారతముగ పరిణతి నొందినది.

## పర్వ సంఖ్యా విషయము :

మహాభారతమునందలి ప్రధానకథ స్త్రీ పర్వముతో ముగియుచుండుటచే తొలుత నీ గ్రంథము-అష్టాదశపర్వ సంభరితము గాదని కొందరు విమర్శకులు తలంచిరి, స్త్రీ పర్వకథతో కౌరవపాండవ సంగ్రామము సమాప్తమైనది. తరువాతి కథ కాలక్రమమున అనుసంధిపబడినదందురు-కాని తొలుతనుండియు భారతము అష్టాదశపర్వ సమన్వితమేనని పలువురు పండిత విమర్శకులు భావించుచున్నారు. వ్యాసకృత జయనామక భారతమును కొందరీ విధముగ వ్యాఖ్యానించుచున్నారు. కటపయాది సూత్రాను సారముగ-జ=8, య=1 'అంగానామ్ వామతోగతిః' అనెడి మర్యాదననుసరించి 18 అగుటచే, జయభారతము నందే 18 పర్వములు కలవని చెప్పుదురు- ఈ అష్టాదశ పర్వములే' ఉపపర్వ మహాపర్వోపపర్వ'విభాజ్యములై శతపర్వ సమంచితమైనది. హరివంశము భారతమునకు ఖిలపర్వము. నన్నయకూడ హరివంశంబు, భవిష్యత్పర్వంబు నను మహా శతపర్వములు కలిగిన భారతమునే పేర్కొనుట గమనార్హము.

## అష్టాదశ వైశిష్ట్యము :

భారత కర్తయగు వేదవ్యాసుడు అష్టాదశ పురాణములను రచించి యున్నాడు. మహాభారతము అష్టాదశ మహాపర్వ సమన్వితము. మహాభారతమునకు భగవద్గీత తలమానికము వంటిది. ఇదియు అష్టాదశాధ్యాయ సమంచితమే మరియు కురుపాండవ సంగ్రామమున నిరుపక్షముల చేరిన సైన్యము అష్టాదశా

క్షౌహిణీ సంభరితము, అంతియేకాదు కురుపాండవ యుద్ధము జరిగినది కూడ-అష్టాదశదినములందే-కావున అష్టాదశ శబ్దమునకు వేదవ్యాసకృత పురాణ. భారతములకు నవినాభావ సంబంధము గలదు-

కర్త-వక్త-శ్రోత :

మహాభారత కర్తయగు వ్యాసుడు నిజ తపో మహత్త్వమున బ్రహ్మను మెప్పించినాడు. ఏకీభూతములై యున్న వేదముల విభాగించి, నిజశిష్యులగు పైల వైశంపాయన సుమంత జైమినులచే చతుర్వేద సూత్రములను చేయించినవాడు-నన్నయ వేదవ్యాసునెట్లు సంస్తుతించి పూజించినాడో చూడుడు-

ఉ॥ భారత భారతీ శుభగభస్తిచయంబులఁజేసి ఘోరసం
సార వికార సంతమస జాల విజృంభము వాపి సూరిచే
తోరుచిరాబ్జబోధన రతుండగు దివ్యపరాశరాత్మ జాం
భోరుహమిత్రుఁ గొల్చెముని పూజితుభూరియశో విరాజితున్.(ఆది-1-22)

వక్తయగు రౌమహర్షణి వాక్కులతో వేదవ్యాసుని మహిమ ఇట్లు కొనియాడబడు చున్నది.

సీ॥ "........ మేటి మునీశ్వర
సంఘబుంలో నెల్ల సత్యదర్శి
సర్వ విధిజ్ఞాత సర్వవిజ్ఞాన భ
వ్యాత్ముండు సర్వేంద్రియ ప్రబోధ
శాలి సర్వజ్ఞుండు శౌచ శాంతి క్షమా
దాంతి తపో నిత్యతా విభాసి
తే॥ యాప్తసర్వవిధైశ్వర్యుఁడఖిల సాంఖ్య
యోగ భేద విదుండు ధర్మోపదేశ
చతుర వాగ్విలాసుండు నిస్తత్వ వస్తు
వేది సాత్యవతేయుండు వేదమయుఁడు" [స్వర్గ-80]

వక్తయగు రౌమహర్షణి సుప్రసిద్ధ పౌరాణికుడు-ఇతవి తండ్రి రోమహర్షణుడు సాత్యవతేయ శిష్యుడు, మరియు పండితప్రవరుడు (ఆది-1-29).

జనమేజయు సర్పయాగ సమయమునందు వైశంపాయనునిచే ప్రవచింపబడిన మహాభారతమును తత్సభాగతుడైన రోమహర్షణి దత్తావధానుడై ఆకర్ణించినవాడు. కథాకథన దక్షుడితడు. మరియు కృష్ణద్వైపాయను నను గ్రహాకారణముగ మహాభారత కథాసాకల్య వివరణ విశారదుడు (సర్గ- 77). శౌనకాది మహామునులచే నపరిమిత విశేష విధుల పూజింపబడిన పుణ్యాత్ముడీ సూతుడు.

మహాభారతమును వైశంపాయనుడు ప్రవచించిన పిదప నైమిశారణ్యమను పుణ్యక్షేత్రమునందు సూతునిచే నది పునః ప్రవచింపబడినది. ఈ పుణ్యక్షేత్రమునందు శౌనకుడను పరమ పౌరాణికులపతి-ద్వాదశ వార్షికోత్తమ సత్రయాగమును బ్రహ్మర్షిగణ సముపాసితుడై ఆచరించుచుండెను. అక్కడకు రోమహర్షణి పోయెను. అంత ఆ మునినికాయమెల్ల వివిధ పుణ్యకథలు వినగోరి అతనిని పూజించిరి. మరియు పుణ్యకథాశ్రవణ కౌతుకాధీన మానసులై కథాకథనమును ప్రసంగించిరి. అంతనే కథవినగోరెదరవి సూతుడు ప్రశ్నించినాడు? దానికివారు ఇట్లు ప్రత్యుత్తర మొసంగినారు-

క. ఏయది హృద్యము పూర్వం
బేయది, యెద్దాని వినిన నెఱుక సమగ్రం
బైయుండు నఘనిబర్హణ
మేయది యక్కథయవినగ నిష్టము మాకున్ [ఆది-1-30]

భారత రచనా కారణము :

భారత రచనకు గల కారణములు స్వర్గారోహణ పర్వమునందిట్లు పేర్కొనబడినవి-1. పాండవుల కీర్తిప్రకటించుటకు. 2. వివిధ జనపతుల చరిత్రములు జనుల కెరిగించుటకు, 3. ఆదిదేవుడగు శ్రీకృష్ణుని సంక్రీడా విశేషములు వివరించుటకు, 4. సర్వదేవ జాతుల జన్మములు, తదీయసాయుజ్యములు తేటపరచుటకు, 5. సకలధర్మములు తెలుపుటకు (81)

ఆదిపర్వమునందును భారతగత విషయము లీవిధముగ సూచింపబడినవి 1. నీతిధర్మశాస్త్రార్థతత్త్వములు, 2. చతుర్వేద వేదాంతాభిప్రాయములు, 3. చతుర్వర్గ వర్గానుబంధబంధుర కథేతిహాసములు, 4. చతుర్యుగ మహర్షి రాజవంశ చరితలంబులు, 5. చతురవర్ణాశ్రమధర్మక్రమములు, 6. శ్రీకృష్ణుని

మాహాత్మ్యము, 7, పాండవాది భారతవీరుల మహాగుణములు. (ఆది-1-31), వేదమునందువలె, రామాయణమునందు వలె మహాభారతమునందును శ్రీకృష్ణ ప్రాధాన్యము గలదు. ఈ విషయమునే ఈ క్రింది శ్లోకము విదిత మొనర్చు చున్నది.

> "వేదే రామాయణే చైవ
> పురాణే భారతే తథా
> ఆదావంతే చమధ్యేచ
> విష్ణుః సర్వత్ర గీయతే."

మహాభారతము ధర్మార్థ కామ మోక్షప్రదానార్థమై విరచితము. ధర్మాధర్మ, సత్యాసత్య, న్యాయాన్యాయ విచక్షణార్థమై రచితము. ఆధ్యాత్మిక విషయబోధ నార్థము రచింపబడినది. నిఖిలలోకహితార్థము, లోకోద్ధరణమునకై భారత రచన గావించినవాడు మహర్షి వ్యాసుడు, భారతకథా వ్యాజమున వ్యాసుడు విజ్ఞాన వ్యాప్తి గావించి లోకమునుద్ధరించినాడు-ధర్మము, సత్యము, దానము, దయ, నీతి, మున్నగువానిని సంఘమునందు స్థాపించుటయే వ్యాస కృత మహా భారత రచనా కారణము ఐహికాముష్మికములకు సంబంధించిన సర్వధర్మములనాచరింప చేయుటయే మహా భారత రచనకు గల కారణము.

## మహాభారత ప్రాశస్త్యము :

మహాభారత మొక ఉద్గ్రంథము. ఈ గ్రంథము వేదతుల్యమైనది. ప్రాచీన భారతీయుల సంస్కృతిని, నాగరికతను, విజ్ఞానమును భారతము దర్పణము పట్టు చున్నది. ప్రాచీన భారతీయుల ఆధ్యాత్మిక చింతనా పూరిత జీవితమును ప్రతి బింబించుచున్నది. సంస్కృత సాహిత్యమునందే కాదు, ప్రపంచ సాహిత్యమున నింతటి ఉత్కృష్టమైన రచన 'నభూతో నభవిష్యతి' అని కీర్తించిన నతిశయోక్తి కాదు. ఇంతటి విశాలమైన ఇతివృత్తము, విభిన్న పాత్రలు ఏ ఇతర కావ్యమున మృగ్యము-ఈ కావ్యమున ప్రాచీన భారతీయుల జీవన విధానము కడు సుందర ముగ చిత్రితమైనది.

లోకమునగల విషయములన్నియు భారతమున గలవు-భారతము నందు చెప్పబడని విషయములు లోకమున కానబడవు-ఈ విషయమెంత రమణీయముగ చెప్పబడినదో ఇంచుక గమనించుడు-

శ్లో. "యదిహాస్తి తదన్యత్ర
యన్నేహాస్తి నతత్క్వచిత్" — భారతమున చెప్పబడినదియే అన్ని గ్రంథములందును కలదు. ఈ గ్రంథములో నేదిలేదో అది మరి ఏ ఇతర గ్రంథములందును కానరాదు-అనగా మహా భారతమున చెప్పబడని విషయమే లోకమునలేదు-

మహాభారత ప్రశస్తిని వేనోళ్ళ కీర్తించుచున్న స్వర్గారోహణ పర్వ గత పద్యరాజమును పరికించుడు-

తే. అమల ధర్మార్థకామమోక్షముల గురించి
యెలయు తెరు వెద్దియును నిందుఁగలుగు నదియ
యొండెడలఁగల్గు, దీన లేకుండు చొప్పు
దక్కొ కంటను లేదు వేదజ్ఞులార — [82]

పై శ్లోకగత భావమునే తిక్కన సోమయాజి మనోజ్ఞముగ నాంధ్రీకరించి యుండుట విదితము.

మహాభారతము అవశ్య పఠనీయ గ్రంథము. ఈ గ్రంథమును పఠించిన వారికి సర్వవిషయములు కరతలామలకములు-భారతీయులెల్లరకు మహాభారతము ప్రాతస్మరణీయమైన పరమ పవిత్రమైన గ్రంథరాజము. భారతము పిమ్మట పఠనీయమైన పవిత్ర గ్రంథములు, రామాయణ భాగవతములు-భారత రామాయణ భాగవతగ్రంథము లేయే సమయములందు బుద్ధిమంతులు పఠింతురను విషయమును చమత్కారముగ చెప్పియున్నారు.

శ్లో. "ప్రాతర్ద్యూత ప్రసంగేన-మధ్యాహ్నే స్త్రీప్రసంగతః
రాత్రే చోర ప్రసంగేన-కాలోగచ్ఛతి ధీమతామ్
... ... .... ... .... -కాలోగచ్ఛత్య ధీమతామ్"

ధీమంతులకు, అధీమంతులకు ప్రాతః కాలము ద్యూత ప్రసంగతముతోను, మధ్యాహ్నము స్త్రీ ప్రసంగతముతోను, రాత్రి చోరప్రసంగతముతోను కాలము గడచుచున్నదట-బుద్ధిమంతులకు ద్యూత ప్రసంగతముతో ననగా భారతముతోను, స్త్రీ [సీత] ప్రసంగతముతో ననగా రామాయణముతోను, చోర

ప్రసంగతముతో ననగా వెన్నదొంగ [శ్రీకృష్ణుడు] చరిత్రము ప్రవర్తిల్లిన భాగవతముతో నని అర్థము అవగతము-మరి బుద్ధిహీనులకు ఉదయము జూద ముతో, మధ్యాహ్నము వేశ్యాస్త్రీ సాంగత్యముతో, రాత్రి దొంగతనముతోనని అర్థము-కావున భారతము ప్రాతస్మరణీయ గ్రంథమగుచున్నది-

వేదాంత విదులకు భారతము వేదతుల్యమైనది. ఎందువలననగా వేదము లను వ్యాసము గావించిన సాత్యవతేయునిచే రచితమైనదీ మహాభారతము-విష్ణు సన్నిభుడైన వేదవ్యాసుడు చతుర్వేదతత్త్వవేది.

పరమ పౌరాణికులకిది పురాణ సముచ్చయమువలె భాసించును. కావున మహాభారతము పురాణమగుచున్నది.

శ్లో. "సర్గశ్చ ప్రతి సర్గశ్చ-వంశో మన్వంత రాణిచ
వంశాను చరితం చేతి-పురాణం పంచలక్షణం" అను పంచలక్షణా న్వితమై మహాభారతము విలసిల్లు చున్నది.

మహాభారత గ్రంథమొక ఇతిహాసము, ఐతిహాసికులితిహాసముగ దీనిని పేర్కొనుచున్నారు-ఇతి-హ-ఆస అని వ్యుత్పత్తి. కురుపాండవుల కథ ప్రత్యక్ష ముగ జరిగినదియే కాని వ్యాసభగవానునిచే కల్పితమైనది కాదు. ప్రత్యక్షముగ జరిగిన ప్రసిద్ధేతివృత్తమునే వ్యాసుడు స్వీకరించి లోకోద్ధరణకుపూనుకొనినాడు- అజ్ఞాన తిమిరమును పారద్రోలినాడు-

శ్లో. "ఇతిహాస ప్రదీపేన-మోహావరణ ఘాతినా
లోక గర్భ గృహం కృత్స్నం-యథావత్సం ప్రకాశితం"

ఇతిహాసమనెడి దీపము లోకమనెడి గృహములోని మోహమనెడి చీక టిని పారద్రోలి ప్రకాశింప చేయును-మహాభారతము పఠించు వారి మనస్స త్త్వము ననుసరించి, మనఃప్రకృతి ననుసరించి, వారివారి చిత్తవృత్తికి తగి నట్లుగ దర్శనమిచ్చు చున్నది-

సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁగొనియాడు చుండ

ఆ. వివిధ వేద తత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగు చుండ జేసె భారతంబు [ఆది-1-32]

కావున భారతము-1. ధర్మశాస్త్రము, 2. వేదాంతము, 3. నీతిశాస్త్రము, 4. మహాకావ్యము, 5. సర్వలక్ష్య సంగ్రహము, 6. ఇతిహాసము, 7. పురాణ సముచ్చయము. మరి ఏది కాదు? అందరికి అన్ని విధముల గోచరించుచుండును.

రాజరాజ నరేంద్రుడు నన్నపార్యునిగాంచి భారతము నాంధ్రీకరింపుమని కోరినాడు. రాజరాజు బహుపురాణములను వినియున్నాడు. అర్థ ధర్మశాస్త్రములు చదివి యున్నాడు. ఉదాత్త రసాన్విత కావ్య నాటకాదులను పఠించి యున్నాడు. భక్తితో ఈశ్వరాగమముల యందు హృదయమును నిల్పినాడు [ఆది-1-10]. అయినను తన హృదయము శ్రీ మహాభారతమునందు తగిలియున్నదట. [1-11] అనగా అన్నింటికంటెను రాజరాజునకు భారతముపైననే మక్కువ ఎక్కువ.

మహాభారత భారతీ సముద్రము నీదుట బ్రహ్మకైనను తరము గాదని నన్నయ పేర్కొనినాడు. మహాభారత మంతటి గంభీరమైనది, లోతైనది మరి యొకటిలేదు, తారకా సముదయము నెన్నుట వంటిది మహాభారత రచన.

చ. అమలిన తారకా సముదయంబుల నెన్నను సర్వవేద శా
స్త్రముల యశేష సారము ముదంబునఁ బొందను బుద్ధిబాహు వి
క్రమమున దుర్గ మార్థజల గౌరవ భారత భారతీ సము
ద్రముఁ దఱియంగ నీఁదను విధాత్రునకైనను నేరఁబోలునే.

[ఆది-1-19]

**భారతము-ఆంధ్రులు :**

ఆదికావ్యమగు రామాయణమునకు ఉత్తర హిందూదేశమున నున్న ప్రచారము దక్షిణ హిందూదేశమున లేదు. మహాభారతమునకు దక్షిణ హిందూదేశమున నున్న ప్రాముఖ్యము ఉత్తర హిందూదేశమున మృగ్యము-దక్షిణ హిందూదేశము నందును ఆంధ్రులకు మహాభారతముపై మోజు ఎక్కువ-'వింటే భారతమే వినాలి-తింటే గారెలే తినాలి' అనెడి మాట ఆంధ్రులందే గలదు. ఆంధ్రులకు భారతము శ్రవణానందమును, గారెలు జిహ్వానందమును కల్గించుచున్నవి-చలనచిత్రములు వచ్చుటకు ముందు ఆంధ్రగ్రామములలో ఎక్కువగా భారతము హరికథాకాలక్షేపము గావిప బడెడిది. అక్షరజ్ఞులైన జానపదులు సహితము పంచలపై చేరి భారత, భాగవత, రామాయణ పఠనము గావించెడి వారు. ఒక్కొక్కప్పుడు ఒకరు పఠించుచుండ వింకొకరు వ్యాఖ్యానము గావించుచుండెడి వారు.

మహాభారత కథతో నిర్మింపబడిన చలనచిత్రములు ఆంధ్రదేశమునందు శతదినోత్సవములను జరుపుకొనుచుండును, దక్షిణ హిందూదేశమునందలి భారత కథతో నిర్మించిన చలన చిత్రములలో ఆంధ్రులచే పై చేయి-భారతము నందలి ప్రధానపాత్రలగు భీష్ముడు కౌరవులకే కాదు వారికిని పితామహుడే. ద్రోణుడు కురుపాండవులకే కాదు వారికిని ఆచార్యుడే-అభిమన్యుని వారు పుత్రునిగావే భావింతురు. పలనాటి యుద్ధమును పలనాటి భారతముగ నాంధ్రులు పేర్కొనుచున్నారనగ వారికి భారతముపైగల ఆసక్తి సువ్యక్తము.

**సంస్కృత మహాభారత శ్లోక సంఖ్య :**

జయనామక భారతమునందు 8,800 శ్లోకములు గలవనియు, వ్యాసువి శిష్యులు పైల, సుమంతి, జైమిని, వైశంపాయనాదులు కాలక్రమమున నద్దానివి

వివరించి చెప్పగా నది 24,000 శ్లోకములతో కూడిన భారతమైనదనియు, రోమ హర్షణి విస్తరించి చెప్పగా నుపాఖ్యానములతో, వ్యాఖ్యానములతో నది లక్ష శ్లోకములకు పైగా పెరిగి మహాభారతమైన దనియు నింతకు మందే పేర్కొన బడినది. కాని నన్నయకు లభించిన సంస్కృత భారత ప్రతి ఏదియో గాని అందు 99,700 శ్లోకములు మాత్రమే గలవు. ఆదికవియగు నన్నయ భారతాంధ్రీకరణము గావించుచు పర్వ సంగ్రహమునందు సంస్కృత మహాభారత శ్లోక విస్తృతి నీక్రింది విధముగ పేర్కొనినాడు-

| | | |
|---|---|---|
| 1. | ఆదిపర్వము | 9984 |
| 2. | సభాపర్వము | 4311 |
| 3. | అరణ్య పర్వము | 13664 |
| 4. | విరాట పర్వము | 3500 |
| 5. | ఉద్యోగపర్వము | 6998 |
| 6. | భీష్మపర్వము | 5884 |
| 7. | ద్రోణపర్వము | 10919 |
| 8. | కర్ణపర్వము | 4900 |
| 9. | శల్య పర్వము | 3220 |
| 10. | సౌప్తిక పర్వము | 2874 |
| 11. | స్త్రీ పర్వము | 775 |
| 12. | శాంతి పర్వము | 14525 |
| 13. | అనుశాసనిక పర్వము | 12000 |
| 14. | అశ్వమేధ పర్వము | 4420 |
| 15. | ఆశ్రమవాసపర్వము | 1106 |
| 16. | మౌసల పర్వము | 300 |
| 17. | మహాప్రస్థానిక పర్వము | 120 |
| 18. | స్వర్గారోహణ పర్వము | 200 |
| | మొత్తము | 99. 700 |

పై శ్లోక సంఖ్యలను పరిశీలించినపుడు అష్టాదశ పర్వములలో శాంతి [14525]మిక్కిలి పెద్దదిగ తెలియును. ఆ పిమ్మట అరణ్యపర్వము[13664] తరువాత అనుశాసనికము [12000], ఆ తరువాత ద్రోణపర్వము [10919] పెద్దవిగ కనబడును.అన్నిటికంటెను మిక్కిలి చిన్నది మహాప్రస్థానికము[120] ఆ పిమ్మట పిన్నది స్వర్గారోహణము [200], తరువాత చిన్నది మౌసల పర్వము [300]. ఒక్కొక్కపుడు శ్లోక సంఖ్యలో చిన్న భేదమున్నపుడు ఈ పర్వము చిన్నది. ఆ పర్వము దీనికంటె పెద్దదియని చెప్పుట ప్రామాదికము-ఛందఃకారణముగ భేదముండవచ్చునేమో?

నన్నయకు లభించిన సంస్కృత భారతములో నున్న శ్లోక సంఖ్య లక్షకు తక్కువయే అయినను లక్ష శ్లోకములకు పైగా నున్నటుల పేర్కొనుట 8 మన ఆంధ్రులకు పరిపాటియైనది. నన్నయ భారతమును శత సహస్ర శ్లోక సంఖ్య మయిన దానిగా పేర్కొనినాడు [ఆది-1-9]. శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు లక్ష ఏబదివేల గ్రంథముగా వ్యాస భారతమును పేర్కొనుట గమనార్హము.[9] ఇట్లు చెప్పుట ప్రామాదికమేగాని ఏ ప్రామాణిక సంస్కృత భారత ప్రతిలోను లక్ష ఏబదివేల శ్లోకములున్నట్లుగ ఎవరును పేర్కొనుట కనబడదు. శ్లోక సంఖ్య విషయములో నన్నయ పేర్కొనినది లభించుచున్న సంస్కృత ప్రతులలో సంవదించుటలేదు. నన్నయకు లభించిన సంస్కృత ప్రతి ఏది?

## ఆంధ్ర మహాభారతాంధ్రీకరణోద్దేశము :

ఆదికవియగు నన్నయభట్టారకునిచే మహాభారతాంధ్రీకరణము గావింప పూనినవాడు రాజరాజనరేంద్రుడు. రాజరాజు భారతాంధ్రీకరణము చేయించుటకు గల కారణములివి-1, మహాభారతము పై నభిలాష పెద్దది, 2. భారత శ్రవణాసక్తి గొప్పది, 3, కురుపాండు భూపతులు తనకు వంశకర్తలని భావించుట, కాని నన్నయ తిక్కనాది మహాకవులు భారతాంధ్రీకరణము చేయుటలో వారి ఉద్దేశము వేరుగా నున్నది. వీరులోక కల్యాణసిద్ధికై, లోకహితముగోరి భారతాంధ్రీకరణము గావించియున్నారు, ఇది వారి లౌకిక దృష్టికి తార్కాణము, కాని వారి అంతర దృష్టి ఆ ముష్మికముపై ప్రసరించినది. నన్నయ 'మహాభారత సంహితారచన బంధురు' డైనది జగద్ధితంబు గోరియే (1-26), మరియు

'ఘోర సంసార వికార సంతమసజాల విజృంభము' (ఆది-1-22) పాయుటకై ఆంధ్రీకరణకు కడంగినాడు,

తిక్కనయు భారతాంధ్రీకరణము నీ దృష్టితోడనే చేపట్టినాడు. తన పుట్టువు కృతార్థత బొందినదనియు పుణ్య చరిత్రుడనైతిననియు భావించిన పూత చరితుడు [1-27] తిక్కన సోమయాజి. మరియు

తే. తెనుఁగు బాస వినిర్మింపఁదివురుటరయ
 భవ్య పురుషార్థ తరు పక్వ ఫలముగాదె' (విరాట-1-18)

అని భావించి, 'ఇంక జన్మాంతర దుఃఖముల్ తొలఁగునట్లుగఁ జేసి సుభాత్మజేయవే' [విరాట-1-21] అని హరిహరనాథుని కోరినాడు-అంత ఆ జగన్నాథుడు తిక్కనకీ విధముగా వరమిచ్చినాడు-

తే. జనన మరణాదులైన సంసార దురిత
 ములకు నగపడ కుండంగఁదొలఁగు తెరువు
 గను వెలుంగు నీ కిచ్చితి ననిన లేచి
 నిలిచి సంతోష మెదనిండ నెలవు కొనఁగ [విరాట-1-24]

తిక్కన భారతామృతము కర్ణపుటముల నారగ్రోలి, ఆంధ్రావళికి మోదము కలుగ రచన గావించినాడు [1-30]. కావున నన్నయ తిక్కనాది మహాకవులు భారతాంధ్రీకరణము చేయుటలో ప్రధానోద్దేశము భవబంధ విమోచనము కోరియే యని మనము పరిగ్రహింప నగును. ఆదికవి వాల్మీకియు, వేదవ్యాసుడును మహర్షులు. వారి కారణముగానే "నా నృషిః కురుతే కావ్యమ్" అను నార్యోక్తి ఏర్పడినది. నన్నయ తిక్కనాది కవులును ఋషితుల్యులే. నన్నయ సనాతనాచార సంపన్నుడు-అంతియే కాదు-

సీ. తనకుల బ్రాహ్మణు ననురక్తు నవిరళ
 జప హోమ తత్పరు విపుల శబ్ద
 శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
 నానా పురాణ విజ్ఞాన నిరతుఁ

బ్రాతు నాపస్తంబ సూత్రు ముద్గలగోత్ర
జాతు సద్వినుతావదాత చరిత్రు
లోకజ్ఞు నుభయ భాషా కావ్యరచనాభి
శోభితు సత్ప్రతి భాభి యోగ్యు

ఆ. నిత్య సత్యవచను మత్యమరాధిపా
చార్యు సుజను నన్నపార్యు .... .... [ఆది-1-9]

తిక్కనయు నన్నయవలెనే మహోదయుడు-ఇన్నము గావించి తిక్కన సోమయాజియైన పూత చరిత్రుడీతడు-ఇట్టి పుణ్యాత్ములచే నాంధ్రీకరింపబడిన భారతము ఆంధ్రులకు పరమ ప్రామాణిక గ్రంథమైనది. ఆంధ్రసాహిత్యములో కవిత్రయ భారతమునకున్న ప్రశస్తి మరి ఏ ఇతర గ్రంథమునకు లేదనుటలో ఇసుమంతయు నతిశయోక్తిలేదు.

నన్నయాదులు వైదికమత పునరుద్ధరణకై కంకణము కట్టుకొని, భారతాంధ్రీకరణమునకై కడంగిరని పలువురాంధ్ర విమర్శకులు పేర్కొనుచున్నారుగాని దానికి ఆ కరములు లేవని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు పేర్కొనుట సమంజసముగా నున్నది.[10]

## ఆంధ్ర మహాభారత పద్య గద్య సంఖ్య :

సంస్కృత మహాభారతము దాదాపు లక్షశ్లోకములతో నొప్పారు చున్నది. ఆంధ్రమహాభారతమునందు ఏబదివేల పద్యగద్యములున్నవని శ్రీ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు పేర్కొనుట ప్రామాదికము[11], కవిత్రయ భారతమునందు గల పద్య గద్యముల సంఖ్య 21, 516 మాత్రమే. కేవలము సంఖ్యను పోల్చి చూచినచో సంస్కృత మహాభారతమునందు ఆంధ్రమహాభారతము దాదాపు 5వ వంతు మాత్రమే అగుచున్నది. స్థూలదృష్టితోనేగాని సూక్ష్మదృష్టితో పరికించిన నిది తప్పు అగును. సంస్కృతము నందలి ఏడెనిమిది శ్లోకముల భావము తెలుగులోని సీసములోనికి మూసపోయ వచ్చును-ముప్పది లేక నలుబది శ్లోకముల భావమునొక దీర్ఘవచనములో తెలుగున కూర్పవచ్చును. అందువలన నట్లు పోల్చుట కుదురదు. ఆంధ్ర మహాభారతము నందలి పద్య గద్య సంఖ్య నీ క్రింది విధముగా నున్నది. ఆశ్వాసాద్యంత పద్యములతో కూడ గణింపబడినవి.

| | | | |
|---|---|---|---|
| 1. ఆదిపర్వము | ప్రథమాశ్వాసము | 164 | |
| | ద్వితీయ ... | 240 | |
| | తృతీయ ... | 228 | |
| | చతుర్థ .... | 275 | |
| | పంచమ .... | 261 | |
| | షష్ఠ .... | 312 | |
| | సప్తమ ... | 290 | |
| | అష్టమ .... | 324 | |
| | | 2094 | = 2094 |
| 2. సభాపర్వము | 1 .... | 296 | |
| | 2 .... | 322 | |
| | | 618 | = 618 |
| 3. అరణ్యపర్వము | 1 .... | 400 | |
| | 2 .... | 358 | |
| | 3 .... | 399 | |
| | 4 ... | 417 | |
| | 5 .... | 437 | |
| | 6 .... | 411 | |
| | 7 .... | 472 | |
| | | 2894 | = 2894 |
| 4. విరాటపర్వము | 1 .... | 335 | |
| | 2 .... | 365 | |
| | 3 .... | 240 | |
| | 4 .... | 277 | |
| | 5 ... | 407 | |
| | | 1624 | = 1624 |

| | | | |
|---|---|---|---|
| 5. ఉద్యోగపర్వము | 1 .... | 385 | |
| | 2 .... | 334 | |
| | 3 ... | 415 | |
| | 4 .... | 428 | |
| | | 1562 | = 1562 |
| 6. భీష్మపర్వము | 1 .... | 306 | |
| | 2 .... | 410 | |
| | 3 .... | 455 | |
| | | 1171 | = 1171 |
| 7. ద్రోణపర్వము | 1 ... | 397 | |
| | 2 .... | 383 | |
| | 3 .... | 310 | |
| | 4 ... | 337 | |
| | 5 .... | 433 | |
| | | 1860 | = 1860 |
| 8. కర్ణపర్వము | 1 .... | 332 | |
| | 2 .... | 401 | |
| | 3 .... | 401 | |
| | | 1134 | = 1134 |
| 9. శల్యపర్వము | 1 .... | 405 | |
| | 2 .... | 432 | |
| | | 827 | = 827 |
| 10. సౌప్తిక పర్వము | 1 ... | 240 | |
| | 2 .... | 136 | |
| | | 376 | = 376 |
| 11. స్త్రీపర్వము | 1 .... | 189 | |
| | 2 .... | 18[illegible] | |
| | | 376 | = 376 |



| పర్వము | భాగము | సంఖ్య | మొత్తము |
|---|---|---|---|
| 12. శాంతిపర్వము | 1 .... | 400 | |
| | 2 .... | 449 | |
| | 3 .... | 531 | |
| | 4 .... | 457 | |
| | 5 .... | 632 | |
| | 6 | 623 | |
| | | 3092 | = 3092 |
| 13. అనుశాసనికపర్వము | 1 .... | 388 | |
| | 2 .... | 478 | |
| | 3 .... | 347 | |
| | 4 .... | 451 | |
| | 5 .... | 484 | |
| | | 2148 | = 2148 |
| 14. అశ్వమేధపర్వము | 1 .... | 233 | |
| | 2 .... | 228 | |
| | 3 .... | 228 | |
| | 4 .... | 287 | |
| | | 976 | = 976 |
| 15. ఆశ్రమవాసపర్వము | 1 .... | 186 | |
| | 2 .... | 176 | |
| | | 362 | = 362 |
| 16. మౌసలపర్వము | 1 .... | 22 | = 226 |
| 17. మహాప్రస్థానికపర్వము | 1 .... | 79 | = 79 |
| 18. స్వర్గారోహణపర్వము | 1 ... | 97 | = 97 |
| | | మొత్తము | 21,516 |

పైన పేర్కొనబడిన పద్యగద్య సంఖ్యలను గమనించినపుడు శాంతి పర్వము (3092), అరణ్య పర్వము (2894), అనుశాసనికము (2148), ఆది పర్వము (2094), ద్రోణపర్వము (1860) పెద్దవిగ తెలియును. సంస్కృతమున ద్రోణపర్వ శ్లోక సంఖ్య ఆదిపర్వము కంటె ఎక్కువ. తెనుగున తద్విపరీతముగ నుండుట గమనార్హము. మిక్కిలి చిన్నవి మహా ప్రస్థానిక పర్వము (79), స్వర్గారోహణము (97), మౌసల పర్వము (226), ఆశ్రమ వాస పర్వము (362) - ఈ విషయమున సంస్కృతమునకును, తెలుగునకును భేదము లేక పోవుటను కూడ గమనించునది-

ఫలశ్రుతి:

వినుటచే కల్గు ఫలమును అనగా లాభమును మనవారు ఫలశ్రుతి యని చెప్పుచున్నారు. భారతమును చదివినను, వ్రాసినను, వినినను, కల్గు లాభములు అనేకములు. ఒక ధర్మసందేహము కల్గినపుడు, ఒకప్పుడు న్యాయాన్యాయ విచక్షణా జ్ఞానము లేకపోయినప్పుడు, ఏది నీతి ఏది అవినీతి అనెడి సంకట పరిస్థితి ఏర్పడినపుడు, మరి సత్యము ఎపుడు పలుకవలయును, అసత్యమెపుడు చెప్ప వచ్చును అను సందేహము పొడమినపుడు, వేయేల ఏ సందేహము కలిగినను భారతము చదివిన యెడల నా సందేహము 'పటాపంచలై' పోవును, ఆముష్మిక ఫలవిషయము నటుంచుడు, లౌకిక ఫలము మాత్రము తప్పక లభించును. ఈ విషయమును హేతువాదులు ఒప్పుకొనక తప్పదు.

సర్వసాధారణముగ నొక కావ్య ఫలశ్రుతిని కవులు కావ్యాంతమున పేర్కొందురు. మహా భారతము విషయమున ఫలశ్రుతి కావ్యాదివి, మధ్యమున, అంతమున కూడ పేర్కొన బడుట మనము గమనింపదగిన అంశము, ఇంతియే కాదు ప్రతి ఉపాఖ్యానాంతముననుపెక్కుమార్లు ఫలశ్రుతి పేర్కొనబడుటను చూడవచ్చును.

కావ్యాది నున్న ఫలశ్రుతిని పరిశీలింతము. రాజరాజు నన్నయను భారతాంధ్రీకరణము గావింపు మని అర్థించుచు కావ్యాదిని భారతేతిహాసఫలశ్రుతిని పేర్కొనినాడు - భారత కథాశ్రవణము గావించిన వారికి - సువర్ణము పొదిగిన కొమ్ములు, డెక్కలు గల 100 కపిల గోవులను వేదపండితులగు విప్రులకు దానము చేసినంతటి ఫలము లభించునట (ఆది -1-15), నాటివారి విశ్వాసమది- అంతియే కాదు భారతము వినువారికి యాగము లనేకము లొనరించిన ఫలము తథ్యము సమకూరునట—

క. బహు భాషల బహు విధముల
బహుజనముల వలన వినుచు భారత బద్ధ
స్పృహులగు వారికి నెప్పుడు
బహుయాగంబుల ఫలంబు పరమార్థ మగున్. (ఆది-1-17)

ఈ మహాభారతము అవధానముతో వినువారికి - విపులధర్మారంభ సంసిద్ధి యగును. చతుర్వేదములు, అష్టాదశపురాణములు, ధర్మశాస్త్రములు మోక్షశాస్త్ర తత్త్వము లెరిగినంత ఫలము చేకూరును. అనేక దానములు, బహువిధక్రతువులు, బ్రహ్మచర్యము వలన కల్గు పుణ్యఫలములు పొందనగును. అశేషపాపక్షయ మగును — శుభము పెరుగును (ఆది-1-72), మరియు సాత్యవతేయ విష్ణుపద సంభవమైన భారతమనెడి అమరనది నిరంతరము సంపద నభివృద్ధి గావించును- ఎవరికి? వినినవారికి, కొనియాడిన వారికి(ఆది-1-73).

భారత శ్రవణము వలన నవి యివి యననేల భవభయములే పాయునని వారి విశ్వాసము. పోతన వంటి పరమ భాగవతోత్తముడు భాగవతమును తెనిగించినది తన జననము సఫలము చేసికొనుటకు మాత్రమేగాక పునర్జన్మము లేకుండుటకై [12], భవభయమును పోగొట్టునని చెప్పెడు ఆంధ్ర మహాభారతాదినున్న ఆ పద్యమును గమనించుడు —

సీ. ఆయురర్థులకు దీర్ఘాయుర వాప్తియు
    నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మ సంప్రాప్తియు
    వినయార్థులకు మహా వినయ మతియుఁ
బుత్రార్థులకు బహు పుత్ర సమృద్ధియు
    సంపదర్థుల కిష్ట సంపదలును
గావించు నెప్పుడు భావించి వినుచుండ
    వారల కిమ్మహా భారతంబు

ఆ భక్తియుక్తులైన శ్రీభాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబు లెల్లఁ బాపి యిష్టార్థ సం
సిద్ధి గరుణతోడఁ జేయునట్లు (ఆది-1-34)

తిక్కన సోమయాజి విరాట పర్వ కథాదిని 'మహాభారతంబు సమస్త దురితాపహంబును నఖిమత శుభావహంబునని(1-43) చెప్పినాడు. గ్రంథాంతము నందలి ఫలశ్రుతి కొంత దీర్ఘముగనే చెప్పబడినది. ఎనిమిది పద్యములలో ఫలశ్రుతి పేర్కొనుట జరిగినది.

క అలఘు మతులార పర్వం
బుల నీ యితిహాస రత్నమును వినిన నఘం
బులు పాయు, నాక లోకము
కలుగును, సిద్ధించు ముక్తి కాంక్షితమైనన్ (స్వర్గ—85)

మరియు బ్రహ్మహత్యాది పాపవర్గ మెల్ల పాయును (86). సుర పితృ కార్యములందు దీనిని భూసురులకు వినిపించు సుకృతాత్ములకు తత్కరణ ఫలములమితముగ లభించును (87). మానసములందు, ఇంద్రియము లందుగల ఏనఃపుంజములు భారతకథ ఒకించుక వీనులందు చిలికిన సకలము విరియును(88). భారతము విన్నంతనే రాజులు శత్రువులను గెల్చి భూరిజయోన్నతిని కందురు (89). భారతమును వినినను, భక్తితో పఠించినను – సంపద, ఆయువు, కీర్తి, ప్రమదము దృఢవిద్యయు కల్గును. కోరికలన్ని తీరును. గర్భిణిస్త్రీ సుపుత్రుని గాంచును – కుమారి సద్వరుని పొందును (90). మరియు —

ఉ శిక్షిత చిత్తులార శుభసిద్ధులు పొందు ననేక జన్మపా
పక్షపణంబునన్ వెలుఁగు భారత సంహిత నెల్లఁబుండరీ
కాక్షుని వాసుదేవుఁ బ్రకటార్థముగాఁగని విన్న మానవుం
డక్షయపుణ్యలోకములయందు రమించు నిరామయ స్థితిన్(-91)

అంతియే కాదు సకలాగమార్థ సంవాసన మావహిల్లును (92).

## సంస్కృత భారత ప్రతులు:

ప్రాచీన కాలమున లిపి మొదటి శిలలపై, పిమ్మట రాగి రేకులపై ఆ పిమ్మట తాళపత్రములపై వెలసినది. సంస్కృత మహా భారతముదయించి దాదాపు 5000 సంవత్సరము లగు చున్నదని భావించు చున్నారు. ఇన్ని సంవత్స రములా గ్రంథము దేనిపై లిఖింపబడి సిద్ధించినదో సరిగా చెప్పజాలము. శిలలపైన తామ్ర పత్రములపైన భారతము లభించుట లేదు—తాళపత్రములందే సంస్కృత భారతము లభ్యమగు చున్నది. తాళపత్రములపై నొకసారి లిఖింపబడిన గ్రంథము కడు జాగరూకతతో కాపాడిన 250 నుండి 300 సం. వరకు నుండు నని భావింపనగును, అట్టి యెడ 5000 సం॥నుండి అట్లువ్రాసిన యెడల 20 పర్యాయములు కనీస పక్షమున వ్రాసి యుండనగును. నేడు మనకు లభించు సంస్కృత భారత ప్రతులను రెండు విధములుగ వింగడించు చున్నారు — 1. ఉత్తర హిందూదేశ ప్రతులు, 2. దక్షిణ హిందూదేశప్రతులు—

ఆంధ్రదేశము నందు లభించి కేవలము తెలుగునాట వెలసిన సంస్కృత భారతప్రతులు నాలుగు—1. వేదం వేంకటరాయ శాస్త్రిగారు వేయించిన ప్రతి క్రీ.శ. 1850. 2. పురాణం హయగ్రీవ శాస్త్రిగారు వేయించిన ప్రతి క్రీ.శ. 1855-60 ప్రాంతపుది, 3. వేంకట సుబ్బ శాస్త్రిగారి ఆధ్వర్యవములో వెలువడి నది క్రీ.శ. 1870, 4. వావిళ్లరామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారు ముద్రించిన ప్రతి క్రీ.శ. 1929.

దక్షిణ-ఉత్తర హిందూస్థానములో అనగా మిగిలిన భారతదేశములో లభించిన ప్రతులు తొమ్మిది అవి-1. భారత భావదీపమనెడి నీలకంఠ వ్యాఖ్యతో ప్రచురితమైన బొంబాయి ప్రతి-1878, 2. ప్రతాప చంద్రరాయ్‌గారు ముద్రింపిచిన కలకత్తా ప్రతి-1882, 3. రంగస్వామి దీక్షితర్ పరిష్కరణలో వేదవ్యాస ప్రెస్సువారు శరభోజి రాజపురములో ముద్రించిన ప్రతి-'89, 4. కుంభ కోణము నుండి T.R. కృష్ణామాచార్య మరియు T.R. వ్యాసాచార్యుల పరిష్కరణలో వెలువడిన ప్రతి. 5. చిత్రశాలా ప్రెస్సు పూనావారిప్రతి-1931 దీనినే నేడు మనవారు ఢిల్లీ ప్రతిగ పేర్కొను చున్నారు-6. భండార్కర్ ఓరియెంటల్ ఇన్స్టిట్యూటు పూనావారి ప్రతి- 1959, 7. శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యము[13] పేర్కొనిన కాశీ వ్రాతప్రతి 8. గీతాప్రెస్సువారిది గోరఖ్

పూర్ ప్రతి 9. గుజరాతులోని వాలసాడ్ జిల్లా పారడే ప్రతి ఒకటి లభ్యమానము—వెరసి మొత్తము దేశములో లభించుచున్న ప్రతులు 13 అగుచున్నవి- మరి నన్నయ తిక్కనాదులకు దొరకిన సంస్కృత ప్రతులేవో పరిశోధకులు సరిగా చెప్పలేకున్నారు. కవిత్రయము వారి తెలుగు భారతము కొన్ని యెడల దక్షిణ దేశపు ప్రతులతోను, మరికొన్నియెడల ఉత్తరదేశపు ప్రతులతోను, సంవదించు చున్నవి. అందువలన వారికి లభించిన ప్రతి ఇది అని ఇదమిత్థముగా చెప్పజాలకున్నారు.

ఆంధ్ర భారత ప్రతులు:

కవిత్రయము వారి తెలుగు భారతము ఏడు సంస్థలచే ప్రకటితము—1. కీ.శే. కరాలపాటి రంగయ్యగారు పరిష్కర్తగా కళానిధి ముద్రాక్షరశాలవారు వెలయించిన ప్రతి క్రీ శ. 853, 2. కందుకూరి వీరేశలింగము మరియు రాయదుర్గము నరసయ్య. శాస్త్రి పరిష్కరణలో ఆనంద ముద్రాక్షరశాల ప్రచురించిన ప్రతి 1901, 3. వావిళ్లరామస్వామి అండ్ సన్స్ వారి ప్రతి 1917 (వావిళ్లవారు 1905 వరకు భారతమును ముద్రించుచునే యుండిరి. వీరు తెలుగు భారతమును ముద్రించినన్ని పర్యాయములు మరి ఏ ఇతర సంస్థ ప్రచురించి యుండలేదు),4. వేంకట్రామ్ అండ్ కో వారి ప్రతి 1936, 5. ఆంధ్రసాహిత్య అకాడమీ వారి పాప్యులర్ సీరీస్‌తో వెలువడిన ప్రతి 1970, 6. ఉస్మానియా విశ్వ విద్యాలయము వారి సంశోధిత మహా భారత ప్రతి 1973. 7. బాల సరస్వతీ బుక్ డిపో కర్నూలు వారి ప్రతి 1977.

పై ప్రతులన్నిటిలోను ప్రసిద్ధిపొంది పెక్కుచోట్ల లభించుచున్న ప్రతి వావిళ్ళ వారిదే. ఈ పరిశోధనకుపయోగింపబడినది కూడ వావిళ్ళ వారి ప్రతియే.

మహాభారత కాలము :

భారతము వేదవ్యాస స్వకపోల కల్పితము కాదు-స్పష్టముగా చరిత్రకందని, జరిగిన వృత్తాంతమే ఈ భారత కథ. అట్లయినచో మరి భారత కథ నడచిన కాలమేది? అను ప్రశ్న ఉదయించును. ప్రాచ్యులు, పాశ్చాత్యులను భారత కథా కాలమును కనుగొనుటకై పెక్కు పరిశోధనలు గావించియున్నారు. ఆ పరిశోధనలన్నిటిని ఇక్కడ ఏకరువు పెట్టుట పిష్టపేషణము వంటిది. ఉత్తరహిందూ

దేశము నందలి ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములోని 'విదుర సేవాశ్రమ్' వారు మహా భారత యుద్ధ చారిత్రకతపై నొక గోష్ఠి జరిపిరి.[14] తత్సారాంశములను Mahabharata Myth and reality-differing Views [Edited by S.P. Gupta and K. S. Ramnchandran] అను సంకలన గ్రంథముగా ప్రచురించిరి. అందు పాల్గొనిన పండిత పరిశోధకుల వాదోపవాదముల సారాంశ మీ దిగువ ప్రస్తావింపబడుచున్నది ఈ సారాంశములకు నాధారగ్రంథము కవిత్రయ శ్రీకృష్ణ దర్శనము-

ఆచార్య V. N. దత్తా, H. A. ఫాడ్కే మున్నగువారు క్రీ. పూ. 600 సం॥కు పూర్వమే భారత యుద్ధము జరిగి యుండునని భావించిరి. క్రీ. పూ. 600 సం.లో సంతరింపబడిన సాంఖ్యాయనములో కురువంశీయుల ప్రస్తావన కలదు. కావున భారతకథ అంతకు పూర్వపుది-

అష్టాధ్యాయి కర్తపాణిని, చైనారాయబారి హుయాన్‌త్సాంగ్ భారతయుద్ధ మును ప్రస్తావించుటచే నీ కథ క్రీ. పూ. 700 సం॥లకు ముందే జరిగియుండు నని డాక్టరు. వి.సి. పాండేగారు తలంచిరి.

మత్స్య వాయు పురాణములందు పరీక్షిత్తు పాలించు చున్నపుడు హస్తినా పురము గంగా ప్రవాహములో మునిగిపోయినదని సాక్ష్యము గలదనిరి, మరియు హస్తినా నగరములోని Painted grey ware culture నాశనమై పోయిన దనియు నా తరువాత Northern Black polished ware culture [క్రీ.పూ. 600-200] వచ్చినది కాన మహాభారత కాలము క్రీ.పూ. 1000-900 అని B B. లాల్‌గారి అభిప్రాయము. B.K. థాపర్ గారు కూడ ఈ అభి ప్రాయమునే సమర్ధించి భారతకాలము క్రీ.పూ. 1000-900 అని వక్కాణించిరి.

ఆచార్య పుసాల్కరు గారు వైవస్వత మనువుకాలము క్రీ.పూ. 3100గా పేర్కొనిరి. ఈ మనువునకు ధర్మరాజునకు మధ్య 94 తరములు గలవనియు, తరమునకు 20 ఏండ్లు చొప్పున 1880 ఏండ్లు 3100లో తగ్గించి క్రీ పూ. 1200 ప్రాంతములో భారతయుద్ధము సంభవించియుండునని భావించిరి.

ఖగోళ శాస్త్రమాధారముగ గొని S.B. రాయ్ భారతయుద్ధకాలము క్రీ.పూ 1424-1414 అని చెప్పిరి-మరియు జ్యోతిష వేదాంగ సూత్రముల కాలము

క్రీ.పూ. 1270 ప్రాంతమనియు దాని ప్రకారము భారతయుద్ధము క్రీ.పూ. 1400 కు ముందు జరిగెననియు తలంచిరి.

విల్సన్ గారు భారత యుద్ధకాలము క్రీ.పూ. 13 0 అని భావింపగా, రాయ్ చౌదరిగారు క్రీ పూ. 1412 ప్రాంతమని తలచిరి. అల్తేకరు గారు క్రీ.పూ. 1482 ప్రాంతమనిరి. సేన్ గుప్తగారు క్రీ.పూ. 2448 ప్రాంతముగా భావించిరి.

C.V. వైద్యగారు మెగస్తనీస్ గ్రంథము నాధారముగ గొని కృష్ణునకు చంద్ర గుప్తునకు నడుమ 138 మంది పాలకులు గలరనియు, తరమునకు 20 సం॥చొప్పున 2780 సం॥ చంద్రగుప్తుని కాలమునకు కలిపి పాండవుల కాలము క్రీ.పూ. 3072 అని నిర్ధారించుటకు ప్రయత్నించిరి.

ఆర్యభట ఖగోళ సంప్రదాయాను సారముగ రెండవ పులకేశి [శక 556+78=634 క్రీ శ.]కి చెందిన 'Airde' శాసనముల ననుసరించి భారత యుద్ధకాలము క్రీ.పూ. 3102-3103 ప్రాంతమని పరిశోధకులు నిర్ణయించి యున్నారు.

కురుక్షేత్ర యుద్ధము జరిగిన దినమున త్రయోదశి, చతుర్దశి, అమావాస్య ఒకేసారి వచ్చుటచే నది ఉపరాగవేళయనియు నది వినాశ హేతుక మనియు నట్టి దినమే మరల 36 సం॥లకు యాదవ వినాశము నాడు సంభవించిన దనియు సంస్కృత మహాభారత మౌసల పర్వము నందలి ఈ క్రింది శ్లోకములు వక్కాణించుచున్నవి.

> "ఏవం పశ్యన్ హృషీ కేశః-సంప్రాప్తంకాల పర్యయం
> త్రయో దశ్యాం అమావాస్యాం-త్వా దృష్ట్వాప్రాలు వీదితం"
> "చతుర్దశీ పంచదశీ-కృతేకం రాహుణాపునః
> ప్రాప్తే వై భారతయుద్ధే-ప్రాప్తాచార్యక్షయానః"

పై శ్లోకముల భావము ననుసరించి మహాభారత యుద్ధము క్రీ.పూ.3138లో సంభవించినదని కలిశక విజ్ఞానమను గ్రంథము కలదని 'యుగపురుషుడు-వేద వ్యాస' అను గ్రంథమునందు పేర్కొనబడినది.[15] మహాభారత యుద్ధకాలమెట్లున్నను, ముందు వెనుకలకు ఎంతలాగినను- కురు పాండవుల కథ చరిత్రకు

సరిగా నందని చారిత్రక కథ-భారతము నందలి వ్యక్తులు కల్పిత వ్యక్తులుకారు. సంఘటనలు కల్పితములు కాజాలవు-కాలాంతరమున శతాబ్దములు గడచినకొలది పెక్కు ప్రక్షిప్తములు, విపర్యయములు జరిగి యుండవచ్చును.

ఏది ఏమైనను మహాభారతము భారతీయులకు ఆరాధ్య గ్రంథరాజము. అందలి ధర్మము, సత్యము, న్యాయమునకు సంబంధించిన విషయములు సార్వ కాలికములు. భారతగత సర్వవిషయములు దేశ కాలాతీతములు-భారతమొక విజ్ఞాన సర్వస్వము. ఇంతటి విశిష్టరచన ప్రపంచ వాఙ్మయము నందెక్కడను కనబడదు. మహాభారతము లోకోద్ధరణమునకై రచితము. మానవ కళ్యాణార్థము, భారత పౌరులను మానవోన్నతులుగా తీర్చిదిద్దుటకై వ్యాస భగవానుడు భారత రచనకు కడంగినాడు. మహాభారతము భారతజాతికి జీవగర్ర, భారతగత-ఉక్తులు సర్వమానవాళికి హితోక్తులు-మహాభారతము నందు మానవాభ్యుదయము నకు దగిన సూక్తులు కోకొల్లలుగా విరచింపబడినవి. కావుననే మహాభారతమును సూక్తి రత్నాకరముగ పేర్కొనవచ్చును.

## జ్ఞాపికలు

1. ఆంధ్ర మహాభారతము — ఆది -1-31
2. విష్ణు సహస్రనామమ్
3. ఆంధ్ర మహాభారతము — ఆది -1-67
4. అందే — ఆది -1-67
5. భారతము-తిక్కన రచన — పు -4
6. ఆంధ్ర మహాభారతము — ఆది 1-29
7. సంస్కృత మహాభారతము — ఆది -1-94
8. భారతము తిక్కన రచన — పు -9
9. అరణ్య పర్వము-పీఠిక — పు -4
10. నన్నయ ప్రసన్నకథా కలితార్థయుక్తి — పు -
11. అరణ్యపర్వము పీఠిక — పు -4
12. ఆంధ్ర మహాభాగవతము — -1-21
13. మహాభారత చరిత్రము — పు 41 అధోజ్ఞాపికలో
14. 19-9-76 నుండి 21-9-75 వరకు
15. కవిత్రయ శ్రీకృష్ణ దర్శనము — పు -34

# ఆంధ్ర మహాభారతము-సూక్తిరత్నాకరము

మహాభారతము ఆదర్శము వంటిది. విభిన్న వ్యక్తులు తమ ముఖారవిందములను అద్దములో చూచుకొనినపుడు వారి వారి బింబములే ఆ అద్దములో ప్రతిబింబించును. అట్లే మహా భారతము కూడ నే దృష్టితో చూచువారికి నా దృష్టినది ప్రతిబింబించును. భారతము ఆదర్శ వంతమైన గ్రంథము. పురుషార్థ సాధనకు భారతము మార్గదర్శకము. ఈ విషయమును తిక్కన సోమయాజి మనోహరముగ పేర్కొని నాడు—

క. వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహు పురాణ వరంబు లకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్ విరాట-1-4

మహా భారతము సర్వవిషయములకు తావలమగుటచే దీనిని విజ్ఞాన సర్వస్వముగ పండితులు పరిగణించుచున్నారు. వేదాంత సారమిందు గలదు. పురాణ సారాంశమిందు ద్యోతకము-స్మృతులందలి వ్యాఖ్యానము లిందు గలవు-ఉపనిషత్సారమిందు అవగతము-ధర్మశాస్త్ర గ్రంథమిది. సత్య దృష్టితో రచింపబడిన సత్య ప్రబంధమిది. నీతిశాస్త్ర రహస్యము లిందు క్రోడీకరింపబడి యున్నవి. యోగశాస్త్ర విషయ వివరణ మిందు గలదు-ఆముష్మిక సాధన కిది మార్గదర్శకము. మహా భారత మొక మహా కావ్యము. ఎందువలననగా వేదపురాణోపనిషత్తుల సారమును గాని, ధర్మ, నీతి, యోగశాస్త్ర విషయ సారాంశమును గాని ప్రత్యక్షముగ నట్లే బోధించిన పాఠకులకు రంజింపదు, రుచింపదు. కాని ఈ విషయములనే మనోజ్ఞమగు కథతో మేళవించి సందర్భాను సారముగ బోధించిన నవి చదువరులకు నవగత మగును. అందు వలననే వేదవ్యాసుడు లోకోత్తరమైన కథ నెన్నుకొని, దానికి సకల విషయ పరిజ్ఞానమును జోడించి, భారతీయులకు నీ మహా భారత కావ్యము నందించి యున్నాడు. కావ్య కథా గత విషయములు హృదయము నలరింప చేయుచు మనసునకు హత్తుకొని పోవును.

## కావ్య ప్రయోజనములు:

కావ్య ప్రయోజనములను గూర్చి ప్రాచీనాలంకారికులు పేర్కొనిన దాని నించుక పరికింతము. హితముతో కూడినది సహితము. తద్భావమే సాహిత్యము. సాహిత్యమనగా రసప్రధానమై, ఆనంద ప్రదములగు రచనలని వక్కాణింప నగును. ఆ రచనలు విశ్వజనీనములగుటయే గాక వానికి పఠింప చేసెడి గుణముండ వలెను. రచన ఆమూలాగ్రము రసప్లావితముగా వలెను. భామహుఁడు[1] కావ్యప్రయోజనము నిట్లు నిర్ణయించి యున్నాడు-

శ్లో॥ "ధర్మార్థ కామ మోక్షేషు - వైచక్షణ్యం కళాసుచ
ప్రీతింకరోతి కీర్తించ - సాధుకావ్య నిషేవణం" - సాధుకావ్య పఠనము వలన ధర్మార్థ కామ మోక్షవిషయక విచక్షణా జ్ఞానము కల్గును, కళా వైదగ్ధ్యము ఏర్పడును. ప్రీతి, కీర్తి లభించును.

మమ్మటుడు[2] కావ్య ప్రయోజనమును మనోజ్ఞముగా నిర్వచించి యున్నాడు-

శ్లో॥ కావ్యం యశసే ర్థకృత్తే వ్యవహార విదే శివేతర క్షతయే
సద్యఃపర నిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే"

కావ్య కారణముగ యశస్సు. ధనలాభము, వ్యవహారజ్ఞానము కల్గును-కావ్యము అమంగళహారియట-పఠించినంత నే పరనిర్వృతి ప్రాప్తించును. కాంతా సమ్మితమైన ఉపదేశ యుక్తి ఇందుండును. కావ్యములు ఉపదేశ ప్రదములు కూడనైన యెడల పుష్పమునకు తావిఅబ్బినట్లు, సువర్ణమునకు మెరుగు పెట్టి నట్లగును. అథవా కావ్యము సదుపదేశ ప్రదము కాకపోయినను ఫరవాలేదుగాని అది దురుపదేశ ప్రదము మాత్రము కారాదు.

కవియన నెట్టివాడో, కావ్యమనగ నెట్లుండవలెనో అని తెలియ జేయు చున్న ఒక మనోహరమగు చాటువు[3] సంస్కృత సాహిత్యమున వెలుగు చున్నది-

శ్లో॥ "కింకవేః తస్య కావ్యే న-కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం-నఘూర్ణయతి యచ్ఛిరః"

5)

కవి ఎందులకు? కావ్యమెందుకు? విలుకాడు పట్టిన అమ్ము ఎందులకు? పర హృద్భేదము చేయుచు కావ్యము, శరము నుండ వలయునట-

ఈ రమ్యమగు నభిప్రాయముగల చాటువు ననుసరించి నన్నెచోడుడు ఈ భావమునే మనోహరముగ వ్యక్తీకరించినాడు-

క. ముదమున సత్కవి కావ్యము
నదరగ విలుకాని పట్టి నమ్మును బర హృ
ద్భిదమై తలయూపింపని
యది కావ్యమే? మరి పట్టినదియున్ శరమే?

నన్నయభట్టారకుడును కావ్యలక్షణమును చెప్పుచు 'విశ్వశ్రేయః కావ్యమ్'[5] అని పేర్కొనెను-కావ్యము సమగ్ర శ్రేయస్కరము కావలయును. శ్రేయస్సు అనగా రాగల శుభమనవచ్చును-అనగా సర్వ ప్రజలకు ధర్మార్థాది పురుషార్థ సాధన కారి కావ్యము-ప్రాచీన కవులందరు కావ్యరచన చేసినది విశ్వ శ్రేయస్కరము నభిలషించియే-నన్నయభట్టు తెనుగునందు మహాభారత సంహితారచన బంధురుడైనది జగద్ధితము కొఱకే. తిక్కనామాత్యుడు మహాభారతమును తెనుగున వినిర్మించినది భవ్య పురుషార్థ తరు పక్వఫలమని[7]. భావించియే.

వివిధ శాస్త్ర విషయములు క్రోడీకరించి ఒక శాస్త్రగ్రంథమును సంతరించిన యెడల నది జనాకర్షణ చేయజాలదు-పైగా నా శాస్త్ర గ్రంథము జనాదరణ సంపూర్ణముగా సమస్త జనులతో పొందజాలదు. విభిన్న శాస్త్ర విషయములనే, కావ్యకథా సమ్మేళనము గావించి రచించిన, నది విరసులకు సహితము ఆకర్షణీయముగా నుండును-ఈ రహస్యము నెరింగిన వారు కావుననే వాల్మీకి, వేదవ్యాసాది మహర్షులు కావ్యరూపమున ప్రపంచమునందలి అనేక సత్యములను, విజ్ఞాన విషయములను మనకు బోధించినారు-మహాభారతము నందు కథా వ్యాజమున పాత్రలనోట పెక్కు విజ్ఞాన రహస్యములను, ఐహిక పారలౌకిక విషయములను వ్యాసమహర్షి మన కందించినాడు-సంస్కృత మహాభారతము ఒక సూక్తి రత్నాకరము-కవిత్రయము వారు నద్దాని నాంధ్రీకరించుచు నా సూక్తి సుధను తెలుగువారికి పంచి పెట్టియున్నారు-ప్రస్తుత పరిశోధనమున కవిత్రయ భారతమునందలి వివిధ సూక్తి వివేచనయే చేయబడుచున్నది. సంస్కృతాంధ్ర భారతముల భేద సాదృశ్యముల దృక్పథమిందు లేదు-అది ఒక పరిశోధన గ్రంథ

మగును. కేవలము తెలుగు భారతమునందు గల సూక్తుల నేర్చి, కూర్చి, వింగడించి వివరించుటయే ప్రకృత పరిశోధనోద్దేశము-మూల భారతము నందలి సూక్తులను కవిత్రయమువారు విస్తరించినారా? విస్మరించినారా? కల్పించి రచించినారా? మున్నగు ప్రశ్నలకు సమాధానము లిందు మృగ్యము.

**ఉక్తి భేదములు :**

ఉక్తియనగా మాట, సరస్వతి అను నర్థములుగలవు.8 ఉక్తులలో పెక్కు భేదములున్నవి. కొన్ని ఉక్తులను ఆలంకారికులు అలంకారములుగా పేర్కొని యున్నారు, ఉక్తి భేదములను ఇంచుక గమనింతుము. 1. అతిశయోక్తి, 2. అత్యుక్తి, 3. అన్యోక్తి, 4. గూఢోక్తి, 5. చతురోక్తి, 6. చాటూక్తి, 7. చిత్రోక్తి, 8. ఛేకోక్తి, 9. నర్మోక్తి, 10. నిరుక్తి, 11. పర్యాయోక్తి, 12. ప్రౌఢోక్తి, 13. మధురోక్తి, 14. లోకోక్తి, 15. వక్రోక్తి, 16. వినోక్తి, 17. విశేషోక్తి, 18. వివృతోక్తి, 19. వ్యాజోక్తి, 20. సమాసోక్తి, 21. సరసోక్తి22. సహోక్తి, 23. స్వభావోక్తి.

పైన పేర్కొనిన ఉక్తిభేదములు సూక్తులు కాజాలవు-

**సూక్తి ప్రస్తావనలు :**

ఆంధ్ర వాఙ్మయమున సూక్తి ప్రస్తావన గావించినవారిలో నాద్యుడు ఆదికవి నన్నయ భట్టారకుడు, నన్నయ భారతగ్రంథావతారికలో తన కవితా లక్షణములను వివరించుచు సూక్తిప్రస్తావన చేసియున్నాడు. అతని కవితా లక్షణములలోనిది. మూడవదిగ పేర్కొనబడినది-ఉత్తరోత్తరము బలీయమను దృష్టియా?

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో
నారసి మేలునా, నితరులక్షర రమ్యత నాదరింప, నా
నారు చిరార్థ సూక్తినిధి, నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్

[1-26]

నన్నయభట్టు నానారుచిరార్థ సూక్తినిధియట-సూక్తులకు, అర్థసూక్తులకు, రుచిరార్థ సూక్తులకు, నానారుచిరార్థ సూక్తులకు నన్నయభట్టేకాదు మహాభారతము కూడ నిధివంటిదే,

నన్నయ పిమ్మట ఈ సూక్తి ప్రస్తావన గావించినవాడు కవిరాజ శిఖామణి నన్నెచోడుడే కుమారసంభవ కావ్యావతారికలో నన్నయవలె నొకసారి కాక నన్నెచోడుడు రెండుమార్లు సూక్తిప్రస్తావన వెనువెంటనే గావించియుండుట గమనార్హము-సత్కావ్య ప్రాశస్త్యము నుగ్గడించుచు నన్నెచోడుడు సూక్తి విషయక ప్రస్తావన చేసియున్నాడు- నన్నయవలె నితడును సూక్తిని తన కవితా లక్షణములలో చివరి లక్షణముగ పేర్కొని యుండుటను గమనింపనది-

చ. సరళములుగాఁగ భావములు జానుఁదెనుఁగున నింపు పెంపుతోఁ
విరిగొన, వర్ణనల్ ఫణితి పేర్కొన, నర్థములొత్తిగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమృదుత్వరసంబునఁగందళింప,న
క్షరములు సూక్తులార్యులకుఁగర్ణ రసాయనలీలఁ గ్రాలగన్:

[1-35]

అక్షరములు, అక్షరములతో గూడిన సూక్తులు ఆర్యజనులకు శ్రవణానందము కల్గించ వలయునట-సూక్తులు హృదయ రసాయనములుగ పేర్కొనక ఇతడు కర్ణ రసాయనములనినాడు-అనగా సూక్తులు చెవులకింపు పెంపు కల్గించును-తరువాతి పద్యములో మరల నొకమారు సూక్తి ప్రస్తావన చేసియున్నాడు-పై పద్యమును సూక్తి ప్రస్తావనతో ముగించి వెనువెంటనున్న పద్యమును సూక్తిప్రస్తావనతో నారంభించినాడు-సూక్తి ప్రస్తావన పునరుక్తియా ఇది? లేక సూక్తులపై నాతనికున్న ప్రీతియా? మరి ఏమి?

సీ. మృదు రీతి సూక్తు లింపొదవింప మేలిల్లు
భావమ్ము నెలమి ప్రీత్యావహముగ
మెఱుఁగుల గన్నులు మిఱుమిట్లు వోవంగఁ
గాంతి సుధా సూతి కాంతిఁ జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తిరాలు వాఱ
దేశి మారంబులు దేశీయములుగాన
లంకారములు దానలంకరింప

ఆ. నాదరించి విని సదర్థాతి శయమున
బుధులు నెమ్మనముల నిధులు నిలుప
వలవదే సమస్తవస్తు కవీశ్వర
రచిత రుచిర కావ్య రత్నవీధి [1-36]

సమస్త వస్తు కవీశ్వర కృతమైన కావ్యరత్నములందు పైన పేర్కొనిన గుణములన్నియు నుండవలయునట-అందలి ప్రధమ గుణమే-సూక్తులు మృదు రీతిగ నుండి ఇంపొదవింప వలెననుట-మనోజ్ఞ భావములు, కాంతి, వర్ణనలు, రసములు, దేశీయ రచన, అలంకారములు మున్నగునవి, వస్తు కావ్య గతము లని ఇతని భావన.ఆలంకారికులు పేర్కొనిన ఇతర కవితా గుణములలో సూక్తు లను కలిపి చెప్పినాడు నన్నె చోడుడు-

తిక్కన సోమయాజి సూక్తి ప్రస్తావన గావించి యుండలేదు. పాల్కురికి సోమనయు, నాచన సోమనయు సూక్తి ప్రస్తావన చేసినట్లు గానరాదు-ప్రబంధ పరమేశ్వరుడగు ఎర్రన తాను సూక్తి ప్రస్తావన గావింపక పోయినను. శ్రీనాధుని కనని కవితలో నచ్చినది సూక్తి వైచిత్రియే-అల్లాడ వేమారెడ్డి నోట శ్రీనాధుడు తన కవితా లక్షణముల నీ క్రింది విధముగ చెప్పించి కొన్నాడు.

సీ. వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్క యజ్వప్రకారము రసా
భ్యుచిత బంధనమున నొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు[9] ....

శ్రీనాధునికి వేములవాడ భీమనలో కనబడినది ఉద్దండలీల. నన్నయలో ఉభయ వాక్ప్రౌఢి, తిక్కనలో రసాభ్యుచిత బంధనము, మరి ఎర్రనలో సూక్తి వైచిత్రి-మనము పరిశీలింపనున్న సూక్తి వైచిత్రివేరు-ఈ రెంటికి సామ్యమే లేదు-

**పూర్వ కవుల సూక్తులు :**

నన్నయ పేర్కొనిన నానారుచిరార్థ సూక్తులు తరువాతి అధ్యాయము లందు విపులముగ ప్రసక్తము లగును-అయినను చాపల్యముతోనిట కొన్ని సూక్తులు ప్రసక్తములు-

1. ఎఱుక గలదె మగువ కెందు (ఆది-2-34)
2. తాము శక్తి నోర్వఁగలరె జనులు (ఆది-3-39)
3. వివేక శూన్యుల కడమండెడునంత కంటెఁగష్టము గలదే (ఆది-3-149)
4. అల్పమయ్యు దర్పము బహుకాల సంచితతపః ఫలహాని యొనర్పకుండునే (3-217)
5. వివేక విహీనులకైన లక్ష్మి సుచిర మగునె యెందు (సభా-1-121)
6. పాపకారులకుఁ బాయునవశ్యము నర్థ ధర్మముల్ (సభా-2-13)

'బుద్ధిః కర్మానుసారిణీ' అను సంస్కృత సూక్తిననుసరించి సవివరణతో నన్నయ ఒక చక్కని సూక్తిని రచించినాడు-పాండురాజు మృగరూపముల క్రీడించుచున్న మునిదంపతుల ద్రెళ్ళగ నేసినాడు- అంతవారు శాపమిచ్చిరి. శాపోపహతుడైన పాండురాజిట్లని తర్కించుచున్నాడు-

క. ఎట్టి విశిష్ట కులంబునఁ
బుట్టియు. సద సద్వివేకములు గల్గియు, మునున్
గట్టిన కర్మఫలంబులు
నెట్టన భోగింప కుండ నేర్తురె మనుజుల్ [ఆది-5-58]

ఇక నన్నెచోడుని కుమార సంభము నందలి రెండు మూడు సూక్తులను పరిశీలింతము-ఈ కవి ఒకచో శ్లేషానుప్రాణిత ఉపమాలంకార గతముగ మనోజ్ఞమైన సూక్తిని చెప్పినాడు-

తే. కొలను వన్యేభవములు చొచ్చి కలయఁ గలఁపఁ
బులుపులుడక వెలువడిపోయెఁబోక
దగదె మాతంగ దూషితం బగు సరోవ
రంబు సద్ద్విజ వర్జనీయంబు గాదె [1-92]

ఏనుగులు విహరించు చున్నట్టి సరస్సు మంచి పక్షులకు వర్జనీయము గాదా? అని ఒక అర్థము. మాతంగులనగా మాదిగవారు లేక పంచములు దిగి స్నానమాడిన సరోవరము సద్బ్రాహ్మణులకు వర్జనీయముగాదా ? అని మరి యొక అర్థము-అది ఒకనాటి సూక్తి-ఎవరికి ? బ్రాహ్మణులకు-కాలము మారినది భావములు మారినవి. సంఘము మారినది. కావున నేడది సూక్తిగా ఎవరు గ్రహించినను మాదిగవారు గ్రహింపజాలరు గదా!

నన్నెచోడునిదే మరియొక మనోజ్ఞమైన సూక్తిని పరికింతము. శివుడు కుమారస్వామికి తత్త్వోపదేశము చేయుచు తత్త్వ రహస్యములను ఎరిగించు చున్న సందర్భము నందలి సూక్తి ఇది —

మ. సరసాహారము రాగహేతువనుట జానంబు, పారావతో
త్కరముల్ సిక్కని రాలు మ్రింగియు సదాకామార్తులై
యుండుఁ, గే
సరి సాంద్రామిష భుక్తియైనను సకృత్సంభోగమందున్, మనో
హర విజ్ఞానము కాక రాగరస మందాహార నిర్వృత్తియే.
[12-219]

మంచి ఆహారము భుజించినంత మాత్రమున నతి కామము కల్గదు అట్లు తలంచినచో నది అజ్ఞానమే అగును, పావురములు రాలు మ్రింగినను నవి ఎల్లపుడు కామార్తులై యుండును-మృగరాజు సాంద్రామిషము భుజించినను దానికున్నది సకృత్సంభోగమే- మనోహరమైన విజ్ఞాన ముండవలయునే కాని ఆహార నిర్వృత్తికి రాగరసమున కెట్టి సంబంధము నుండదు.

ప్రాచీన కవులలో మంచన సూక్తి ప్రస్తావన చేయకపోయినను కేయూర బాహు చరిత్రము నందు 12 నీతికథలు వక్కాణించుచు నందు ప్రకృతి సత్యములను, మానవ చిత్త వృత్తిని వ్యక్తీకరించు రమణీయమైన సూక్తుల కొన్నిటిని రచించినాడు. అందలి రెండుమూడు సూక్తులు అవశ్యము పరిశీలింపదగినవి. ఆ సూక్తులకు మూలములుండిన నుండ వచ్చును గాకేమి? కవి చెప్పిన తీరు ప్రశంసార్హము—

'ధనమూలమిదమ్ జగత్'. ఈలోకమున ధనమునకున్న ప్రాధాన్యము రూపమునకు, గుణమునకు కడకు విద్యకు కూడ లేదనుట అందరెరిగిన సత్యమైనసూక్తి. ధనవిషయమున నెవరిని నమ్మరాదు-తండ్రిని, తల్లిని, భార్యను, సోదరులను, పుత్రులను నమ్మరాదు - అట్లని నమ్మకుండిన ఈ లోకాచారము నడవదు-ఈ విషయమునే మంచన ఇట్లు వ్రాక్రుచ్చుచున్నాడు-

క. సొమ్ముల యెడ నెవ్వారల
నమ్మఁదగదు, నమ్మకుండినను జరుగదిలన్
సొమ్ముగలవారి కర్థుల
నమ్మఁగ గీడైననే మనం గలదు తుదిన్ [3-185]

'అంత్య నిష్ఠురము కంటె నాంది నిష్ఠురము మేలు' గావున తుదకు కీడగునను నభిప్రాయ మున్నపుడు సొమ్ము ఇచ్చుటయే వర్జనీయము గదా!

సుజనులకు కుజనులకు స్నేహ విషయమునను, అలుక విషయమునను గల భేదమును మంచన ఒక్కొక్క అక్షరము భేదముతో చమత్కారావహముగ నొక సూక్తిని చెప్పినాడు.

క. చెలిమి శిలాక్షర మెప్పుడు
నలుక జలాక్షరము సుజనులగు వారలకున్
చెలిమి జలాక్షర మెప్పుడు
నలుక శిలాక్షరము కుజనులగు వారలకున్. [3-29]

ఈ లోకమున వృద్ధుడైన పురుషునకు కన్యపైనను, వృద్ధయగు స్త్రీకి తరుణ వయస్కుని పైనను కోరిక యుండుటను మనము గమనించుచునే యున్నాము-మరియు నా వృద్ధ పురుషునిపై కన్యకు ఆ వృద్ధస్త్రీపై తరుణునికి గల అసహ్యమును మనము చూచుచునే యున్నాము. ఈ విషయమునే మంచన రమ్యమైన సూక్తిగ సూటిగ హృదయమునందు పొడకు లకుహత్తుకొని పోవునట్లుగ విరచించినాడు-

క. వృద్ధునకుఁ దరుణి యమృతము
వృద్ధుడుఁ దరుణికి ననహ్య విషయ మూహింపన్
వృద్ధకుఁ దరుణుండ మృతము
వృద్ధయుఁ దరుణున కనహ్య విష మూహింపన్. [?-27]

సూక్తి నిర్వచనము:

కతిపయ సూక్తులనుదాహరణ పూర్వకముగ వివరించిన యనంతరము సూక్తి నిర్వచనము గావింపనేల? అను ప్రశ్న చదువరుల కుదయింపవచ్చును. సూక్తులరుచి ఎరిగిన పిదప సూక్తి నిర్వచనము చేయుట సులభము. నిర్వచనము చెప్పినంతనే పాఠకుల కూహకందును, సుబోధకముగ నర్థమగును. కావుననే సూక్తి నిర్వచనమునకు పూనుకొనుట.

ఉక్తియనగా మాట, పలుకు అని అర్థము. సు+ఉక్తి=సూక్తి అనగా మంచిమాట, హితమగుమాట, తథ్యమగు పలుకు అని చెప్పనగును. సూక్తి అను పదమునకు చార్లెస్ ఫిలిప్ బ్రౌను నిఘంటువు10 నందు-సూక్తి, Plu -. సూక్తులు=Fairwords, good expressions, మంచి మాటలు అనిగలదు. శబ్దరత్నాకరము నందు సూక్తి అనుపదము మృగ్యము11, తత్సమ పదములు తత్సమపద రూపాంతరములను నీరెండు అనుబంధము లందును సూక్తి పద మీయబడలేదు. చెలమచెర్ల రంగాచార్యుల సంకలన నిఘంటువు తృతీయ సంపుటమునందు సూక్తికి-12. 1. సుద్ది, సమాచారము, 2. మంచిమాట, 3. నీతి వాక్యము, సుభాషితము. 4. దొసగులులేని వాక్యమను నర్థము లీయబడినవి.

పై నీయబడిన అర్థములను గ్రహించిన సూక్తియననేమో మనకు సువిదిత మగుచున్నది. సూక్తియనగా సుభాషితము. తెలుగులో చెప్పవలెనన్న మంచి మాట-మానవునకు నిత్య జీవితమునందు మార్గదర్శకములగు మంచిమాటలే సూక్తులు. ఆ సూక్తులు పురుషార్థములకు సంబంధించి యుండవచ్చును, లేక సత్యము, దానము, దయ, నీతి మున్నగు నేవిషయమునకైనను సంబంధించి యుండనగును. నీతి బోధకములగు భర్తృహరి సుభాషితములన్నియు సూక్తులే. సూక్తి రత్నములనేర్చి కూర్చి వానిని సుభాషిత రత్నావళి ఇత్యాది పేర్లతో పిలుచుట మనకందరికి తెలియును.

సంస్కృతము నందలి భర్తృహరి గాని, ఆంధ్రము నందలి వేమనగాని, కన్నడము నందలి సర్వజ్ఞుడు గాని పేర్కొనిన వాక్యములన్నియు సూక్తులే. సూక్తి ఒకప్పుడు ఏకవాక్య గతముగానో భిన్నవాక్య గతముగానో యుండవచ్చును. నన్నెచోడుడు పేర్కొనిన,

తే. 'కాము మాయల నెవ్వారు నేమి గారు' [1-104]

అనునది భిన్న వాక్యములో నిమిడియున్న చక్కని పద్యపాదగతసూక్తి. మరియొకప్పుడు సూక్తి వచనములో నుండవచ్చును-కీర్తియు నపకీర్తియు జనులకు స్వర్గ నరక నిమిత్తంబులు [ఆది-8-33], విప్రులకయిన బాధ దీర్పకయుపేక్షించుట పాతకంబు [ఆది-8-116]. సూక్తులు సర్వసాధారణముగ పద్యగతములైన వుడవి కందములలోనో, ఆటవెలదులలోనో లేక తేటగీతులలోనో యుండుట గమనార్హము-ఆంధ్ర మహాభారతము నందలి సూక్తులు కొన్ని వృత్తములందును, క్వాచిత్కముగా సీసములందు నుండుటను మనము చూడవచ్చును-కథా సందర్భము ననుసరించి, పాత్ర దృష్టిననుసరించి, కవి తనకు నచ్చిన విధముగ నెందులోనైనను సూక్తిని వెలార్పవచ్చును-సూక్తిని చెప్పుటలో కవి కుండవలసిన ప్రధాన లక్షణము-సూటిగా పఠితల హృదయమునకు ప్రగాఢముగ హత్తుకొనునట్లుగ చెప్పగల్గుటయే-

## సూక్తుల పద్య గద్య సంఖ్య :

ఆంధ్ర మహాభారతము నందలి అష్టాదశ పర్వములలోని పద్య గద్య సంఖ్య మొత్తము 2,516 అని ఇంతకు ముందు అధ్యాయమునందు ఒక పట్టిక[13] ఈయబడినది. ఈ మొత్తము పద్య గద్యములను పరిశీలింపగా లభించిన విభిన్న సూక్తుల పద్య గద్యములు మొత్తము ఈ క్రింది పర్వాను క్రమముగ నీయబడినవి-

| | |
|---|---|
| 1. ఆదిపర్వము | 112 |
| 2. సభాపర్వము | 30 |
| 3. అరణ్యపర్వము | 121 |
| 4. విరాటపర్వము | 38 |
| 5. ఉద్యోగపర్వము | 68 |
| 6. భీష్మపర్వము | 15 |
| 7. ద్రోణపర్వము | 15 |
| 8. కర్ణపర్వము | 32 |
| 9. శల్యపర్వము | 22 |
| 10. సౌప్తికపర్వము | 21 |
| 11. స్త్రీపర్వము | 30 |
| 12. శాంతిపర్వము | 451 |
| 13. అనుశాసనికపర్వము | 100 |
| 14. అశ్వమేధపర్వము | 2 |
| 15. ఆశ్రమవాసపర్వము | 1 |
| 16. మౌసలపర్వము | 1 |
| 17. మహాప్రస్థానికపర్వము | 3 |
| 18. స్వర్గారోహణపర్వము | 1 |
| మొత్తము | 1063 |

ఇందకారాది సూక్తులు 223, కకారాదులైన హలాది సూక్తులు 840-వెరసి 1063 అగుచున్నవి. సూక్తులు ఎక్కువగాగల పర్వములేవి అనగా-శాంతిపర్వము [451], అరణ్యపర్వము [121], ఆదిపర్వము [112], అనుశాసనికపర్వము [100]. అట్లే సూక్తులు చాల తక్కువగాగల పర్వములేవనగా-మహాప్రస్థానిక పర్వము [3], అశ్వమేధపర్వము [2], ఆశ్రమవాస, మౌసల, స్వర్గారోహణ పర్వములందొక్కొక్కసూక్తియే గలదు-

**సూక్తులు-శాంతిపర్వ ప్రాధాన్యము :**

పద్య గద్య సంఖ్య ఏ పర్వములందు అధికముగా గలదో దాదాపు ఆ పర్వములందే సూక్తుల సంఖ్యయు నధికముగా నుండుట గమనార్హము.[14]

అన్ని పర్వములలోను నధికముగా సూక్తులు గల పర్వము శాంతిపర్వము. శాంతి పర్వమునందలి కురుపాండవుల కథ అత్యంత స్వల్పము. ఈపర్వము అనేకోపాఖ్యాన సహితము. భీష్ముడు అంపశయ్యగతుడై ఉత్తరాయణము కొరకు వేచియున్నాడు. కృష్ణానుమతిని భీష్ముడు ధర్మజునకు సకల సృష్టిరహస్యములను, ప్రకృతి తత్త్వములను, పురుషార్థములను, దానవైశిష్ట్యమును, నీతి ప్రస్తావనమును మున్నగు వివిధ విషయములను బోధించును. ఆ విషయ వివరణకై భీష్ముడనేక ఉపాఖ్యానముల నుదాహరణములుగ చెప్పినాడు-అందువలన శాంతిపర్వము ఒక సూక్తి ముక్తాకరము. మిగిలిన పర్వములన్నియు నొక ఎత్తు-శాంతి పర్వమొక ఎత్తుగా సూక్తుల విషయమున గణింపనగును-పురాతన భారతీయ విజ్ఞానము నంతటిని ఇమిడ్చికొని యున్నదీ శాంతిపర్వము. ఈ పర్వము పఠించిన సకల సందేహములు తీరిపోవును-ఇందలి వక్త కురువృద్ధుడు, జ్ఞానవృద్ధుడైన భీష్మపితామహుడు. మరి శ్రోత ధర్మాధిపతి యమాంశ సంభూతుడైన పాండవాగ్రజుడు ధర్మజుడు. వక్త శ్రోత ఎంతటి మహోన్నత మానవులో అంతటి సకల విద్యా రహస్యములిందున్నవి. కావుననే సూక్తులు అత్యధికముగ నిందున్నవి.

సూక్తులధికముగా నున్న రెండవది ఆరణ్యపర్వము. ఈ పర్వమునందును ప్రధానకథ అతిస్వల్పము. అరణ్యవాస మొనరించుచున్న ధర్మజాదులకు శౌనకుడు, శ్రీకృష్ణుడు, కృష్ణద్వైపాయనుడు, బృహదశ్వుడు, రోమశుడు, మార్కండేయాది మహాపురుషులు ధర్మవివరణకై పెక్కు కథలను చెప్పుదురు. ఈ పర్వమును అనేకోపాఖ్యాన సమన్వితమై విభిన్న సూక్తులకు తావలమైనది.

ఆంధ్ర మహాభారతములోని 21, 516 పద్య గద్యములలో దాదాపు మూడు భాగములు ఉపాఖ్యానములే ఆక్రమించి కొనియున్నవనియు కేవలము నాల్గవ భాగములో మాత్రమే ప్రధాన భారత కథ చెప్పబడినదనియు పరిశీలకులు భావించుచున్నారు. అనగా 5 లేక ఆరువేల పద్య గద్యములలోనే కురుపాండవ కథ నడచినది. మిగిలినదంతయు ప్రధానకథకు అనుసంధింపబడినది-

21516 పద్య గద్య సంఖ్యలో సూక్తుల సంఖ్య 1053, అనగా 5వ శాతము సూక్తులు ఆక్రమించినవి. ప్రతి 20 పద్యములలో నొక సూక్తి కలదన్నమాట. అందువలననే అడుగడుగున సూక్తులుగల ఈ మహాభారతము సకల భారతీయులకు శిరోధార్యమైనది. సూక్తుల సంకలనమున పునరుక్తములైన కొన్ని

సూక్తులు పరిత్యక్తములై యుండును. కొన్ని సూక్తులు పరిశోధకుని కనుబ్రామి యుండవచ్చును.

సూక్తులు–ఛందముల పట్టిక :

నన్నయ భారత భాగములలో నున్న సూక్తులసంఖ్య - 181, ఎర్రనలో నున్నవి–82, తిక్కనలో వచ్చినవి–800 వెరసి 1063 నన్నయ భాగములోనున్న సూక్తుల శాతము = $\frac{181}{4011}$, ఎర్రనలోని శాతము $\frac{82}{1595}$ తిక్కనలోని శాతము $\frac{800}{15910}$ అయినవుడు శాతమును దాదాపు ఇట్లు చెప్పనగును.

నన్నయ ......... 12%
ఎర్రన......... 19.5%
తిక్కన......... 19.9% అనగా భారతమునందంతటను సూక్తులు రమారమి సమానముగనే ఆక్రమించినవి. ఇక ఈ సూక్తులున్న ఛందముల పట్టిక ఈ దిగువ ప్రదర్శింపబడుచున్నది–అధికసంఖ్యాక్రమము ననుసరించి ఈ పట్టిక నిచ్చుట జరిగినది.

| | |
|---|---|
| 1. కందములు | 550 |
| 2. తేట గీతులు | 147 |
| 3. ఆట వెలదులు | 114 |
| 4. సీసములు | 68 |
| 5. చంపకములు | 61 |
| 6. వచనములు | 54 |
| 7. ఉత్పలములు | 41 |
| 8. మత్తేభములు | 13 |
| 9. శార్దూలములు | 4 |
| 10. మధ్యాక్కరలు | 3 |
| 10A. మధురాక్కర | 1 |
| 11. తరువోజలు | 2 |
| 12. దోదక వృత్తములు | 2 |
| 13. మత్తకోకిలలు | 2 |
| 14. ఇంద్ర వజ్రము | 1 |
| మొత్తము = | 1063 |

సూక్తి రచనకు భారతీకవులు కందమునే ఎక్కువగ నెన్నుకొనిరి. దాదాపు సగముపైన కందములే $\frac{500}{1063}$ ఆ పిమ్మట పేర్కొనదగినది తేట గీతి $\frac{147}{1063}$ మరి ఆ పిమ్మట చెప్పదగినది ఆటవెలది $\frac{114}{1063}$ సీసములు నాల్గవదిగా నుండుట కొంతవింతయనక తప్పదు. సూక్తి రచనకు సీసపద్యముల నెన్నుకొనుట కవులందు చాల తక్కువ. వృత్తరచనయు క్వాచిత్కమే.

విశేష వృత్తములలో నన్నయ మధురాక్కర, మధ్యాక్కర [ఆది-1-49] [6-273, అరణ్య—1-234, 235]; తరువోజ [ఆది-?-10?]: మత్తకోకిల [సభా-2-4] లను మాత్రమే ఉపయోగించినా ప్రబంధ పరమేశ్వరుడు విశేష వృత్తమును సూక్తిని వెలార్చుటకు గైకొనలేదు- తిక్కవి సోమయాజి తరు వోజ, దోదకము, మత్తకోకిల, ఇంద్ర వజ్రమను నాలుగు విశేష వృత్తములను చేపట్టినాడు-

సూక్తులు, నీతులు బోధించు శతకములన్నియు చాలవరకు కందములనో, తేటగీతులనో, ఆటవెలదులనో, గ్రహించి రచింపబడుట మనకు తెలిసిన విష యమే-సుమతీ శతకము, వేమన శతకము నుదాహరింపనగును. కన్నడకవి సర్వజ్ఞుని వచనములను త్రిపదులలో సాగినవి. సూక్తి రచన సంక్షిప్తంగా నుండి పఠితను, శ్రోతను ఆకర్షింపవలయును- మరియు నొకటి రెండు పర్యా యములు చదివినంతనే కంఠస్థము చేసినట్లుగ సూక్తి జిహ్వాగ్రమున నిలువ వలెను-ఇట్టి లక్షణాన్వితముగ సూక్తులను రచించుటకు అలతి అలతి పాదములు గల కందములు, గీతులు, ఆట వెలదులే అనువుగా నుండును-మన కవిత్ర యము వారును ఈ పద్యములనే ఎక్కువ గ్రహించినారని పట్టిక సాక్ష్యమిచ్చు చున్నది గదా!

### సూక్తులు-కందపద్య ప్రాధాన్యము :

ఈ మూడిటిలోను కందమునకే ప్రాధాన్యము మిక్కిలి ఎక్కువ. దాదాపు సగము పైనే సూక్తులు కందములలో నడచినవి. 'పందిని బొడిచినవాడు బంటు, కందమును చేసినవాడు కవి' అను నుడి తెలుగునందు ప్రసిద్ధము. ప్రాచీన కవు లలో తిక్కన సోమయాజి కందపద్య రచనకు సుప్రసిద్ధుడు-ఈ విషయమును కుందవరపు కవి చౌడప్ప పేర్కొనినాడు-

క. ముందుగ జను దినములలో, కందమునకు సోమయాజి ఘను
డందురు నే
డందఱునను ఘనుడందురు. కందమునకుఁగుండ పరపు
కవి చౌడప్పా.

కవి చౌడప్ప సంగతి ఎట్లున్నను తిక్కన సోమయాజి కందపద్యరచనలో మేటి యనుట ఎవరును తిరస్కరింప జాలరు. మొత్తము 550 కందములందును నన్నయ, ఎఱ్రనల కంటె తిక్కనయే ఎక్కువ కందములను ప్రయోగించి నాడనుట నిర్వివాదాంశము.

ప్రధాన సూక్తులు :

ఆంధ్ర మహాభారతము నందు సూక్తులు 1063 ఉన్నను అందులో ప్రధానమైనవి కొన్ని మాత్రమే గలవు. కొన్ని సూక్తులు అక్షరాస్యులకు మరి కొన్ని నిరక్షరాస్యులకు కూడ తెలిసినవి కలవు. వేమన నీతి పద్యములు, సూక్తులు ఏ విధముగా జానపదులందు సహితము నిత్యము ఆదరింపబడు చున్నవో అట్లే భారతగత సూక్తులను కొన్ని పల్లె ప్రజలచే నిప్పటికిని పల్లె వేయ బడుచున్నవి. అట్టి సూక్తులు సందర్భాను సారముగ నాంధ్ర ప్రజల జిహ్వా గ్రముల నుండి వెలువడుటను నిత్యము మనము గమనింప వచ్చును.

మహాభారతము నందలి విదురనీతి, మహా భాగవతము నందలి శుక్ర నీతి ఆంధ్ర జగత్ప్రసిద్ధములు. చారిత్రక కాలమునందు శ్రీకృష్ణ దేవరాయలు, రఘునాథరాయలు మున్నగు నాంధ్ర రాజులు విదురనీతి, శుక్రనీతి, భారతగత సూక్తులు అవశ్యము పఠించెడివారని మనము చదివి యుంటిమి. ప్రాచీన కాలమునందే మన కవులు నీతిని వ్యక్తీకరించు సూక్తి పద్యముల నేర్చి, సంకలన గ్రంథములుగా కూర్చినారు. మడికి సింగన వారిలో ప్రముఖుడు. ఇతడు కూర్చినదియే సకల నీతిసమ్మతము. భారత భాగవతాది ప్రశస్త కావ్యముల నుండి కొన్ని నీతులను గ్రహించి మనోజ్ఞముగా కూర్చి మధ్యమధ్యమున మడికి సింగనయు కొన్ని నీతులను రచించి ప్రక్షిప్తము చేసి ఈ సంకలన గ్రంథ మును సంతరించినాడు. కడివెడు పాలలో కొంచెడు పెరుగు వేయగా నిట్లు పాలన్నియు పెరుగుగా పరిణతి నందునో, అట్లే ప్రాచీన కవుల సూక్తులన్ని

టీలో మధ్య తాను రచించిన సూక్తుల నిమిడ్చి వంతనే ఆ గ్రంథము సింగన కృతముగా తయారైనది-భారత సూక్తుల నెన్నిటినో తర్వాతి కవులనుకరించి తమ కావ్యములలో కూర్చుటయు మనకు తెలియును-

సుమారు వంద సంవత్సరములకు పూర్వమే సుప్రసిద్ధ పండిత విమర్శకుడగు కీ.శే. కట్టమంచి రామలింగారెడ్డిగారి తండ్రియగు కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారును భారతమునందలి పద్యముల కొన్నిటిని సంకలనముచేసి శ్రీ భారతసార రత్నావళిగా ముద్రించిరి.[15] అట్లే భాగవతమునందలి పద్యములను కొన్నిటిని కూర్చి శ్రీ భాగవతసారముక్తావళిగా ప్రచురించిరి.[16] కాని ఆ ప్రతులు నేడు శిధిలములై అక్కడక్కడ లభించుచున్నవి. అవి పునర్ముద్రణా భాగ్యమునకు నోచుకొనలేదు-వారు సంతరించిన ఆ సారముక్తావళులలో కొన్ని సూక్తులున్నమాట వాస్తవమే గాని ఆ గ్రంథ సంకలన దృష్టివేరు-ఈ పరిశోధనా దృష్టివేరు-ఆ గ్రంథములు ఈ పరిశోధనకు పనికి వచ్చుటలేదు-ఈ పరిశోధనలోని ప్రధానోద్దేశము ఆంధ్రమహాభారతము నందలి సూక్తులను సంకలనము గావించి విశ్లేషించి వివరించుటయే.

ఇక ఆంధ్ర మహాభారతము నందలి ప్రధాన సూక్తులను కొన్నిటిని శాఖా చంక్రమణ న్యాయమున పరిశీలింతము. ఆంధ్రమహాభారతమనగానే మనందరికి మనోగోచరములగు ప్రధాన సూక్తుల నిట వివరించుటయే ప్రస్తుత కర్తవ్యము. ఈ సూక్తులు అక్షర క్రమము ననుసరించి పరిశీలితములు-

ఆంధ్ర మహాభారతము నందలి సూక్తులకెల్ల తలమానికమైన సూక్తి ఈ క్రిందిది-

క. ఒరులేమేమి యొనర్చిన
నరవర యప్రియము తన మనంబున కగుఁదా
నొరులకు నవి చేయ కునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్. [శాంతి-5-210]

సకల ధర్మములలో నిది ఉత్తమ ధర్మము. ఇతరులు మనకేమి చేసిన మన మనస్సునకు బాధ కలుగునో అవి మన మితరులకు చేయరాదు. ప్రతివ్యక్తి ఈ సూక్తి ననుసరించి ప్రవర్తించిన యెడల ఏవ్యక్తికి అప్రియము కలుగ నేరదు.

అందరు మనశ్శాంతితో జీవించ గల్గుదురు-'సర్వేజనాస్సుఖినో భవంతు' అగు టచే ప్రపంచమే శాంతి నిలయముగ పరిణతి నొందును-ఈ సూక్తిని పఠించిన వ్యక్తి ప్రతి ఒక్కరు నిత్య జీవితములో ఆత్మ విమర్శ చేసికొనుచు ప్రవర్తించి నచో ఈ ప్రపంచమే ఒక స్వర్గధామ మగును-

'ధనమూల మిదమ్ జగత్తు' అనుట సర్వు లెరిగినదియే. మానవుని జీవితమే కాదు,ఈ లోకమే ధనము నాశ్రయించి యున్నది. ధనమున్న కురూపి-రూపవంతుడుగ, నిర్గుణుడు,-సుగుణ వంతునిగ, పిరికివాడు, పరాక్రమ వంతు డుగ, బలహీనుడు-బలవంతుడుగ ప్రజలచే పరిగణింపబడుట మనము చూచు చునే యున్నాము-కలిమి లేకపోయిన, తోడి ప్రజలే కాదు-బంధువులు, సుతులు చివరకు భార్యకూడ లెక్కింపదు-కాన సంపద ప్రధానము. ఈ విషయమును భారతమెట్లు చెప్పు చున్నదనగా-

క. కలిమియ చుట్టలఁ జేర్చుం
గలిమియ చెలులను ఘటించుఁ గలిమియ శౌర్యో
జ్జ్వలుఁడని పించుం గలిమియ
పలువురు సద్బుద్ధియనఁగఁ బరఁగం జేయున్ [శాంతి-1-5]

కలిమి ఉన్నపుడు చుట్టములు దగ్గరకు వత్తురు-స్నేహితులమనుచు మన చుట్టు చేరుదురు-కలిమి కారణముగ నతని శౌర్యవంతునిగ పరిగణింతురు. కలిమి వలననే అతడు సద్బుద్ధి యనబడుచున్నాడు-కలిమి, కలిమి అని నాల్గు పర్యాయములు పునరుక్తమగుటచే నీ పద్యము హృదయమునకు హత్తుకొని పోవుచున్నది.

ఆంధ్ర మహాభారతము నందలి సూక్తులు చాలవరకు నితర కవుల నాక ర్షించినవి. సందర్భానుసారముగ నీ సూక్తి సుధను క్రోలి ఆ కవులు వారి కృతు లందు పేర్కొనియున్నారు-కలిమికి సంబంధించిన పై సూక్తి ననుసరించి నూతన కవి సూరన[17] ఒక చక్కని సూక్తిని చెప్పినాడు.

క. చుట్టములు గాని వారలు
చుట్టాలము మీకు ననుచు సొంపు దలిర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగ ద్రవ్యంబు చాల గలరే బంధుల్
7)

ఈ కలి కాలమునందు చేసిన మేలు మరచిపోవుచున్నారు—తల్లిపాలు త్రాగి తల్లిరొమ్మునే గుద్దుచున్నారు దుర్మార్గులు—చేసినమేలు కొందరు మరతురు, మరి కొందరు మరవక మనసునందుంచు కొందురు, కొందరు సమయము వచ్చినపుడు తిరిగి సహాయ మొనరింతురు. దుర్మార్గులు కొందరు మేలు మరచి సమయము వచ్చినపుడు కీడు చేయుచున్నారు, మేలు చేసినవారికే. ఇది నేటిలోక ప్రవృత్తి. ఈ విషయమును గూర్చి భారత మేమి చెప్పుచున్నదనగా—

క. కృతమెఱుఁగుట పుణ్యము స
 న్మతి దానికి సమము సేఁత మధ్యము మఱి త
 త్కృతమున కగ్గలముగ స
 త్కృతి సేయుట యుత్తమంబు కృత బుద్ధులకున్
 [ఆది-6-244]

చేసిన మేలును గుర్తెరుగుటయే పుణ్యము. ఆ మేలునకు తగిన మేలును తిరిగి చేసినయెడల నది మధ్యమము అంతకంటె మంచి మేలు గావించినచో నది అత్యంతము ఉత్తమమగునట—

కామము, క్రోధము, మోహము, లోభము, మదము, మాత్సర్యమనెడు నీ యారును అరిషడ్వర్గములుగ పరిగణితము. అందుక్రోధము వలన చాల ప్రమాదము గలదు. ఇది అవశ్యము పరిత్యజనీయము—'ముక్కోపి' వలన నందరికి బాధ. ముక్కుపైన కోపమున్నదని గేలి చేయుచు నతనిచూచి తనవారే భయపడుదురు—క్రోధము తపస్వికి పనికిరాదని భారతము చెప్పుచున్నది—సాధారణమైన మానవునకే క్రోధము పనికిరాదను చున్నపుడు ఇక తపస్వి సంగతివేరు చెప్ప నక్కరలేదు గదా!—

క. క్రోధము తపముం జెఱచును
 గ్రోధము యణిమాదులైన గుణములఁ బాపుం
 గ్రోధము ధర్మక్రియలకు
 బాధయగుంగ్రోధిగాఁదపస్వికిఁ జన్నే [ఆది-2-174]

కష్టపడి తపస్సు గావించి సాధించిన అణిమ, గరిమ, లఘిమ మున్నగు సిద్ధులన్నియు క్రోధకారణముగ నొకక్షణములో పోవును—క్రోధికి తపస్సు చేయు

టయే కుదరదు. ధర్మక్రియానుసరణకు క్రోధము అడ్డువచ్చు చున్నదనియు, క్రోధము నవశ్యము వదలవలయునని చెప్పుచున్నది- 'తనకోపమే తన శత్రు వనుట[18] ఇందులకే.

శిశువున కాది గురువు జనని, పిమ్మట గురువు జనకుడు. ఆ తర్వాతనే విద్య నభ్యసింప చేయు గురువు వచ్చుచున్నాడు-ఇది లోకాచారము. సార్వ కాలికము, సార్వదేశికమిది.

క. జనకుండధికుఁడు పాధ్యా
యునకుఁబది మడుంగు లెక్కుడుర్వీనాథా
జనకునకు దశగుణంబులు
జనని గురుత్వమున నిది ప్రశస్తము శ్రుతులన్ [అను-4-139]

ఆచార్యునకంటె పదిరెట్లు తండ్రి అధికుడట. ఆ తండ్రికంటెను పది రెట్లు తల్లి ఎక్కువట-ఎందు? గురుత్వ విషయమునందు, గురుత్వమును మనను నందుంచుకొనియే కాబోలు గౌరవము ఎవరెవరికి ఎంత ఈయవలయునో ఈ క్రింది సంస్కృత సూక్తి స్పష్టీకరించు చున్నది-

శ్లో. "ఉపాధ్యాయాన్ దశాచార్యః-ఆచార్యాణాం శతం పితా
సహస్రంతు పితౄన్ మాతా-గౌరవేణాతి రిచ్యతే."

ఉపాధ్యాయునికంటె పదిరెట్లు ఆచార్యుడును, ఆచార్యునికంటె నూరు మడుంగులు జనకుడును, జనకునికంటె వేయిరెట్లు జననియు గౌరవార్హులని శ్లోక భావము.

లోకము నందలి సాధు జనులను, పేద జనులను రక్షింప వలసిన బాధ్యత అందరికీ ఉన్నది. పేద జనులను ధనికులు కాపాడి పోషించుటకై ప్రయత్నింప వలయును. సాధువునకు కోపము వచ్చిన ప్రమాదము. అందువలననే తిక్కన సోమయాజి-"సాధురేఁగె నేని వ్విను తల వీలుమునన కాని విలువదు సుమ్మీ"[19] అని చెప్పినాడు-పేదలను హింసించిన విప్లవమే ఆరంభమగును. కావున—

క. తగునిది తగదని యెదలో
వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులయిన భయంబుల్— (ఆది-1-86)

దుర్వినీతులకు దుర్నిమిత్తములైన భయములు వాటిల్లును—

'లోకోభిన్నరుచిః' అనుట జగమెరిగిన సత్యము-ఏ ఇరువురు వ్యక్తులు ఒకే రకముగా నుండ జాలరు. అట్లే ఏ ఇరువురి వ్యక్తుల అభిప్రాయములను ఒకే విధముగా నుండవు. పరుల సంగతియేల? స్వజనుల విషయము కూడా నంతియే. భార్యభర్తలకు, సోదరులకు, జనకపుత్రులకు అందరకు నభిప్రాయ భేదము లుండును, కావున ఎవరి అభిప్రాయము వారిది. అందరి అభిప్రాయము లను మన్నించవలసినదే. అట్లని ఒకరి అభిప్రాయము ననుసరించి మరియొకరు నడచుట గలదా? ఎవరిమార్గము వారిదే. ఒకరి మార్గమును మరియొకరు అను సరింప జాలరు. ఈ విషయము భారతము నందెట్లున్నదో గమనించుడు. దుర్మా ర్గుడైన దుర్యోధనుని నోట ఈ సూక్తి వెలువడు చున్నది—

క. తన కార్య మొరు మతంబున
నొనరింపఁగనేర నగునె? యొరుని మతంబుం
దనమతము నొకఁడు గానో
పునెచెచ్చెర నిశ్చయింపఁ బోలునె దానిన్ (సభా-2-149)

తాను సాధించ దలచుకొన్న కార్యమును ఇతరుని అభిప్రాయము ననుస రించి సాధించ కల్గునా? తన మతము ఇతరుని మతము ఒకటగునా ? కావున ఎవరి అభిప్రాయము వారిదే.

తల్లిదండ్రులు పూజనీయులు. వారిమాట విననివాడు తనయుడు కాడు— మాతాపితరుల సేవ మాధవ సేవతో సమానమని చిన్నతనము నుండియు పాఠ శాలలో బోధించు చున్నారు-భారతీయుల అనుబంధము. అనురాగము ప్రశంసా ర్హము-జననీజనకుల పలుకు వినని తనయుడు పితృధనము కర్హుడుకాడని యయాతి చరిత్రబోధించు చున్నది—కాలము మారుటచే నిపుడు తల్లిదండ్రులను గౌరవించి, ఆదరించు తనయులెందరున్నారు. పితృధనమును మాత్రము 'పిసరంత' వదలక తీసికొనుచున్నారేగాని వృద్ధ జననీ జనకులకు సేవచేయుచున్నారా? తల్లిదండ్రు లను సేవించని వారికి ఆ తల్లిదండ్రుల ధన మెందులకు ?

క. తనయుండు దల్లి దండ్రులు
పనిచిన పనిసేయఁ డేని. పలుకెదతోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం
డనఁ బడునే ? పితృధనమున కర్హుండగునే (ఆది-3-199)

ఈ లోకమున అందరిలోను జననీ జనకులే అధిక గౌరవార్హులని ముందు చెప్పియుంటిమి గదా![20]

ఏదైన ఒక ధర్మసందేహము వచ్చినపుడు, ఒకవిషయ పరిజ్ఞానము లేనపుడు, ఆ విషయమును తెలిసిన వారిని తెలియని వారడిగి నపుడు దానిని వివరించి వారికేర్పడ చెప్పవలయునట. ఆ చెప్పుటలో సత్యమే చెప్పవలయును. అంతియేకాని అసత్యము చెప్పరాదు. ఆ విషయమును చెప్పకపోయినను, ఆ చెప్పువానికి ఘోర నరకము ప్రాప్తించునట-

క. తన యెఱిఁగిన యర్థంబారుఁ
డనఘాయిదియెట్లు సెప్పుమని యడిగినఁ జె
ప్పని నాఁడును నత్యము సె
ప్పని నాఁడును ఘోర నరక పంకమునఁ బడున్ (ఆది-1-187)

అంతియేకాదు ధర్మపరిచ్ఛేద జ్ఞానము తలవాడు అధర్మ సందేహమును స్వలాభార్థియై పలుకరాదు-లోభకారణమునగాని, పక్షపాతదృష్టితోగాని సభలందు పలికిన యెడలవానికి సత్యదోషమింటునట-అనృత దోషఫలమువంతటి తీవ్రమైన దానిగ నా కాలమున పరిగణించెడివారు కాబోలు-

ఆ. ధర్మ మెఱిఁగి దానిఁ దా నొండుగా లాభ
లోభ పక్షపాత లోలబుద్ధి
నభల నెవ్వఁ డేని సభ్యుఁడై పలుకు వాఁ
డనృత దోషఫలము ననుభవించు (సభా-2-218)

సంసారము సాగరము వంటిదని తలంతుము-సంసారమున బద్ధవాడు సాగరమున బడ్డ వానితో సమానము. అంతేకాదు సంసారి తేనెలో బడ్డ ఈగ వంటివాడు. రుచి ఉన్నది గదాయని సంసార సాగరములో మునుగలేరుగదా! సంసారము అతి దుఃఖావహమైనది. ఇది భయనికేతనము. మరియు చంచలమైనది. పరాధీనమైన ఈ సంసార జీవనమును తత్త్వవిదులు మాత్రము నమ్మరట-తత్త్వవిదేతరులు నమ్మి అనేక కష్టములనుభవింతురు.

క. నలసారము సంసార మ
ఖిల దుఃఖావహము భయనికేతనమతి చం
చలము పరాధీనం బిం
దుల జీవనమేల నమ్ముదురు తత్త్వవిదుల్ (ఆది-6-218)

కావున సంసారమునకు అతికియునశక కుంతరాదు-తామర పాకుపై నీటి బిందువు వలె సంసారమును సాగించవలెను-

అనృత దోష ఫలము అత్యంత ప్రమాదమైనదనియు, అసత్యము చెప్పువాడు ఘోర నరక పంకమున బడునైనవనియు సూక్తులు చెప్పినవి. సత్య మహిమ చాల గొప్పది-సత్యము పదివేల క్రతువులొనర్చిన దాని కంటె నుత్తమమైనది. వంద మంది సుతులను కన్నదాని కంటె మేలు-

చ. నుజతలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావిమేలు. మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతువదిమేలు, తత్క్రతు శతంబున కంటె సుతుండుమేలు, త
త్సుత శతకంబు కంటె నొక సూనృతవాక్యము మేలుసూడఁగన్
[ఆది-4-94]

ఈ పద్యము నందలి సూక్తి సూటిగా నున్నదే కాని సంక్షిప్తత మృగ్యము. సూక్తులు సర్వసాధారణముగా చిన్న పద్యములైన కందాదులలో నుండునే గాని చంపకాది వృత్తములలో నెక్కువగా నుండవని ఇంతకు ముందీ అధ్యాయము నందే పేర్కొన బడినది. [ పు- ]

మహా భారతము నందలి ఈ సూక్తిని గైకొని అనంతామాత్యుడు భోజరాజీయములో రచించినాడు. భావమునసే మాత్రము భేదము లేదు కాని ఛందో భేదము గలదు-

క. శత కూపాధిక దీర్ఘిక,
శత వాప్యధికంబు క్రతువు, శతయజ్ఞ సము
న్నతు డొక్క సుతుఁడు తత్సుత
శతకంబున కెక్కుడొక్క సత్యోక్తి నృపా (6-92)

నన్నయ ఎన్నుకొన్న ఛందము కంటె అనంతామాత్యు డెన్నుకొన్న ఛందమే సూక్తి కనువైన మాట సత్యమే. కాని అనంతామాత్యుని పద్యము కంటె నన్నయ పద్యము పఠితల నాకర్షించు చున్నది. చదివి నంతనే కంఠస్థ మగు చున్నది. హృదయమునకు హత్తుకొను చున్నది-కావున సూక్తుల నన్నిటిని కందాదులలోనే చెప్పవలెనను నియమము కుదరదు-వృత్తములలోను రమ్య ముగ నుడువ వచ్చును-

లోకమున ఈర్ష్యాసూయలున్న వారికి శాంతి మృగ్యము. హృదయము తప్తమగు చుండును-నిద్రరాదు-ఇట్టిదే మరియొకటి పగ-పగచల్లారదు-పగ కారణముగ మనసునకశాంతి, అశాంతి కారణముగ నిద్రలేమి, పగకు పాము పగ ప్రఖ్యాతము-పగ కలిగిన యెడల పామున్న యింటిలో నున్నట్లు- మనసు ఊరడిల్లదు-కావున అధిః దీర్ఘమైన పైర వృత్తి ఉండరాదు [ఉద్యోగ-౩-20]. దీర్ఘకోపము పనికిరాదు-పగఅణగించుట శుభావహమే-పగ లెస్సగా అణగి పోవునా? పగతో వగ కొన్నవారు. యుద్ధమునకేగుదురే గాని పల్కకయుండగ లేరుగదా! పగ పోగొట్టవలెనని యుద్ధమునకు పోవగా క్రౌర్యము వహించును. ఏ విధముగా నాలోచించినను పగవలన మేలు లేదని సంధికేగు కేశవునకు ధర్మ రాజు చెప్పు చున్నాడిట్లు-

చ. పగయడఁగించుటెంతయు శుభంబది లెస్సయడంగునే పగం,
బగవగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే? కడుం
దెగ మొదలెత్తి పోవఁబగఁదీర్పఁగ వచ్చినఁ గ్రౌర్యమొందునే
మిగతిఁదలచినంబగకు మేలిమిలేమి ధ్రువంబు కేశవా.

[ఉద్యో-౩-21]

ప్రకృతి సహజముగ స్త్రీ అబల-కావున స్త్రీకి సంరక్షణము కావలయును, కాలమెంత మారినను, స్త్రీలు తామెంత అభ్యుదయము సాధించినను, ఎన్ని విద్యలు నేర్చినను స్త్రీలకు రక్షణ అత్యంతావశ్యకము-కావుననే సంస్కృతోక్తి ఇట్లున్నది-

శ్లో. "పితా రక్షతి కౌమారే-భర్తా రక్షతి యౌవనే
రక్షంతి వార్థ కేపుత్రా-నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి"

స్త్రీకి జీవితము నందు పతికంటె ఎక్కువ ఎవరు? పతికంటె నన్యదైవము భామల కితరులు లేరట-సతికి పతియే సర్వస్వము-

తే. పతియ చుట్టంబుఁ బక్కంబు, బతియ చెలియుఁ,
బతియ తలియుఁదండ్రియు. బతియ గురువుఁ,
బతియ దైవంబు, కావున సతని పని యొ
నర్చుటయ చూవెధర్మంబు నాతి కరయ (అశ్వ-1-21)

సతి-పతి అన్యోన్యము ఒకరిపై నొకరు ఆధారపడియుందురు-పతిలేని సతి విధవయై లోకము చేత బ్రయ్యబడును [ఆది-6-256], సతిలేని పతి మెట్ట బడిన మీను విధమున నుండును. సతికి పతి ఎంత అవసరమో పతికి సతియు నంత ఆవశ్యకమే-ఇరువురు అన్యోన్యాధార భూతులై జీవింతురు-

పరస్త్రీ సంగమము పాపము-పరదారగమనము మహాపాపము. పరస్త్రీని సంగమించిన ప్రమాదము రాక పోవచ్చునేమోకాని, పరదారాపహరణముగాని, పరదార గమనము గాని ప్రళయమునే దెచ్చును. రామాయణము జరిగినది,లంక నాశనమునకు హేతువైనది పరదారాపహరణమే-అట్లే Helen of Troy కారణముగనే Trozan war జరిగినది-పరదారయైన హెలెన్‌ను అపహరించుటయే ఆ యుద్ధమునకు కారణము-పరస్త్రీగమన నివారణార్థమై వివాహ వ్యవస్థ ఏర్పడినది-వివాహితయైన స్త్రీ నపహరించినను, పరదారగమనము గావించినను ఆ స్త్రీకి సంబంధించినవారు, ఆమె భర్త యుద్ధమునకు వెడలుట తథ్యము. అట్టి ప్రళయ నివారణార్థమే పరదార గమనము మహాపాపమని బోధించుట, ఆయు క్షీణమని బెదరించుట-

క. పరదార గమనమెప్పుడు
పురుషున కది యెల్ల పాపముల కంటె నరే
శ్వర పర యాయుస్సంక్షయ
కరంబు త ద్వర్జనంబు కడు మేలరయన్ [అను-4-92]

పరదార గమనమే కారణముగనైన యెడల ఆ పాప పరిహారార్థము ఏమి చేయవలయునో కూడ భారతము చెప్పుచున్నది. అందువలననే భారతమున లేనిది ఇంకెక్కడ నుండదని చెప్పుట-

క. పరదార గమన దోషము
పరిహృతమగు నొక్క-యేఁడు పరమ నియతుఁడై
చరియించినఁ గృచ్ఛ్రంబులు
కురుకుల జలనిధి శశాంక గుణమణినికరా [శాంతి-1-312]

మరియు పరపురుష సంగమ కారణమునైన దోషము స్త్రీకి ఎట్లుపోవునో కూడ భారతము చెప్పుచున్నది. కావున భారతము సకల ధర్మ సందేహ నివృత్తి కారకమని చెప్పుట-

క. పరపురుష సంగమంబునఁ
బరిహృత యై యున్నయట్టి భామిని శుద్ధిం
బొరయు రజస్వల యై, కం
చరయఁగ భస్మమున శుద్ధమైన విధమునన్. [శాంతి-1-314]

'న బ్రూయాత్ సత్యమప్రియమ్' అనుట సంస్కృతోక్తి. లోకమునందెవ రైనను, ఎంతటి ధీమంతులకైనను తమ కిష్టమైన దానిని చెప్పిన పరమ సంతోషము కల్గుటయు, తమ కిష్టము కాని దానిని పలికిన బాధకలుగుటయు జరుగును. పథ్యమైన పలుకు అప్రియముగా నున్నను గైకొనుట సుమతుల లక్షణము. అట్టి పలుకు వినని వారియెదుట ప్రతిభావంతుఁడు పలుకకుండుట లెస్సయట-

తే. ప్రియము పలికెడు వారిన పెద్ద మెత్తు
రప్రియంబును బథ్యంబునైన పలుకు
వినఁగ నొల్లరు గావున వేడ్క- దానిఁ
బలుక రెవ్వరు నుత్తమ ప్రతిభులయ్యు [సభా-2-191]

సంసారము నలసారమని చెప్పియున్నాడు [ఆది-6-248]. ఎండ మావు లెట్లు చంచలములో సంసారము నంతియు చంచలమైనదట-ధనమున్నది గదా యని ధనవంతులు గర్వపడుదురే కాని అది అతిక్షణికమైనదనుట ఎరుగరు. సంపదలతి క్షణికములు. సిరి యెట్లువచ్చునో ఎట్లుపోవునో తెలియదు, ఈ విషయ మీ క్రింది పద్యమున సుమతీశతక కారుడు మనోజ్ఞముగ వ్యక్తీకరించియున్నాడు-

క.  సిరిదా వచ్చిన వచ్చును
    స లలితముగ నారికేళ సలిలము భంగిన్
    సిరిదాఁ బోయినఁ బోవును
    గరి మ్రింగిన వెలఁగ పండు కరణిని సుమతీ  [103]

మరియు భారతము సంసారమును, సంపదను గురించి చెప్పుచు గత కాలము-వచ్చు కాలముకంటె మేలని ఒక ప్రకృతి సత్యమును ప్రకటించు చున్నది. ప్రతి మానవునికి బాల్యము మధురము, బాల్యస్మృతులు స్మరణీయ ములు-వయసు పెరుగునంతకు బాధ్యతలు పెరుగును-వయసు మళ్లినంత నె జరా రుజ బాధ ఎక్కువగును, కాన గత కాలమే మేలగును-

క.  మతిఁ దలపఁగ సంసారం
    బతి చంచల మెండ మావులట్టుల సం
    పత్ప్రతతులతి క్షణికంబులు
    గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్  [ఆది-5-159]

వ్యసనములు ప్రమాద కారకములు, దుర్వ్యసనలోలుడు దుర్గతిపాలగును-వ్యసనముపై నున్న మోజు, ఇష్టము మంచి కార్యములందుంటదే మానవునకైనను! వ్యసనము మానుట అత్యంత కష్టసాధ్యము. 'Prevent!on is batter than cure' అన్నట్లుగ వ్యసనము మానుటకంటె వ్యసనమున కలవాటుపడక యుండుట తేలిక. వ్యసనములకు బానిసలు కారాదు. మృగయా వ్యసన కారణముగ దశరథుడు, పాండురాజు శాపోపహతులైనారు-ద్యూతవ్యసన కారణమున నలుడు, ధర్మరాజు సామ్రాజ్యము కోల్పోయి అడవులపాలైరి-అట్టి దుర్వ్యసనము లేవో భారతము చెప్పుచు వ్యసనముల జోలికి పోవలదని బోధించు చున్నది-

తే.  వెలఁది, జూదంబు, పానం+, వేఁట, పలుకు
    ప్రల్లదంబును, దండంబు పరుసఁదనము,
    సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేఁత
    యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల  [ఉద్యోగ-2-44]

ప్రధాన సూక్తుల ప్రారంభము తలమానికము వంటి సూక్తితోనైనది. మరియొక శిరోధార్యమైన సూక్తితో ప్రధాన సూక్తులు, ఇక ముగియుచున్నవి.

ఆంధ్రమహాభారతము నందలి సూక్తులందెల్ల ఉత్తమమైనది. అవశ్యమనుసరణీయమైనిది, ఉద్యోగ పర్వములో సంధికొరకేగిన శ్రీకృష్ణుడు కౌరవసభలో ధృతరాష్ట్రునికి చెప్పిన ధర్మ, సత్య సంబంధమైనదిదె. ధర్మమును, సత్యమును రక్షింపక ఉపేక్ష సేయరాదు-ఉపేక్ష చేసినవారికది చేటగును-ధర్మరక్షణకు, సత్యపరిపాలనకు చివరకు దైవముండనే ఉన్నది. ఈ రెండిటిని కాపాడుట మానవుల ధర్మము. ధర్మవిషయమున నుపేక్ష చేసిన ధృతరాష్ట్రునికి చివరకేమైనది? ఏకాకియైనాడు-వార్ధక్యమున తన్నుసేవించుటకు ఒక కొడుకైనను మిగులలేదు-

ఉ. సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపము చేతఁ బొంకుచేఁ
బారముఁ బొందలేకచెడఁ బాఱినదైన యవస్థ దక్షు లె
వ్వారలు పేక్ష చేసిరది వారలచేటగుఁ గాని ధర్మ ని
స్తారకమయ్యు సత్య శుభదాయకమయ్యును దైవముండెడున్

సూక్తులు-నాడు-నేడు : (౩-273)

సర్వ సామాన్యముగ సూక్తులు సార్వకాలికములు, సార్వజనీనములు. సార్వదేశికములు-కాని కొన్ని సూక్తులు కులమత భేదకారణముననో, ఆస్తిక-నాస్తిక భేదకారణముననో విశ్వజనీనములు. కాలేకపోవుచున్నవి-కాలభేదముచే ప్రజల జీవన విధానము మారినది. రాజులు, రాజ్యము అంతరించినవి. కాని రాజుల స్థానమును మంత్రులాక్రమించుకొనియున్నారు-

కొన్ని సూక్తులు నాడు-నేడు కూడ అవశ్యము శిరోధార్యములు-ప్రధాన సూక్తులలో వివరింపబడినవి చాలవరకు విశ్వజనీనములే-ఇక్కడ మరి కొన్నిటిని పరిశీలింతము-

ఆవులింత, తుమ్ము, హాసము, నిష్ఠీవనమును గుప్తముగ నడప వలయును. ఇవన్నియు రాజసభలో పనికిరావు (విరాట-౧-137) నేటికి సభలో ఈ పనులు చేయరాదు గదా!

యుద్ధానంతరము పశ్చాత్తాపము కల్గును. 'పెనకువం బశ్చాత్తాపంబు పుట్టు (ఉద్యోగ-1-91) నేడైనను' పోరునష్టము పొందులాభమను'ట అనుసరణీయమే గదా! ఇట్టిదే మరొక్క సూక్తి కలదు. యుద్ధముల వలన బాధలేగాని

సుఖములు లభింపవని- 'సంతాపకారుల కాక పెనకువలు సుఖంబులగునె' (ఉద్యోగ-7-39). యుద్ధములందు జయము దైవాధీనము-కావున పెద్దలు యుద్ధములు వలదని చెప్పుదురు....సమరంబున జయంబు దైవాధీనంబుగా వునం బెద్దలు పెనఁకువ లొప్పవని చెప్పుదురు (భీష్మ-'-14) నాస్తికులు ఈ సూక్తిలోని దైవాధీనమనుట నొప్పుకొనరేమోగని మిగిలిన సుభాషితము నొప్పు కొనక తప్పదు గదా!

మరియొక చక్కని విశ్వజనీనమైన సూక్తి...సవతాలి ప్రజలు పొంద నేర్తురే (భీష్మ-'-168), యుయుత్సుడు యుద్ధ సమయమున కౌరవులను విడిచి పాండవులను చేరినపుడు ఆ యుద్ధ రంగమున చెప్పబడినదీ సుభాషితము-సవతుల సంతానమున కెందును పొందుకుదురదు-దాయాదుల మధ్యనేపొత్తు కుదురనపుడు బిడ్డల కెక్కడ పొత్తుకల్గును-సోదరుల మధ్యనే ఒకొకప్పుడు భేదము వాటిల్లును.

దైవమునకు సంబంధించిన సూక్తులను కొన్నిటిని నాస్తికులు అనుసరింప లేరుగదా! పునర్జన్మను కొందరు నమ్మరు. అట్టివారికిది సూక్తికాదు. 'జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మమృతస్యచ' అని భగవద్గీతాకారుడు చెప్పు చున్నాడు. (2-27). పునరపి జననం పునరపి మరణమ్మనుటనన్ని మత ముల వారు ఒప్పుకొనక పోవచ్చునపుడది సార్వ జనీనము కాలేదు.

క. ఈ మొదలు విడిచి వేఱొక
కాయముఁగైకొని శరీర కర్మవశ గతిం
బోయి సుఖదుఃఖములు గనుఁ
బాయక వెండియును దేహబంధముఁ బొందున్ [అరణ్య-5-73]

నాస్తికులు స్వర్గ నరకముల నమ్మరు-కాని విశ్వజనీనము కాని ఈ క్రింది సూక్తి సర్వమత సమ్మతము కాదేమో-

క. ఈలోకము దుఃఖ బహుళ
మాలోకము భూరి సుఖనిరంతర మందే
జాలియును లేక యొండొరు
తో నెన్నగఁ బొందియుండుదురు జనులనఘా (శాంతి-4-111)

నా ఇష్ట మార్గముననే సంచరింతును. దైవబలమేల? సర్వకార్యములకు పురుష యత్నమే ప్రధానము అని తలంచు నరునికంటె దైవమెక్కుడు. ఈ విషయము ఆంగ్లభాషలోను కలదు—'Man Proposes God disposes' దైవము నమ్మువారికి మాత్రమే ఈ సూక్తి అన్వయించును-

క. దైవంబు నేర్పుఁగా కిటు
పోవఁగ నేనేర్తు నేరఁ బొమ్మని పలుకం
గావశమె నరున కెక్కుడు
దైవము పౌరుషము కంటె ధరణీనాథా (ఉద్యోగ-2-99)

విధి బలీయము-విధిని గడచుట శివునకు వశముకాదట. 'విధిచేసిన గతిఁ బడక యుండ శివునకు వశమే'(ఉద్యోగ-1-116)-కర్మఫలములనుభవింప వలసినదేగాని వానినెవ్వరు 'తప్పించుకొన జాలరు- విధియేల గడవంగ నిచ్చుఁ గర్మవిపాకంబు గడవంగ లావె' [ఆది-6-259] పైనుదాహృతపద్యమున చెప్ప బడినసూక్తియే పునరుక్తమగుటను చూడుడు-

క. విను పౌరుషము నిరర్థక-మనుమానములేదు దైవమధికము [ద్రోణ-4-204]

'బ్రాహ్మణోన హంతవ్య' అని ప్రాచీన సూక్తి-మరి ఇప్పుడు అన్ని కుల ముల వారీ సుభాషితము నొప్పుకొందురా? భారతము నందిట్టివి కలవు-ఏమి దోషంబు చేసియు బ్రాహ్మణుండు వధ్యుండు గాఁడు [ఆది-7-192]. పూర్వ కాలమున బ్రాహ్మణులు బ్రహ్మజ్ఞాన సంపన్నులు. కావుననే వారు బ్రాహ్మణ నామధేయులైరి. అందువలన వారిని చంపుట మహాపాతకముగా నాటిప్రజలు పరిగణించినారు-ఇట్టిదే మరియొక్క సూక్తి-'విప్రు మరణంబు దలఁచుటతి పాత కము, పాతకములలో బ్రహ్మహత్యయుఁ బెద్ద [ఆది-5-273], మరియు విప్రుల కైన బాధలు తీర్పవలయును-లేనిచో పాతకము ప్రాప్తించును-'విప్రులకయిన బాధ దీర్పక యుపేక్షించుట పాతకంబ' [ఆది-8-116].

'రాజ్యాంతే నరకంధ్రువమ్మ'ని ప్రాచీన సంస్కృతోక్తి-రాజులున్న ఆ కాలపు సూక్తిఅది. 'నావిష్ణుః పృథివీ పతిః' అని విశ్వసించిన కాలమది-నేడు రాజ్యములు లేవు రాజులులేరు. కావున రాజ-రాజ్య సంబంధ సుభాషితము లిప్పు డక్కరకు రావు-రాజ్యము వీరభోజ్యమనుట నాటి ధర్మము-

తే. ఉత్తమ క్షత్రియుండేల యొరుల నడిగి
వేఁడు వాఁడగుఁ, దన భుజా విక్రమమున
నన్య ధనములుపార్జించి యర్థి జనుల
కిచ్చుఁ గీర్తి దిక్కుల వెలయించుఁగాక [ఆరణ్య-3-365]

ఉర్వీపతులందరిలో విక్రమ సంపన్నుడైన రాజు పూజ్యుడు. [సభా-2-25]. కులము, శౌర్యము, చతురంగ బలము గలవాడే రాజట-

క. కులము గలవాఁడు, శౌర్యము
గలవాఁడును, నధిక సేనగలవాఁడును, భూ
తలమున రాజను నామము
విలసిల్లఁగఁ దాల్చు మూఁడు విధముల పేర్మిన్. [ఆది-8-47]

'రాజునకు నవ్యశంబును నరకంబు చూచుట కలదు' [స్వర్గా-1-49]. పైన పేర్కొనిన సంస్కృతోక్తి కాంధ్రీకరణము వంటిది. 'లోకరక్షణంబు రాజునకవశ్య కర్తవ్యంబు' [శాంతి-2-193]. ఇది నేడు వర్తించునా? కావున ఇట్టి సూక్తులు కొన్ని సార్వకాలికములు కావు-ఇట్టివి కొన్ని మాత్రమే గలవు-

ఒకమనోజ్ఞమగు సూక్తితోనిది ముగింతము. విదురనీతిలోనిది-

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చల యుక్తిఁ జేర్చి
మూటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు [ఉద్యోగ-2-37]

ఒకటి-ఏకాగ్రబుద్ధిగొని; రెండు-మంచి చెడ్డలను నిర్ణయించి; మూడు-మిత్ర శత్రు ఉదాసీనులను వశీకరించి; నాలుగు-సామ దానభేద దండోపాయము లచే వశ్యములుగ జేసి; ఐదు-పంచేంద్రియములను [త్వక్చక్షు శ్రోత్రజిహ్వా ఘ్రాణములు] గెల్చి; ఆరు-సంధి విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయములను ఎరిగి; ఏడు-సప్తవ్యసనముల [వెలది, జూదము, పానము, వేట, ప్రల్లదమైనపలుకు, పరుసమైనదండము, సొమ్ము నిష్ప్రయోజ

వముగ వెచ్చించుట]మ విడిచి, వర్తించువాడు వివేకవంతుడగుచున్నాడు-దీనికి మూలము సంస్కృత మహాభారతము నందిట్లున్నది-

శ్లో. "ఏకయాద్వే వినిశ్చిత్య-త్రేన్ చతుర్భిర్వశీ కురు
పంచ జిత్వా విదిత్వా షట్-సప్తహిత్వా సుఖీ భవ"

ఇట్లు అనేకానేక సూక్తి భేదములతో నలరారుచున్న ఆంధ్ర మహాభారతమును సూక్తిరత్నాకరముగ పరిగణింపనగును. ధర్మవివరణ ప్రాయములగు సూక్తులు ఇటమీద పరిశీలితములు.

## జ్ఞాపికలు

1. కావ్యాలంకారమ్
2. కావ్య ప్రకాశిక 1-2
3. కవిరాజ శిఖామణి పు- 18
4. కుమార సంభవము 1-41
5. ఆంధ్ర శబ్దచింతామణి సంజ్ఞా-1
6. ఆంధ్ర మహాభారతము ఆది-1-26
7. విరాట పర్వము 1-18
8. శబ్ద రత్నాకరము పు-80
9. కాశీఖండము 1-18
10. A Dictionary Telugu and English పు-114
11. శబ్దరత్నాకరము పు-795
12. ఆంధ్ర శబ్దరత్నాకరము-తృతీయ సం. పు-2184
13. చూడుము. మహాభారత ప్రాశస్త్యము పు-30
14. చూడుము. అందే పు-30
15. పార్థివాబ్దము 1885
16. సర్వధార్యబ్దము 1888
17. ధనాభి రామము 1-70
18. సుమతీశతకము -49
19. ఉద్యోగ పర్వము 2-13
20. చూడుము-ఈ అధ్యాయమే పు-65

# ధర్మ వివరణము

ధర్మమను పదము 'ధృఞ్' అను ధాతు జన్యమైనది [1] మరియు 'ధరతి విశ్వం ధర్మః' అనగా విశ్వమును ధరించుటచే ధర్మమగుచున్నది-ధర్మపద ప్రయోగము.

ఈ ధర్మమను శబ్దము ప్రయోగింపబడినది ఋగ్వేదమునందే-ఈ వేదము నందు ప్రయుక్తమైన ఈ శబ్దార్థమును చెప్పుట కష్టము. ఆ పిమ్మట ఈ పదము ఐతరేయ బ్రాహ్మణము నందు ప్రయుక్తము. అర్థము సరిగా నవగత మగుటలేదు. తరువాత ధర్మ శబ్దము బృహదారణ్యకోపనిషత్తు[2]లో కనబడు చున్నది. ఇందు ధర్మ సత్యముల కభేదము పాటింపబడినది. ఛాందోగ్యోపని షత్తులో ధర్మము ముప్విధముల విభక్తమైనది-[3]యజ్ఞము, అధ్యయనము, దానము మున్నగునవి ప్రథమ భాగముగను; బ్రహ్మచర్యమునాశ్రయించి గురుకుల వాసియగుటను ద్వితీయ భాగముగ ఇత్యాదిగ విభజించుటయేగాని. ధర్మమును గూర్చిన స్పష్టత అందులేదు-తైత్తిరీయోపనిషత్తులో 'సత్యంవద ధర్మంచర'[4] అని ప్రయుక్తము. వేదవ్యాస శిష్యుడగు జైమిని, చోదన లక్షణము గలది ధర్మము-'చోదనాలక్షణోఽర్థోధర్మః'[5] అని ధర్మ నిర్వచనము గావించినాడు- మనుస్మృతిలో 'వేదములే ధర్మమూలము-వేదోఖిలో ధర్మమూలం'[6] అని ఉటంకితము-

## ధర్మ లక్షణము :

ధర్మమును నిర్వచించుట ఎట్లు సులభ సాధ్యముగాదో ధర్మమును విభ జించుటయు నట్లే సులభ సాధ్యము గాదు - ఎందువలననగా ధర్మమనునది ఒక్కటియే-'ఏకోధర్మః' ధర్మము త్రికాలాతీతమై సార్వకాలికమై ఒప్పుచున్నది- ఇది సార్వదేశికము విశ్వ జనీనమై విభాజిల్లు చున్నది-ధర్మము అక్షరమై అనశ్వరమై ప్రవర్తిల్లుచుండును. ధర్మజ్ఞానము కలుగుట అతికష్టతరము. ధర్మము నాచరించుట కంటకశయన వ్రతము వంటిది. భీష్ముడు వంటి జ్ఞాన వృద్ధుడు, అంపశయ్యపై అధివసించిన బ్రహ్మచర్య దీక్షాధురంధరుడు ధర్మము ననుసరింప కలడే గాని సామాన్యులకు ధర్మాచరణము సాధ్యమైనది కాదనుటలో నెట్టి సంది యములేదు-

## ధర్మ సందేహ నివృత్తి మార్గము :

సామాన్యులకు ధర్మసందేహములు పొడముచేగాని, తన్నివారణోపాయము అతి దుర్లభము-ధర్మసంశయము కల్గినపుడు తన్నివృత్తి కొరకు వేద శాస్త్రజ్ఞులైన పదిమంది పండితులనో, లేక ముగ్గురు ధర్మపాఠ ప్రవచనము చేయు వారినో సంప్రతించవలెనని సంస్కృత భారతముద్ఘోషించుచున్నది[7] గమనించుడు-

శ్లో. 'దశవా వేద శాస్త్రజ్ఞాః-త్రయోవా ధర్మ పాఠకాః
యద్ బ్రూయుః కార్య ఉత్పన్నే-సధర్మోధర్మ సంశయే-

సంస్కృత భారతమునందే ధర్మము ముద్విధములుగా పేర్కొనబడియున్నదట[8]. 1. దేశధర్మము, 2. జాతిధర్మము, 3. కులధర్మము.

## ధర్మ శాస్త్రోత్పత్తి :

ఉత్తరాయణమునకై వేచియున్న శంతను నందనుడు ధర్మరాజునకు ఉపరిచర వసువు వృత్తాంతము వివరించుచు నిట్లు చెప్పినాడు-వ....కల్పాది యందు మరీచి, యత్రి, యంగిరసుండు, పులహుండు, పులస్త్యుండు, క్రతువు, వసిష్ఠుండనియెడు మహామునులు చిత్ర శిఖండి నామధేయులు స్వాయంభువుండను మనువుందానుననేక వర్షంబులు విష్ణునుద్దేశించి తపంబు చేసిన నద్దేవుండ దృశ్యరూపంబున వారల కెదురు నిలిచి వారితో మీరు ధర్మశాస్త్రకరణ ప్రక్షణులరై నన్నాశ్రయించితిరి, భారతి మీ యందు నిలువనియోగించితి, మీ చేతం బ్రణీతంబై సకల జగంబులకు హితంబును మర్యాదా ప్రవర్తకంబునునై శాస్త్రంబువెలుంగు నంగిరసు వలన బృహస్పతియను నొక్క మహామతి జన్మించు వానియందా సందర్భంబు ప్రతిష్ఠించునది యని యానతిచ్చి వెండియు-

తే. ఉపరిచర వసువను నొక్క నృపతి పుట్టు
నాతఁడర్థిఁ డాశాస్త్రంబు నధిగమింప
నా బృహస్పతి చెప్పంగ నధిగమించి
తత్సమాచార నాయకత్వము వహించుః

9)

ఆ ఉపరిచర వసువు బీజకారణముగ నుద్భవించినదియే, యోజనగంధి యగు సత్యవతి. సాత్యవతేయ కృత మహాభారతము ధర్మశాస్త్ర గ్రంథ మగు టలో నెట్టి విప్రతి పత్తియు నుండదు-ధర్మశాస్త్రము నధిగమించిన ఉపరిచర వసువునకు సాత్యవతేయుడైన వేదవ్యాసునకు రక్తసంబంధము, తద్ద్వార ధర్మ ప్రవచన సంబంధమేర్పడి యుండుట సమంజసముగా తోచుచున్నది.

ధర్మరక్షణము :

కృష్ణమూలమైన మహాభారతము ధర్మమును ప్రవచించు గ్రంథమగుట సత్యము-ఎందువలననగా 'యతోధర్మః తతః కృష్ణః'[10] - ఎక్కడ ధర్మ ముండునో అక్కడ కృష్ణపరమాత్మ ఉండును-ఏ గ్రంథము కృష్ణ మాహాత్మ్య మును కీర్తించుచున్నదో అందు ధర్మము అవశ్యము బోధింపబడును-ధర్మము ననుసరించి దేవకీ నందను డుండును-దేవకీ తనయు ననుసరించి ధర్మము ప్రవర్తిల్లును-ధర్మమే దేవతా స్వరూపము, ధర్మ స్వరూపమే శ్రీ మన్నారాయ ణుడు. ధర్మ రక్షణ దీక్షా ధురంధరుడు శ్రీమహావిష్ణువు-ధర్మము శాశ్వతమైనది. ధర్మమునకు హాని వాటిల్లదు. ఒకవేళ ధర్మమునకు గ్లాని జరిగిన యెడల వెను వెంటనే ఆదినారాయణుడవతరించి అధర్మమును నాశనము గావించి, ధర్మ సంస్థాపన చేయునట-

శ్లో. "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతు భారతః
అభ్యుత్థాన మధర్మ స్య తదా ఽత్మానం సృజామ్యహమ్[11]"

తాత్కాలికముగ నధర్మము ప్రవర్తిల్లి జయము గొనినట్లు భ్రాంతి కల్గించి నను, అంతిమ విజయము ధర్మమునకే. ధర్మ సంస్థాప నార్థమై యుగయుగము లందు భగవానుడు జనించు చున్నాడు. దుష్కృతుల కారణముగ ధర్మమునకు హాని కల్గినపుడు, సాధుజనులకు బాధకల్గినపుడు, ఆదిదేవుడు అవతరించి శిష్టుల రక్షించి, దుష్టుల శిక్షించి, ధర్మమును పునః ప్రతిష్ఠితము గావించునట-

శ్లో. "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థయ సంభవామి యుగే యుగే[21]"

ధర్మము నెవరు రక్షింతురో వారిని ధర్మము రక్షించును- 'ధర్మోరక్షతి రక్షితః'- అనగా ధర్మ స్వరూపుడైన భగవానుడు ధర్మమును రక్షించువారిని

రక్షించును. ధర్మమునకు చేటు కల్గినపుడు ధర్మమును రక్షించకుండ ఉపేక్షించ రాదు. దక్షుడైన వాడు ఉపేక్షించిన యెడల అది వారలకే చేటగును. కాని చివర కెట్లైనను దైవము ధర్మమును రక్షించునని కురుపాండవ సంధి కార్యమునకేగిన కృష్ణ భగవానుడు చెప్పినాడు.[13]

## ధర్మ నిర్వచనము :

ధర్మమును నిర్వచించుట సర్వసాధారణమైన పనికాదు-ఇది అత్యంత దుర్ఘటము. కష్టసాధ్యమైనది. మన భారతీయధర్మము వేదములనాధారముగ గొని నిల్చియున్నది- 'వేదో ధర్మమూలమ్' [14] అని చెప్పుటలోని ఉద్దేశమిదియే. ఏది ధర్మమను ప్రశ్నకు సమాధానము చెప్పుట చాల కష్టము. భూతదయ ధర్మము- 'ఆత్మవత్ సర్వభూతాని'యని తలంచుట ధర్మము-మనిషి తనము. మంచితనమును కల్గియుండుట మానవధర్మము- ఇతరులను కూడ తనవలె భావించి, తనకేది ఇతరుల వలన బాధకలుగునో అది తాను ఇతరులకు చేయ కుండుట మంచిది. ఇతరులేమి చేసిన తన మనమున కప్రియమగునో అద్దానిని తాను ఇతరులకు చేయకుండుటయే పరమోత్కృష్టమైన ధర్మమని భారతము బోధించు చున్నది. ఏది ధర్మమనునది ప్రతివ్యక్తి ఆత్మకు తెలియును—దుర్మార్గు డైన వానికిని ఆత్మఘోష వినపడు చుండును-సత్యము పలుకుట, న్యాయాను సరణము చేయుట, దయకలిగి యుండుట, దానక్రియలొనరించుట మున్నగున వన్నియు ధర్మము నందంతర్భూతము లగుచున్నవి-

ధర్మాచరణము కత్తిమీద సామువంటిది. ధర్మము నెరుగుటయు సుల భముకాదు. కొన్నిధర్మములు అధర్మములై తోచును, కొన్ని అధర్మములు ధర్మ ములవలె కనిపించును. స్థూల దృష్టికిట్లు గోచరించినపుడు, సూక్ష్మదృష్టితో పరిశీలించి ధర్మాధర్మ విచక్షణ జ్ఞానశీలికావలెను మానవుడు. క్షీర నీరముల వేరుచేయుట హంసకు మాత్రమే ఎట్లు వీలగునో అట్లే ధర్మాధర్మములను పరి చ్ఛేదించుట ధర్మశాస్త్ర నిష్ణాతులకే తెలియును-కావున ధర్మాధర్మ విచక్షణ చేయు టలో వ్యక్తి కడు జాగరూకుడై చరింపవలయును.

క. ధర్మ మధర్మరము భంగి న
ధర్మము ధర్మంబు మాడ్కిఁ దనయాతోఁ చున్
నిర్మల మతి నరయ వలయు
ధార్మికతను కోరువాఁడు తన కేర్పడఁ గన్ (శాంతి-3-71)

సారపు ధర్మము నెరుంగుట సామాన్యమైన విషయముగాదు. ఎక్కడ ధర్మముండునో ఆ పక్షమునకు జయము కలుగును (ద్రోణ-5-262)

ఆంధ్ర మహాభారతము నందలి ధర్మ వివరణమును గావించు సూక్తులన్నియునీ అధ్యాయము నందు శీలింప బడుచున్నవి-ఈ ప్రకరణ రచనా సౌలభ్యమునాశించి ధర్మము నీ క్రింది శీర్షికలలో వింగడించి, వివరించుట జరిగినది. చతుర్విధ పురుషార్థములగు ధర్మము, అర్థము. కామము, మోక్షము, మరియు గృహస్థ ధర్మము, లోకధర్మము, రాజధర్మము. యుద్ధధర్మము అను శీర్షికలందు పరిశీలించుట జరుగు చున్నది.

ధర్మార్థ కామములు :

ధర్మార్థ కామములందు రెంటినో, మూడిటినో కలిపి ముచ్చటించు పద్యములు గలవు. కామము నందే తగిలియుండ దగదు. అట్లు తగిలినవాడు అధముడు. మూడిటిలో నొకదానిని వర్జించినవాడు మధ్యముడు. మరి మూడిటిని నడుపువాడు ఉత్తముడు-

తే. అనఘ ధర్మార్థ కామంబులందు నొకట
నర్థిఁ దగిలిన మానవుండధముఁ డొకటి
మాని వర్తించు నాతఁడు మధ్యముండు
నడుపు నన్నింటి నుత్తమ నాయకుండు (శాంతి-1-461)

కొన్ని కర్మములు మొదట ధర్మువులట్లు యుండును. బోధను లరయంగ వచ్చిన నవి అధర్మములై చనును-మరికొన్ని కర్మములు మొదట అధర్మములవలె కనిపించును-కాని పరిశీలించి చూచిన నవి ధర్మువులై ప్రవర్తిల్లునట (ఉద్యోగ-1-134). ధర్మార్థ కామముల మూడిటిని సమానముగ రక్షించి పోషించుట అతికష్టము. మానవుడు నిమిత్తకారణముగ జన్మించిన అలుకను కూడ తప్పించి శాంతుడు కావచ్చునేమో గాని పై మూడిటిని రక్షించుట అరుదు-

క. అలయక నిమిత్త జంబగు
నలుకను క్షమియించి శాంతుఁడగు పురుషుండి
మ్ముల రక్షింపఁగ నోపు నె
పొలుపుగ ధర్మార్థ కామములు నమములుగాన్ (ఆది-7-144)

ధర్మార్థ కామములు ఒకదాని నొకటి నాశనము గావింపకుండ చూడ వలెను. ధర్మము వదలి అర్థకామములను కోరరాదు-అట్లు కోరిన మానవునకు నింద తప్పదు. కావున ధర్మము అవశ్యము అనుసరణీయమగుచున్నది-

తే. ఓపి ధర్మార్థ కామంబులొకటి నొకటి
నాశ మొందింప కుండంగ నడప వలయుఁ
గాక ధర్మంబు నెడ నర్థ కామములనుఁ
గోరు పురుషుండు నిందకుఁ గుదురు గాఁడె (శల్య-2-102)

ధర్మకామములు తలుగగ అర్థార్థి యగువాడు పతితుడగును-అర్థ సేవ చేయువాడు భయంకరాటవిలో గోరక్షణ చేయదలచు కుమతిని పోలువాడు. అర్థ ధర్మములను మరచి కామార్థి యగువాడు హానిపొందును-అల్ప జలాశయములో నున్న జలచరములెట్లు ఆ జలములతో నాశనమగునో అట్లే కామార్థి నాశన మగును. అర్థధర్మములు రెండు మహాసాగరము మేఘముల వంటివి. ఈ ఉత యమును పరస్పరోదయములు. ఈ విషయ మెరిగి త్రివర్గమును సామ్య భావ మున సేవించువాడు సర్వ విత్తముడని భారతము ఉటంకించుచున్నది. (అరణ్య-1-245).

ధర్మ కారణమున దనములభించును-ధనకారణముగ కామము లభ్య మగును. అందువలన ధనము-మధ్యమము. కామము అధమము ఆగుచున్నవి. ఈ మూడిటిలో కడు నుత్తమము ధర్మము-కావున ధర్మమునే అనుసరింపవలయు ననుట పిండితార్థము-

క. విను ధర్మంబున ధనమగు
ధనమున సిద్ధించుఁ గామ తంత్రంబటు గా
వున మధ్యమంబు నధమము
ధన కామము లుత్తమంబు ధర్మం బధిపా (శాంతి-1-453)

ఇక ధర్మార్థ కామముల నొండొంటిని ప్రత్యేకముగా పరిశీలించుట ప్రస్తుత కర్తవ్యము.

**ధర్మము :**

ధర్మజ్ఞు డెట్టివాడో భారతము చెప్పుచున్నది. తనపై ఎవరైన కోపించిన యెడల తాను కోపము చెందరాదు-తన్ను ఎగ్గులం పల్కినను వినని యట్లుండి, ప్రతి వచనముల పలుకరాదు. కష్టముల ప్రాప్తించినపుడు వానిని హృదయము నందిడక మరచిపోగల ధీమంతుడే ధర్మము నెరిగిన వాడట.

క. అలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి వినని యట్ల ప్రతివచనంబుల్
పలుకక టన్నము వడియెడఁ
దలఁపక యున్న తఁడ చూవె ధర్మజ్ఞుఁడిలన్ (ఆది-3-147)

ఎన్ని ఆపదలు సంభవించినను ధర్మమును మాత్రము రక్షింపవలయు నట. ధర్మమునకు అపాయము కల్గుటను గాంచి ఉపేక్షించరాదు. ఎందువలననగా ఆ ధర్మాపాయము జన్మాంతర మందును జీవికి అనుగతమగును-కావున ధర్మ రక్షణము అవశ్యము కర్తవ్యము.

క. ఆపదయయినను ధర్మువ
ప్రాపుగ రక్షింప వలయుఁ బరమార్థము ధ
ర్మాపాయము ధార్మికులను
నాపద జన్మాంతరమున ననుగత మగుటన్ (ఆది-7-221)

పరదార సంగ్రహము ప్రమాదమును ఘటించును-ఇది త్రికాలవేదితమైన సత్యము. విశ్వజనీనమైన పరమ సత్యము. రావణకీచకాదులకేమైనదో అందరకు తెలియును. అట్లే పరదార గమనము మహాపాపము.[16] పరసతీ సంగమ కారణముగ ఆయురైశ్వర్యములు క్షీణించును. ధర్మమార్గమున సంచరించువారు పరదార గమనమును పరిహరింతురనని సుదేష్ణ కీచకుని కిట్లు చెప్పుచున్నది-మూర్ఖుడగువాడు పథ్యమగు పలుకును పరిహరించును గదా!

తే. ఆయురైశ్వర్య కీర్తులనపహరించు
పరసతీ సంగమము ధర్మపథము నందుఁ
బరఁగు వారలు పరిహరింపఁగ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వివేక మగుట (విరాట-2-69)

విబుధుడైన వాడు పాత భీతివి గల్గియుండును పాపము చెంతకు బోవ డడు- నిర్మదుడు. నిరహంక్రియాత్ముడై, మాత్సర్యరహితుడై సంచరించు చుండును-ధర్మమార్గమునే అనుసరించు చుండును- ధర్మము యొక్క తీపి కొని యాడదగినది. ఆ ధర్మము తీపి నేఁగినవాడు సత్క్రియలు ఒనరించు చుండును. రుచి నెరింగిన పిదప మరల మరలధర్మములనే చేయుచుండును. (అరణ్య-5-76) ధర్మము నెట్లెరుగ వచ్చును? అను ప్రశ్న ఉదయింపవచ్చును. దానికిని సమాధాన మిందు గలదు-జ్ఞానుల చరితలు పఠింప వలయున-సజ్జనుల గోష్ఠిలో పాల్గొన వలయును. సజ్జనుల సాంగత్యము తేనెవలె తీపిగా నుండును- కన్నడ భాష లోని సామెతను పరికించుడు- 'సజ్జన సాంగత్య హెజ్జేను సవిదంతె'- సజ్జనుల సాంగత్యము తేనెవంటి చవి గలది—ఆ గోష్ఠిలో ధర్మము నెరుగ వచ్చును- ఎరిగిన దానిని తప్పక అనుష్ఠింప వలెను- విని పురాణ వైరాగ్యము మాత్రమే ఉన్న ప్రయోజనము శూన్యము-

క. ఎఱుక గలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన దానిని
మఱవకనుష్ఠించునది సమంచిత బుద్ధిన్ (ఆది-3-203)

ధర్మము ననుసరించి వారి శీలము కొనియాడదగినది. త్రికరణ శుద్ధిగా ధర్మము ఆచరణీయము. ఏదిధర్మము? మనోవాక్కాయ కర్మలందు ద్రోహ భావముండరాదు. అంతేకాదు సకల భూతములందు దయకలిగియుండ వలెను. 'ఆత్మవత్ సర్వభూతాని' అని సంభావించుటయే పరమ ధర్మము. ధర్మశీలి ఆ భావమునందే మనసునులగించును. దానశ్రేయస్సవగా శుభము కల్గును,

క. ఒలసి మనో వాక్కాయం
బుల ద్రోహాభావ మఖిల భూతముల యెడం
గలిమి విను శీల మది మే
లొల యించునుదాన నుల్ల మూన్పుము పుత్రా (శాంతి-7-147)

మాంసాహారము మానవునకు కీడు కల్గించును. మనసు నందు, వాక్కు-
నందు, కాయము నందు, మాంసము తినుటతో నాలుగు హింసలగు చున్నవి.
మాంస భక్షణము వలన జీవులకు హింస వాటిల్లును- 'అహింసో పరమోధర్మః
ధర్మములలో కెల్ల పరమధర్మము-అహింసను పాటించుట. కావున మాంస భక్ష
ణము కీడు (అను-4-286). మాంస భక్షణము మానుట ఉత్తమము. అది
అశ్వమేధ యాగము కంటెను పూజనీయమైనది. జీవిని చంపుటగాని, చంపించుట
గాని కల్మషములకెల్ల వగ్గలము (అను-4-290). తను నమలిన వాని నమలనని
మాంసము రీతిని ఆగమములు చెప్పుచున్నవట-మాంస భక్షణము మానిన మానవు
నకు తపము చేసినంత ఫలము ప్రాప్తించును (అను-4-292). మాంసాహార
భోజనము మనసును, బుద్ధిని మందగింప జేయుననియు, నా అహారము కంటె
శాకాహారమే మేలని ఆధునిక విజ్ఞానము చెప్పుచుండుట మనందరము ఎరిగి
నదియే. కాని మాంసము రుచి మరి ఏ ఇతర పదార్ధమునకు నుండదు. మిగిలిన
ఏ రుచులు మాంసమున్కరుచిని పోలవు. ఆ రుచినెరింగిన మానవుడద్దానిని త్యజిం
చుట అతి కష్టము. ధీర చిత్తముతో దీక్షతో మాంసాహారమును మానువానిని
దేవ సమానునిగ ధర్మవిదిజ్ఞులు కీర్తించు చున్నారు,

క. జనవర మాంసము చవిఁ గఁడ
చిన చవులరయంగ లేమిఁ జేసి చవియెఱిం
గిన వాఁడది యుడిగిన నా
తని దేవ సమానుఁ డండ్రుధర్మ విధిజ్ఞుల్ (అను- -493)

వేద పురాణ కాలమున మాంసాహారమును భుజించుచున్న బ్రాహ్మణులు
తర్వాతి కాలమున మాంస భక్షణము విసర్జించిరి. నేటికిని సద్బ్రాహ్మణులు కేవ
లము శాకాహారులగుటకు కారణమిదియే కాబోలు!

తనకుల ధర్మమాచరించుట పరమధర్మమని ధర్మవ్యాధుడు కౌశికుడను బ్రాహ్మణునకు చెప్పినాడు. చాతుర్వర్ణములకు తమ తమ కులాచారము లెట్టివో-అట్టిదే తనకు తన కులాచారమని చెప్పినాడు-లుబ్ధకులైన వారికి మృగయోపజీవనంబు పరమధర్మము(అరణ్య-5-3[illegible]). ధర్మవ్యాధుడు జీవహింస నెన్నడు నాచరించదట- ఒరులు చంపి తెచ్చిన మాంసమును విలిచి. తాను తగిన వెల కమ్మి, బ్రదుకుటయే తనకాచారము(అరణ్య-5-[illegible]). చిత్తము నందు దయ కల్గుట ఉత్తమము, మరియు అఖిలమునందు సైరణ అనగా ఓర్పు, క్షమ కావలయునట-

క. తన కుల ధర్మము విడువక
మనుట పరమధర్మమండ్రు మాన్యులు; చిత్తం
బునఁ గృప గలుగుట ముఖ్య పుఁ
బని; సైరణ వలయు నఖిల భావములందున్ (అరణ్య-5-37)

ధర్మానుసరణము వలన ప్రయోజన మెట్టిది? అను ప్రశ్న కల్గవచ్చును. ధర్మము ననుసరించు వారు స్వర్గమునకు పోదురు సర్వమానవులకు ధర్మాచరణమే స్వర్గారోహణ సోపానము. స్వర్గముపైన విశ్వాసమున్న ప్రజలు ప్రవర్తిల్లవలసినది ధర్మమార్గమునందే-స్వర్గ ప్రాప్తికి రమ్యమైన మార్గము ధర్మాచరణ మార్గమే-

క. ధీరమతి యుక్తిఁ జేసి వి
చారింపఁగ నిక్కువంబు సర్వజన స్వ
ర్గారోహణ సోపానం
బారఁగ ధర్మంబు చూవె యతి రమ్యంబై (అరణ్య-1-119)

ధర్మాచరణము నవలంబించువాడు పరమ ధార్మికుడు. ధర్మాచరణ మనగా నేమి? క్రోధ లోభములు కలిగియుండుట పాతకములలో నెల్ల మహాపాతకమట. అరిషడ్వర్గము అవశ్యము పరిత్యాజ్యము. ఆ అరిషడ్వర్గమునందు క్రోధ లోభములు మరికొంత ఎక్కువ చెడ్డవి-ఈ రెండిటిని జయించుట సామాన్యముగాదు-పరమ శిష్టా గరిష్ఠులైన వారికే సాధ్యము-ఈ రెంటిని జయించిన వానిని పరమ ధార్మికునిగ పరిగణించుచున్నారు-

తే. పాపముల కెల్ల నెక్కుడు పాతకములు
క్రుద్ధు క్రోధలోభంబులు; సువ్రతాత్మ
వాని రెంటి జయించిన వాఁడు గాని
యెందుఁబరమ ధార్మికుఁడని యెన్నఁబడఁడు (అరణ్య-5-42)

రెండు పనులాచరించిన వాడు ఉత్తమ మానవుడట-1. పరుషవాక్యములు పలుకరాదు, 2. దుష్ట కార్యములు చేయరాదు. భూరిగుణోన్నతులగు వారికి వాక్పారుష్యము పనికిరాదు. వాక్పారుష్యము విషయముకంటెను, దహనము కంటెను మహాదారుణము (ఆది-సభా-2-17). మన వాక్పారుష్యము వలన ఇతరుల మనసు నొచ్చును. ఇతరుల మనసు నొప్పింపరాదు, అన్యుల మనసుల నొప్పింపక, తానొవ్వక తప్పించుకొని ఎవడు తిరుగ గలడో వాడే ధన్యుడు.[17] దుష్కృతముల నాచరింపక పోవుటయే ధర్మము-

క. పురుషుఁడు రెండు తెఱఁగుల
ధర నుత్తముఁడనఁగఁ బరఁగుదానెయ్యెడలం
బరుసములు పలుక కునికిన్
దురితంబులు వొరయు పనులు తొఱఁగుటకతనన్

(ఉద్యోగ-2-41)

ధర్మమార్గము తెలిసినది. ఇక అర్థము నెరుగవలసి యున్నది-

అర్థము :

వ్యక్తి జీవనమునకు ధనమవసరము. ధనములేనిదే నిత్య జీవితము సాగదు. ధనముపైన ఈ లోకము ఆధారపడియున్నది. భారతము 'అర్థంబు సువ్వె ధర్మకారి' అని చెప్పుచున్నది-సంపద లేనివాడు వడ పేనుగుతో సమానము (శాంతి-1-19). అర్థధర్మములు రెండు పరస్పరాశ్రయములు. కావున మానవుడు వానిలో నొకదాని మాదును (శాంతి-1-456). అర్థ కారణముగ సకల భోగము లనుభవింపనగును. భోగించుచున్నపుడే ఉన్నత మానవుడది అస్థిరమని భావించును. అట్లు తలంపనివాడు ధనము పోయినపుడు దుఃఖ భాజనుడగుచున్నాడు. సంపదలు అతి క్షణికములని ఎరిగినవాడు అదిపోయినను చింతింపడు (శాంతి-3-27)-అర్థము వలన పెక్కు అనర్థములు సంభవించును. అర్థము మాయా

విమోహనమావహిల్లచేయును. అర్థార్జన పైనున్న ఆశచే దుఃఖము కల్గును- దుఃఖముచే విహిత కర్మల నాచరింప జాలడు-

క. అర్థము యనర్థ మూలం
బర్థమ మాయా విమోహనావహము నరుం
డర్థార్జన దుఃఖమున న
పార్థీ కృత కర్ముఁడగుట పరమార్థమిలన్ (అరణ్య-1-28)

అర్థార్జన కంటె ధర్మార్జనము కడు నుత్తమము ధర్మకారణముగ సకల సిద్ధులు కరతలామలకము. అనశ్వరమైన కీర్తి లభించును-సద్గతిని పొంద వచ్చును-కావున అర్థము కంటె ధర్మము గొప్పది (శాంతి-2-408)-అర్థ సిద్ధి వలన ప్రయోజనము భోగములను భవించుటయే కాదు. అర్థప్రాప్తిలేని వారికది ఈయవగును. అర్థులకు నర్థమునిచ్చు మానవుడు నిఖిల జగములందును దుర్ల భుడు. కష్టార్జనమైన సంపదను పంచియిచ్చువారు లోకమున చాల అరుదు-తాము కోరిన అర్థమును ఇతర ధనవంతుల నుండి సంగ్రహించిన వారును అరుదే-

క. అర్థా ర్థులగు ఫలంబులు
ప్రార్థించిన చోట సిగ్గు పఱుకక తగ న
య్యర్థి సుల కార్థుఁ జేయు కృ
తార్థుడు దుర్లభుఁడు తలఁప నఖిల జగములన్ (శాంతి-1-162)

గుణోత్కృష్టుడైన మహోదయుడు కూడ రాగకోపమాయలబడుచున్నాడు- క్షమాగుణము కోల్పోవుచున్నాడు-అచిరాంశు లతా విలాస చంచలమగు లక్ష్మికావ పడుచున్నాడు-అంతేకాదు తద్ద్వార సత్యము, ధర్మము తప్పుచున్నాడు-నత్సభా వలి ప్రవేశించి తగువారి యొద్ద తగువాడై సంచరించలేక పోవుచున్నాడు-కావున అర్థాశ మిక్కుటిగా నుండరాదు. (అరణ్య-1-259). 'అర్థాతురాణాం నగురుర్న బంధుః' అన్నారు.

జూద వ్యసనము సప్తవ్యసనములలో నొకటి-జూదమాడరాదు-జూద వ్యసనమున జిగిలినవాడు ధర్మమార్గమును తప్పును-కష్టసాధ్యమైన సంపదలతి క్షణికములై జూదమున పోగొట్టుకొనుచున్నాడు-అందువలన జూదమాడఁగరాదు

సుమ్మ. జూదమునందు చలమతిశయిల్లును. మాత్సర్యము పెచ్చు పెరుగును- వివేకము కోల్పోవును. వివేకహీనునకైన సంపదలు సుచిరములుకావు-కుత్సిత కితవులతోడ జూదమెట్టి పరిస్థితులలోను నాడరాదు-

ఆ. కుటిల మార్గు లయిన కుత్సిత కితవుల
తోడఁ గడఁగి జూద మాడఁ జనదు
దానఁ జేసి యర్థ ధర్మ వివర్జితు
లగుదు రెట్టి వారు జగములోన (సభా-2-167)

పురుషార్థములందు ధర్మమధికమని చెప్పిన భారతమే, సందర్భానుసార ముగ నర్థమును కొనియాడుచున్నది. ధర్మార్థములు రెండును సమానములు, అర్థ సహితునకు కామ తంత్రము ఫలించును. కాబట్టి అర్థము కొనియాడ తగినదని చెప్పుచున్నాడు-

క. తమలో సరి ధర్మము న
ర్థము నర్థంబునకుఁగామ తంత్రము ఫల రూ
పము కావున నప్పురుషా
ర్థమునుం గొని యాడవలయు ధరణీ నాథా (శాంతి-3-457)

గర్వము పెక్కు రకములు-విద్యా గర్వము, ధనగర్వము, రూపగర్వము, గుణగర్వము, అభిజాత్య గర్వము, కుల గర్వము మున్నగు రీతుల నుండును, గర్వమును వర్జించిన వానికే వినయమబ్బును. ధనము-దుర్మతులైన వారికి ధన మదాంధత కల్గించును, సుమతులైన వారికి వినయమును ప్రాప్తింపచేయును, ధనగర్వము పనికిరాదు. ధనమును సంపాదించిన పిమ్మట గర్వపడరాదు. ధన వంతుల ఇంట జన్మించినందుకు గర్వము పలదు-
ధనవంతుల కడకువ ఉత్తమ గుణము-

క. ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైన వారి కడఁకువ
యును వినయము నివియు తెచ్చు నుర్వీనాథా (ఉద్యోగ-?-15)

అధిక ధన వత్త్వము అతి దుఃఖకరము. కాన ఆకాంక్షను సజ్జను డుజ్జగించును. ధనకాంక్ష లేకున్న ఆత్మాధీనత్వము ప్రాప్తించును-దీని కారణముగ శాశ్వత సౌఖ్యము మానవునకు లభించును-సుఖనిద్ర సేకూరును. చోర భయముండదు. కాన ధనము దుఃఖభాజనమని తెలిసికొనుము-

క. ధనవత్త్వము దుఃఖకరం
బని కని తత్కాంక్ష విడుచు నతని కధనతా
జని తాత్మా ధీనత్వం
బనుపమ సౌఖ్యంబు చేయు నక్షీణముగన్ (శాంతి-4-18)

కామము :

కామమనగా కోరికయను నర్థమును గలదు-పురుషార్థములలోని కామము ఈ కామమున కంటె భిన్నము ఆశమానవుని జీవింప చేయును, ముందునకు నడిపించును. ఆశ అవసరమేకాని దురాశపనికి రాదు-పురుషార్థములలోని కామమును పరిశీలించుటకు ముందు ఈ కామమును ఇంచుక పరికింతము. కామమే తృష్ణ. తృష్ణ సర్వదోషములకు నిలయము, దురితములను చేయించునది కూడ తృష్ణయే. ఇది దుఃఖప్రదము కావున సుమతులు తృష్ణను చంపుకొందురు-కుమతులు తృష్ణలో మునిగి తేలియాడుదురు-

క. అది సర్వ దోషముల కా
స్పదమది దురిత క్రియాను బంధంబులకున్
మొదలు నిరంతర దుఃఖ
ప్రదమని మదిఁ దలఁచి తృష్ణఁ బాతురు సుమతుల్
(అరణ్య-1-25)

జితేంద్రియుడైన వానికిని ఆశ దుర్గతినిచ్చును. ఆశ వినాశకారి విరాశయుడు సౌఖ్యమునను భవించును. కాన ఆశ పరిత్యక్తము-

క. ఆశయ యింద్రియ జయము వి
నాశముఁ బొందించుఁ గావునం దొఱఁగెద నే
నాశను సౌఖ్యము నిచ్చు ని
రాశయ యని పలికి యట్టిదై నిద్రించెన్ (శాంతి-4-19)

కామ, క్రోధ, భయ, నిద్ర, లోభముననునైదు చాల నిందితములు. యోగి జనులైన వారీ ఐదింటిని అవలమైన దీక్షతో నుడుగవలయును (శాంతి-5-115) ఇక కామమును గమనింతము,

కాము మాయల చిక్కు-కొనని వారెవరు? కాము శక్తి నుడిగించుట దేవత లకే సాధ్యము కానపుడు సామాన్యమానవుల సంగతి చెప్పనేల? ఇంతుల గోష్ఠిలో నున్నవాడు వివేక వర్జితుడగుచున్నాడు, అత్యంత మదాభిభూతుడగు చున్నాడు-ధర్మమును దప్పుచున్నాడు-ప్రియమును తెలిసికొనలేక పోవుచున్నాడు. వివేకియైన చిత్రరథుడను గంధర్వుడు ఇంతుల గోష్ఠి నుండి ఎదిరిని తన్నెరు గక అర్జుననిపై కత్తి దూసినాడు-కదన రంగమున నోడి నపుడు వివేకముతో ఇట్లు చెప్పినాడు— 'కాముశక్తి యుడివింపఁగ శక్యమె వారికిన్' (ఆది-7-59) ఇంతులయొద్ద నున్న మానవుడే కాదు పశుపక్ష్యాదులు అట్లే ఎదిరిని తన్నెరుగక ప్రవర్తించును-ఆవులదగ్గర నున్న ఆబోతు పెద్ద ఆబోతుతో తలపడుటను గమ నించు చున్నాము-మరియు కోడి పెట్టల దగ్గర నున్న చిన్న కోడిపుంజు తనపైకి వచ్చిన పెద్ద కోడిపుంజుతో పోరాడ ప్రయత్నించుట పరికించు చునే యున్నాము గదా! కన్నెల గోష్ఠిలోను నున్నపుడే గదా ఉత్తరకుమారుడు ప్రజ్ఞలు పలికినది. అది జీవుల సహజ లక్షణము. ఇంతుల నిమిత్త కారణముగ ధృతిమంతులకును భేదము వాటిల్లును (ఆది-8-114). ఇంతులపై నున్న కామ కారణముగనే సుందోప సుందులు అన్యోన్య హతులై మడిసినది. కావుననే కాము మాయల వెవ్వారున్నేమిగారన్నారు-

పరమ శాంతులైనవారు, జితేంద్రియులైన మానవోన్నతులు సతుల గోష్ఠి నున్నపుడు చలనమొందుదురు. కాము శక్తిని ప్రజలు జయింపనేరు-

ఆ. ఎంత శాంతులయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁగడు వివిక్తమయిన చోట
సతుల గోష్ఠిఁ జిత్త చలన మొందుదు రెందుఁ
గాము శక్తి నోర్వఁగలరె జనులు (ఆది-3-38)

కామాతురుడైన వానిక నిద్రరాదు. మరియు భయముగాని సిగ్గుగాని మృగ్యము- 'కామాతురాణాం నభయం నలజ్జా' అన్నదందుకే-

సత్త్వగుణ చింతచే నిద్రా మోహమును. ప్రాజ్ఞత్వముచే లోభగుణమును. శమవ్యాప్తిచే క్రోధమును దృఢ స్వాంతుడగు వాడెట్లు అడంచు చున్నాడో అట్లే పండితుడగు వాడు కామమును వర్జించు చున్నాడు (శాంతి-5-116). కామ క్రోధముల రెండిటిని మానవోత్తముడు త్యజించు చున్నాడు. ఈ రెంటిని జయించిన వానికి క్షేమము ఉపలభ్యమానము-ప్రతివ్యక్తి జాగరూకుడై సంచరించుచు కామక్రోధములను ఏమరకుండ వలయును-

క. కామంబును గ్రోధంబును
నేమఱక జయింప వలయు నెల్ల విధములన్
ధీమహిత యిదియ సతత
క్షేమంకరమైన పథము కృత బుద్ధులకున్ (అరణ్య-5-109)

కామము, క్రోధముచే మనసు గాడగ బొరుట మాన్పవలయును.ఇంద్రియ మార్గ వర్తనమును త్రుంచవలెను-నెచ్చగ పొందరాదు-తన్నుతానెల్లపుడు రక్షించుకొనవలెను- ఎవ్వరినైన నిందుక మాత్రము నొంపరాదు- ఇట్లు ప్రవర్తించు వానికి సర్వ మహిమాతిశయమును ప్రాప్తించును. కామక్రోధాదులైన మానస వికృతుల నుడిపి, ఆత్మారాముడై తన్నుతాను వెదకుట శ్రేష్ఠ తరము-

క. కామ క్రోధాద్యములగు
నీ మానస వికృతులుడిపి యేకాంత గుహా
రాముఁడవై నిను వెదకుట
సూమేలొండెల్ల నుడుగు సులభవివేకా (శాంతి-4-30)

కామమున్నను నిజ భార్యాలోలుడై క్రీడించవలయును- 'స్వభార్యాయాంచ యౌవనమ్' అన్న ఆర్యోక్తి వినమే? కామమతిగా నుంతాడు- 'ప్రజాయై గృహా మేధినామ్'[18] అని చెప్పినదీ ఉద్దేశముతోనే- పరస్త్రీ కాంక్ష పరిహరణీయము- పరసతీ సంగమమున పాపము ప్రాప్తించుటయే కాదు కామ సుఖమును లభించదు-

సీ. పతి యెఱింగినఁ దన ప్రాణంబుపై వచ్చు
నను భయంబున నుల్ల మదరు చుండ
జనులు గాంచిన మానుషము దూలుఁదనకను
పుయిలోటమున మోము పుల్ల గిలఁగ
బోఁటికిఁ దోఁచినఁ బొలియుఁ దేఁకువ యను
వెగడునఁ జెయ్వులు వీడుపడఁగ
బంధుల కగపడ్డఁ బాయు నన్వయమను
కలఁకమైఁ జెమటలు క్రమ్ముదేరఁ

తే. గ్రీడ దెసఁ గౌతుకంబురియాడ రతుల
చవులు గొనియాడ నేరని జార పొందు
హృదయమున కింపుచేయమి నెఱుక గలుగు
వారు దీని సుఖంబుగాఁ గోరరెందు (విరాట-2-70)

అని సుదేష్ణ నిజ సోదరుడగు కీచకునికి బోధింపనది- కామాతురుడైన ఆ పురుషునకుగాని, జారతనమునకు ఇయ్యకొనిన ఆ జారిణికి గాని కామ సుఖము లభించదు తనపతికి తెలిసిన ప్రాణాంతకమని జారిణికి భయము, ప్రజలకు తెలిసి పోవునని, స్నేహితులకు తెలిసిన మర్యాద పోవునని. బంధువులకగపడ్డ ప్రమాదమని తలంచుటచే కామక్రీడపై కుతూహలము నగము చచ్చిపోవు చుండగా నగు రతి హృదయమున కింపుగాదట. ఎఱుక కలవారు అనగా జ్ఞానవంతులెవరును ఇట్టి సుఖమును కాంక్షింపరు.

మోక్షము :

ధర్మార్థ కామములను క్రమము దప్పక సందర్భానుసారముగ నెవరు ప్రవర్తింతురో వారికి మోక్షప్రాప్తి లభించును. క్రోధము పాపము. క్రోధ కారణముగ ధర్మకామార్థ హాని కలుగును [అరణ్య-1-222]. అరిషడ్వర్గములైన కామక్రోధ మోహలోభమద మాత్సర్యములను వర్జించనవానికే మోక్షము సులభ సాధ్యము. అరిషడ్వర్గమును గురించి పెక్కు సూక్తులు భారతమువందు గలవు. గ్రంథ విస్తర భీతిచే అరిషడ్వర్గముల జోలికి పోవుట లేదు-ధర్మార్థ కామములు

మూడును మనము కీలు కొనక పొరపొచ్చెములై చనినపుడును, సుఖమునందు మదమును, దుఃఖమునందు దైన్యము నొందని వానికి మోక్షకరమగును.

క. మనమున ధర్మము నర్థం
బును గామముఁగీలు కొనక పొరపొచ్చెములై
చన సుఖదుఃఖంబుల మద
మును దైన్యముఁ బొందకునికి మోక్షకరమగున్

[శాంతి-3-466]

ఎల్ల సంగములు విడిచి నియతి గల్గు సన్యాసికి మోక్షము ప్రాప్తించును [అను-5-43].

గృహస్థ ధర్మము :

గార్హస్థ్య ధర్మములు కొన్ని కలవు. జనని-జనకుడు, భార్య-భర్త పుత్రిక-పుత్రుడు గృహస్థ జీవితమునందు ప్రధానులు-వీరు ఆచరింపవలసిన విధులు, ధర్మములున్నవి. పరస్పరము ఒకరియెడల మరియొకరు కొన్ని సామాన్య ధర్మములను పాటించవలెను.

'అభ్యాగత స్స్వయం విష్ణు' వనుట ఆర్యసంప్రదాయము. అతిథి జనుల నాదరించుట గృహపతికి, గృహిణికి ధర్మము. అతిథుల వాంఛితములను తీర్చిన వారికి పుణ్యము కల్గును.

క. అతిథి జనులు తమతమ వాం
ఛితము లనుభవించునట్లు చేయంగనినం
గృత కృత్యతఁ బొందరె గృహ
పతియును గృహిణియును ధర్మభారము వలనన్

[అను-1-67]

గృహస్థుడైనవాడు తన జననిని, జనకుని, గురుని, అనలుని, ఆత్మజుని అను నేవురిని సమ్మానింప వలెను. ఎవరు పై వారిని మన్నింతురో వారే ఈ లోకమునందు ధర్మాత్ములగుచున్నారు [అరణ్య-5-18]. బ్రహ్మచార్య వాన

బ్రహ్మచర్యాశ్రమాదులకంటె గృహస్థాశ్రమము కడుమిన్న. ఆ మూడు ఆశ్రమము లను-గృహస్థాశ్రమమును తులనిడగా నా మూడిటిలో నిది యొక్కటి సరితూగిన దని ధర్మాత్ములు చెప్పుచున్నారు-

క. తక్కిన మూఁడాశ్రమములు
నొక్కెడ, గృహస్థ ధర్మమొక చెనఁదులయం
దెక్కింప వానితోన
యొక్కటి సరిఁదూఁగెనందు రుర్వీశ బుధుల్

[శాంతి-1-76]

పురుషుడు ధర్మశీలుడై, బలవంతుడైన రాజుఁ పాపుకలిగి, నిజదారసుతో దరముల నర్ధయుక్తితో పోషించి, ఊళ్లయందు నివసించుచున్నచోనది గృహస్థ వృత్తియగును. అట్లు కానపుడెందులకు గృహస్థ జీవితము? కానలకేగి ఉండుట తగదా? [ఆది-6-270].

గార్హస్థ్య జీవిత సుఖమునకు పురుషునకు భార్య ముఖ్యము. భార్య లేని నాడు పురుషుడు జీవచ్ఛవమే-భర్తలేని భార్య ఎంత పతివ్రత యయ్యును జగము చేత బ్రయ్యబడును. పురుషుకంటె మున్ను పరలోకము ఏగుట సతికి నోచిన ఫలము [ఆది-6-256]. అనుకూలవతియగు సతి లభించుట అందరకు కుదరదు. పుణ్యవంతులకే అది ప్రాప్తించును-అనుగుణ సతివలన పురుషునకెన్ని లాభ ములు కలుగునో!

క. సంతత గృహమేధి ఫలం
బంతయుఁ బడయంగ నోపు ననుగుణ భార్యా
వంతుఁడగు వాఁడు క్రియా
వంతుఁడు దాంతుండుఁ బుత్త్రి వంతుండు నగున్

[ఆది-4-83]

భార్య ధర్మార్థ కామ సాధనకుపకరణము వంటిది. అన్వయ స్థితికి మూల మైనది. సద్గతి లభించుటకు ఊత. హృదయ సంతోషజనకమైనది-భార్య. భార్య కంటె భర్తకు ప్రియమైనవి ఈ లోకమున లేవు. ఎటువంటి అపదలు కూడ ఏ సందర్భము నందైనను భార్యవలన తీరిపోవును. గృహనీతి విద్యకు భారతి

గృహము. భార్యయే విమల చారిత్ర శిక్షకు ఆచార్యకము. 'గృహిణీ గృహ ముచ్యతే' అనుట ఆర్యోక్తి. తన భర్తయందుగల దోషపుంజము నెరిగి సహించు నట్టి భార్య దేహాంతరము నందైనను భర్తయంద భీష్టములు పొందునట-

క. పురుషునందు దోషపుంజంబు గలిగిన
నెఱిఁగి యెద సహించునేని భార్య
పురుషునంద భీష్ట భోగంబు దేహాంత
రంబునందు ధర్మరతియుఁ బడయు [అరణ్య-2-160]

లోకమున గల ప్రతి మహాపురుషునకు వెనుక ఒక స్త్రీ ఉండును. ఆమె ఆ పురుషునకు తల్లి కావచ్చును, భార్య కావచ్చును, పుత్రిక కావచ్చును లేక చివరికి సోదరియైనను కావచ్చును. ఆ వ్యక్తి అంత మహోన్నతుడగుటకు కారణము పై పేర్కొనిన స్త్రీలలో నెవరైనను కావచ్చును.

భర్తకు భార్య వెన్నెముక వంటిది- భార్య భర్తకు శుశ్రూషచేసి సంతత పుణ్యఫలము నొందును.

ఆ. కరము దుఃఖపడినఁగాని యొక్కింత సౌ
ఖ్యంబు ధర్మగతియుఁ గలుగ దెందుఁ
జూడు మబల భర్తృ శుశ్రూష ఫలము సం
తత శుభంబు గలదు, ధర్మవాదవు [అరణ్య 5-315]

పురుషునకు జనని అమృత సమానము. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి'. జన్మభూమి సంగతి ఎట్లున్నను జనని మాత్రము స్వర్గముకంటె కడు ఎక్కువ. జనని నిధికంటె కరము గొప్ప.

క. కలవాఁడు లేనివాఁడు న
బలుఁడు, మూఢబుద్ధి, ప్రౌఢుండనఁగా
వల దెవ్వరికైన జనని
కలిమియ యత్యంత సౌఖ్యకరమై యుండున్.

[శాంతి - 5 - 278]

జనని తర్వాతయే జనకుడు, తనయునిపై జనకునకు స్వామిత్వముకలదు. ఆ స్వామిత్వము తనయునిపై జననికి కూడ నుండును. అందువల్ల తండ్రివలెనే తల్లి కూడ తనయుని తన కార్యనిర్వహణార్థము నియోగింపవచ్చును. [ఆది 4-142]. జనకుడు ప్రత్యక్ష దైవము. జనకుని ప్రీతునిగా చేయుటచే దేవతలందరును ప్రీతి నొందుదురు. మాతాపిత సేవయే మాధవసేవయని మన వారు బోధించుచున్నారు కావున జనకుడు పరమపూజ్యుడగుచున్నాడు జనకుడు తపము,ధర్మము, విద్యయు నగుటచే పరమదైవముగా పరిగణింపబడుచున్నాడు

క. జనకుఁడు తపమును ధర్మం
బును విద్యయుఁ బరమ దైవమును గావున నా
తనికిఁ బ్రియంబగు పని చే
సిన దేవతలెల్లఁ బ్రీతిఁ జెందుట కల్గున్. [శాంతి-5-371]

'ఒక పుత్రుడు పుత్రుడుగాదు - ఒక కన్ను కన్నుగాదు' అను సామెత గలదు. ఏకపుత్రుడు గలవాడు అనపత్యునితో సమానమని ధర్మవులు చెప్పు చున్నవి [ఆది 1-81]. జననీ జనకులు ఏ కుమారుని కారణముగ హృదయా నందము పొందుదురో ఆ తనయునకు ధర్మము, కీర్తి కల్గుటయేకాదు అక్షయ గతులు సిద్ధించును [ఆరణ్య 5-6]. జననీ జనకులకు పుత్రునిపై ఆస పెద్ద. నవమాసములు మోసి కన్నది జనని-యజ్ఞయాగాద్యనేక క్రతువులు గావించి జనకుడు పుత్రుని పొందుచున్నాడు. కావున వారిరువురు తమ కుమారుడు తమకు భక్తుడు కావలెనని, ధర్మానురక్తుడు కావలెనని కోరుకొందురు. అట్టివారి కోరికను తీర్చినవాడే తనయు డనబడుచున్నాడు-

సీ. జతనంబు మిగుల మాసములు దొమ్మిది యుద
రంబునం గరము భరంబుతోడ
భరియించి పదపడి ప్రాణ సంశయ దశ
నొంది పుత్త్రునిఁ గాంచు నొనరఁ దల్లి
తపములు యజ్ఞముల్ దానముల్ వ్రతములు
దేవతా సజ్జన సేవనములు
గావించుఁ బుత్త్రునిఁ గామించి జనకుఁడి
ట్లిరువురపాటును నర్థియై తలఁపఁ

తే. దనియుగని తల్లి దండ్రులు దమకు సతఁడు
భర్తఁడగుటకు ధర్మానురక్తుఁడగుట
కానపడుదురు, వినుమట్టి యానసిద్ధి
బొందఁ జేయు నతఁడె చుమ్మీ నందనుండ [అరణ్య ‌‌‌‌‌‍‌‌‌‌‍'-5]

కన్యయగు పుత్రికకు తల్లి దండ్రులే కర్తలు. ఆ పుత్రికకు వివాహము చేయవలసిన విధి ఆ తల్లి దండ్రులదే. ఆ పుత్రిక స్వయముగా వివాహమాడుట వనితా ధర్మము కాదట. అట్లు వివాహము చేసికొనినచో నది ధర్మమునకు హాని కల్గినట్లని భారతము చెప్పినది (అరణ్య 7-‌332]. పుత్రిక చనిపోయిన యెడల తండ్రిచేయు పరలోక విధులామెకు చేరును. మరి పుత్రికచేయు తిలోదకదానాది విధులు ఆమె భర్తకే చెందునుగాని ఆమె తల్లి దండ్రులకు అవి చెందవు. అది ధర్మశాస్త్ర రహస్యము.

తే. తండ్రిచేయు తిలోదక దాన విధులు
పొందుఁ బరలోకగతయైన పుత్త్రియందుఁ
బుత్త్రి చేసిన విధులు తత్పురుషుఁగాని
తల్లిదండ్రులఁ బొందవు ధర్మయుక్తి (ఆది-6-261)

లోకధర్మము :

ఈ లోకమున జీవించుచున్న మానవులకు కొన్ని సామాన్య ధర్మము లున్నవి. మనకు మేలు చేసిన వారికి మేలు చేయకపోయినను పరవాలేదుగాని కీడు మాత్రము చేయరాదు. 'తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టకూడద'నుట జానపదుల సూక్తి. దుర్యోధనుడు విదురుని దూషించుచు 'కుడిచిన చోటికిఁ గూర్పవెపుడు' [సభా 2-181] అని నిందించినాడు జటాసురుడనువాడు బ్రాహ్మణ వేషధారియై వచ్చి పాండవులను చేరినాడు. వారిచ్చిన ఆతిథ్యము స్వీకరించుచు భీముడు వనాంతరమున కేగినంత ధర్మజాదుల నెత్తుకొని పోవునపుడు ధర్మజుడు ఆ అసురతో నిట్లు చెప్పినాడు-

తే. అతిథివై వచ్చి నీవు మాయందుఁ గుడిచి
యనురక్తవై యిట్లు యెగ్గుసేయంగ నగునె
యెందుఁ గుడిచిన చోటికి నెగ్గుసేయ
రెట్టి దుర్జనులైనను నెఱుక విడిచి [అరణ్య 3-390]

వాడు రాక్షసుడు కొబట్టి ఏయుక్తిలేని దుర్జనుడు. కుడిచిన చోటికి ఎగ్గుపేయ దలచినాడు. ఎగ్గు చేసినందులకు అనుభవించినాడు. కుడిచిన చోటికి కీడుచేయుట లోకధర్మము గాదు.

భార్యా వియోగము లోకమున నెట్టివారికైనను భరింపరానిది. రోగికి ఔషధమెట్టిదో, దుఃఖార్తునకు భార్యయట్టిది. భార్యాసమేతుడై యున్నవానికి ఆపద తెలుకపడవు [అరణ్య 2-74]. ఈ లోకములో ఏ గృహస్థునకైనను భార్యయే ప్రధానము సంసార యాత్రకు. భార్య పిమ్మట లేక భార్య రాకమునుపు అనగా అవివాహితునకు జనని ప్రాముఖ్యము చెప్పనలవి కాదు. జననిలేని సుతుడు చాల చులుకన. జలరుహాతంతువు చులుకన. తృణకణము, దూది, ఎగయు ధూళి ఎంత చులుకనయో తల్లిలేని సుతుడు కూడ నంత చులుకన[19]యట. తల్లిలేక పోయిన తనయుడు అసమర్థుడగును, దుఃఖపరుడగును. అతనికి లోకమే శూన్యమై తోచును.

క. అప్పుడ యసమర్థుండగు, నప్పుడ దుఃఖియగు శూన్యమైతోఁచు జగం
బప్పుడ మాతృవియోగం, బెప్పుడు పాటిల్లెనపుడ యెంతయుఁ దూలున్ [శాంతి 5-277]

అలసినపుడు, ఆకలి తృష్ణ కల్గినపుడు, చిత్తమునందలి దఃఖమును పాపునది భార్యయే [అరణ్య 2-65].

శత్రువు కారణముగ వ్యక్తికి మనశ్శాంతి లభింపదు, శత్రువును కడ తేర్చువరకు నిద్రరాదు. ఉత్సంగ తలమున నుగ్రవిషోరగమున్నట్లుగ శత్రువు తోచును. ఆ శత్రువును సంహరించుట లగ్గగును. కాని దీనుడై శత్రువు వచ్చి శరణనినచో ప్రసన్నభావమున నా శత్రువును రక్షింపవలసిన ధర్మము సత్పురుషున కుండును. అట్లు రక్షించిన వానిని పురుషోత్తముడని కీర్తింతురు. [అను 2-339].

ఎట్టివానికి నిద్రరాదు? దీనికి సమాధానము భారతమున గలదు. కోపముతో నున్నవానికి, అర్థప్రాప్తికై అలమటించువానికి, ఆతురుడైనవానికి మరియు కామాతురుడైనవానికి ఈ నలువురికిని నిద్రరాదట-[సౌప్తిక-1-65]. మనము ఇష్టమైన

వారిని ఆరవ ప్రాణముగా పరిగణింతుము-శరీరములు వేరైనను ఏకాత్మలుగా నుందురు-కృష్ణార్జును లిరువురు నిత్య సాంగత్యముచే ఏకాత్ములు [సభా-2-112] అందొకరికి కీడు చేసినవాడు రెండవవారికి శత్రువే యగుచున్నాడు. ఈ విషయ మును సంధికేగిన శ్రీకృష్ణుడు దుర్యోధనునితో వక్కాణించుచున్నాడు. ఇది లోకధర్మము-

క. అలుగుదు పాండవులకు వా
రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టులముగఁ దమ ప్రాణములకు
నలుగు జనులు పగతురగుట యనుమానంబే [ఉద్యో-3-225]

దొంగతనము చేయుట లోకధర్మముకాదు, కాజాలదు. కాని దొంగతనము కూడ క్వాచిత్కముగ చేసినను ధర్మమే అగును. మరి ఏ సమయ సందర్భము లందు చేయవచ్చును? ప్రాణములు పోవుచున్నపుడు [ఆకలి కారణము కావచ్చును] దానిని పరిహరింప అన్యమార్గము లేనపుడు, అధముడైన వాని ధనమును ముచ్చిమియు కొనవచ్చును, అప్పుడది ధర్మమే అగునట. [శాంతి 3-287].

వివాహితయైన స్త్రీ పుట్టిన ఇండ్లను పెద్దకాల ముండరాదు. ఎంత సాధ్వి యైనను అది హితము కాదు, పతుల దగ్గర యునికియే సతులకు ధర్మువు — ఇది కూడ లోకధర్మమే.

ఆ. ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాలమునికి తద్ద దగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడు గడయుఁ బతుల చూవె [ఆది-4-66]

వివాహము జరిగినప్పటినుండి దంపతులు సంతానార్థులై వేచియుండుట లోకధర్మము. తమ రూపమును సంతతిలో చూచుటకు సూత్నదంపతులు ఉవ్వి ళ్ళూరుచుందురు. తల్లిదండ్రులకు తమ కుమారులపై నున్న ప్రేమ అగ్గలము. అంతటి ప్రేమ పుత్రులకు జననీజనకులపై నుండక పోవుటను నిత్యజీవితమున మనము గమనించుచునే యున్నాము. ధనవంతులకు సహితము ఎన్ని భోగ

భాగ్యములున్నను (సుత) సంతానము లేనివారికి మనఃప్రియమ్ము లేదు, ఇదియు లోకధర్మమే గదా!

ఆ. ఎల్ల నెయ్యములకుఁ దల్లిదండ్రుల యందు
సుతుల వలని నెయ్యమతిశయంబు
ధనము లెంత గలిగినను సుతరహితుల
కెమ్మెయిని మనఃప్రియమ్ము లేదు [అరణ్య 1-81]

**రాజధర్మము :**

భారతము రాజధర్మములకు గనివంటిది. చంద్రవంశపు రాజుల చరిత్ర గావున రాజధర్మముల కిది నిధి వంటిది. రాజధర్మములు కోకొల్లలుగా నిందు గలవు. అందు ప్రధానమైనవి కొన్నిమాత్రమే వివరించుట ప్రస్తుత కర్తవ్యము.

రాజు ముందు తన్ను తాను గెలువవలయును. తర్వాత శత్రువుల గెలువవలెను. తన్ను తాను గెలువనటువంటి రాజు శత్రువుల జయించుట ఆతనికి తరమా? [శాంతి 2-276]

పశువుల కారణముగ కృషియు, బేహారము కల్గును- కావున పసులుగల కాపులను రాజు కన్నబిడ్డలవలె కాపాడవలయును (శాంతి 2-388). ఆనాడు పశుసంపదకు ప్రాధాన్య ముండెడిది.

ఆలస్యము, అసహాయత్వము ఈ రెండును రాజునకు పనికిరావు. ఇవిలేని రాజు సుఖియై చలించునట (శాంతి 3-81). సర్వ ధర్మములును క్షత్రధర్మమునకు తక్కువ. యజ్ఞయాగాదులు, దండనీతి లేకపోయిన రాజ్యమునందలి ప్రజలకు చేటు అవహిల్లును. ధర్మరాజి యందు రాజు సర్వోత్తముడట. అన్ని ధర్మముల కంటె రాజధర్మము ఎక్కుడు. రాజు-ధర్మదేవత వేరుగాదు ఒక్కరే (శాంతి 2-219). రాజునకు క్షమ యుండవలసినదే గాని ఎల్లపుడు నుండరాదు. అట్లే తేజోవిరాజితుడై రాజుండ నగును గాని ఎల్లప్రొద్దును తేజమును తాల్చియుండరాదు.

ఆ. క్షమయ తాల్చియుండఁ జనదెల్ల ప్రొద్దుఁ దే
జంబ తాల్చియుండఁ జనదు పతికి
సంతతక్షముండు సంతత తేజుండు
నగుట దోషమందు రనఘమతులు [అరణ్య 1-211]

సద్ధర్మము లందెల్ల నృప ధర్మము ఉత్తమము, కామ క్రోధములను రాజు త్యజించవలెను. దండనీతి పాటించవలెను. అట్లు పాలించిన రాజునకు సుగతి ప్రాప్తించును (శాంతి 2-247). రాజునకు శరీరము వంటివారు ప్రజలు. ప్రజలు రాజున కాత్మ వంటివారు. అన్యోన్య రక్షణము అవసరము.

క. రాజునకుఁ బ్రజ శరీరము
రాజు ప్రజకు నాత్మ కాన రాజుం బ్రజయున్
రాజోత్తమ యన్యోన్య వి
రాజితులై యుండవలయు రక్షార్చసలన్ [శాంతి 2-274]

రాజ్య పరిపాలనమునకు రాజునకు ధనము ఆవశ్యకము. ప్రజల దగ్గర నుండి పన్నుల రూపమున ధనము నార్జింపవచ్చును. దూడకు కూడ పాలులేకుండ పాలు పితుకరాదు. అట్లే ప్రజలకు కూడ ఏమాత్రము ధనము మిగులకుండ కప్పము గొనరాదు (శాంతి 2-387). ప్రజలనుండి కప్పమును ఆరవ వంతు సంగ్రహింపవచ్చును. ప్రజలను కరుణతో కన్న తండ్రివోలె కాపాడవలెను. అట్టి రాజునకు భయ సంశయము లుండవు. ఆ రాజునకు పరమపదము ప్రాప్తించును (శాంతి 1-176).

రాజునకు శత్రువు లేర్పడుట లోక సహజము. శత్రు బలమును నిజ బలమును రాజు తెలిసికొనవలెను. ఎదిరి బలమెక్కుడైనపుడు ఎదురు పడరాదు. శత్రబలము యొక్క ఉద్ధతి తగ్గినపుడు హీనబలుడు ఆక్రమించవలెను (శాంతి 3-90). శత్రుపురమును చెఱపుట, ఆ ప్రజలను బాధలపెట్టుట రాజధర్మము గాదు. భూసుర, దేవ గేహముల చూఱ నవశ్యము మాన్చుట ధర్మమగును (శాంతి 2-424). అరిపై పోవునపుడు తేనెగా లుట్టిపడునట్లుగ వాని వారలు వినునట్లుగ పల్కవలెను.

సమర మొనరించుట రాజునకు సాహసక్రియ. అహంకారములేని రాజునకు. కోపము లేని రాజునకు శత్రువు లుండరు. మానవనాథునకు సామమే మితమైనది. (శాంతి-2-414). సంగరమున చచ్చినను, చంపినను రాజునకవి ఉత్తమక్షత్ర ధర్మములు (శాంతి-1-182). సమరము రాజునకు ధర్మము. అది మొందియు రాజులనుసరించుచున్నదిదియే- దీని కారణముగ రాజులకు సుగతి కీర్తి తథ్యము (శల్య-1-42). దీర్ఘ క్రోధుడైన పతికి కీడు సంభవించును (శల్య-1-55). సమర మొనరించిన రాజులకు స్వర్గ ప్రాప్తి కల్గును. అదియే రాజుల కుత్తమ ధర్మము. (భీష్మ-1-201). సమరమున నేవిధమున చచ్చినను, వారందరు ఉత్తమ లోకమునకు పోదురు (స్త్రీ-2-171)

రాజులకు జయాపజయములు తప్పవు.మద విషాదములను రాజు చేరనీయ రాదు. (శాంతి-3-37). రాజులకు యుద్ధ మొనరించుటయే సుకర్మమగుచున్నది. (శాంతి-4-148). యుద్ధమునకై వెడలిన పిమ్మట రాజు బంధువులని, స్నేహితులని, గురులని దండింపక వదలి పెట్టరాదు. పాపాత్ములైనవారు యుద్ధరంగమునందెదుర్చినపుడు తండ్రి అయినను, పుత్రుడు, పౌత్రుడు, గురువునైనను చంపుట ధర్మమే అగును. లోభము అన్యాయము గల వారి నెవరి నైనను రణరంగమున సంహరింప నగును. (శాంతి-2-155). రాజులకు పరాక్రమ జీవన వృత్తి ధర్మము. ఇతర మార్గములు నిషిద్ధములు (ఉద్యోగ-1-14). పరమశాంతుడు కావలసిన బ్రాహ్మణుడట్లు గాక ఆయుధవంతుడై, అని తలపడినపుడు హింసించుట పరమ ధర్మమని శ్రుతులు చెప్పుచున్నవట-

క. శాంతుఁడు గాకని ఆయుధ
వంతుండై కవియు విప్రు వసుధేశుఁడు వే
దాంతి నయిన హింసించుట
యెంతయు ధర్మంబు శ్రుతులు నిట్లని చెప్పున్ (శాంతి-2-175)

కావున యుద్ధ ధర్మము, రాజ ధర్మము నట్టివి, పితామహుండగు శాంతనవుని అధర్మ యుద్ధమున,శిఖండి నెపమున చంపుమని అర్జునునకు శ్రీకృష్ణుడు చెప్పినపుడు అర్ధ్రమనస్కుడైన గాండీవి రాజధర్మము నిట్లు దూషించుచున్నాడు. బాల్య క్రీడలతో పాంశుమయమైన తన శరీరమును తుడిచి, తొడపై కూర్చుండ బెట్టుకొని లాలించిన పితామహుని చంపవలసి వచ్చి నందుకు అర్జున విషాదమట్లున్నది-ధర్మజుడిట్లు చెప్పినాడు.

ఆ. అకట తండ్రి వచ్చినంత నుండియు మము
నరసి ప్రోచినట్టి యనుఁగుఁ దాతఁ
జంపమదిఁ దలంచు తెంపు సూచితె రాజ
ధర్మమింత క్రూర కర్మ మగునె (భీష్మ-3-288)

ఇట్లు రాజధర్మమును పరిశీలించిన పిమ్మట ఇక యుద్ధధర్మమును పరి కించ వలెను.

యుద్ధ ధర్మము :

యుద్ధము నందు పాల్గొను వీరులు కొన్ని యుద్ధ ధర్మములను పాటించురు అనాటి యుద్ధ ధర్మము మిక్కిలి రమణీయము. శత్రువు సైన్యముతో వచ్చిన సైన్యముతోను ఒంటరి యుద్ధము కోరిన వట్లే యుద్ధము గావింప వలెను- శత్రువు మాయలొనర్చిన మాయలొనర్ప వచ్చును. జయము గౌణము ప్రధానము. ప్రతి వీరుని చంపుటలో కొన్ని ధర్మములను పాటింపవలయును వెన్నిచ్చిపారిపోవుచున్నను, ప్రమాదమున పడిపోయినను, కైదువు తగ్గనైనను, శరణు కోరినను, తురగములు ఎదలిపోయినను, ఇతరునితో పోరుచున్న వీరుడు ఎంత శత్రువైనను వానిని సంహరింపరాదు-అధర్మ మార్గమున శత్రువి చంపుట కంటె ధర్మ యుద్ధమున చచ్చుట మేలు రాజు శయ్యమీదచచ్చుట మేలు గాదట-మరియు యుద్ధమునందోడుటయు శ్రేష్ఠముకాదు(శాంతి-2-120). యుద్ధ మొనరించుచు సంభాషించుచున్న వానిని,యుద్ధమునందు ప్రమాదమునపడిపోయిన వానిని కైదువు పడిపోయినపుడు, పారిపోయిన వానిని,భయవిహ్వలుడైన వానిని, యుద్ధోన్ముఖుడు కాని శత్రువునైనను వధింపరాదు- (భీష్మ-1-148) అని భీష్మపితామహుడు చెప్పు చున్నాడు. పై రెండు పద్యములందు కొన్ని విషయ ములు పునరుక్తములైనవి గదా!

యుద్ధము నందు మోసము పనికిరాదు. విషలిప్తమైన శస్త్రములను ప్రయో గించి శత్రువీరుని నిహతుని గావింపరాదు-

క. విను చిల్ల యుడిన యాయుధ
మును, విషలిప్తమగు శస్త్రమును నెట్టి యమి
త్రునిపై నైనఁ బ్రయోగిం
చిన నరపతి నరకమున వసించు నృపాలా (శాంతి-2-421)

చిల్ల యిడిన ఆయుధము ప్రయోగించి శత్రువును సంహరించిన వీరునకు నరక ప్రాప్తియని-యుద్ధ ధర్మము చెప్పుచున్నది-

శరణన్న శత్రువీరుని చంపరాదని పైన చెప్పియున్నది. శరణని వచ్చిన భీకర శత్రువును కూడ రక్షింప వలయును. ఇది కరుణాపరుల సంగతి. శరణాగత రక్షణమునకు ఇతర ధర్మములు చాలవు-

చతురంగ బలములందు రథికుల యుద్ధము గొప్పది. రథి ధర్మము సారథిని గాచుట, సారథి ధర్మము గుఱ్ఱములదోలుటయే గాదు, ఇమ్ముగాని యెడ రథికుని రక్షింప వలయును. రథి సారథులు పరస్పర శరీరరక్ష గావించుకొనుచుండుట యుద్ధ ధర్మము-

క. రథి కిమ్ముగాని యెడ సా
రథి ధృతి మెయిఁ గావ వలయు రథియునుఁ దత్సా
రథిఁ గావ వలయు రథి సా
రథులు పరస్పర శరీర రక్షకు లగుటన్ [ఆరణ్య-1-173]

సారథి బల సత్త్వములందు రథికున కధికుండు కావలయునట. (కర్ణ-1-288). అందువలననే అర్జునుడు శ్రీకృష్ణ సారథ్యము నపేక్షించుట-ఇది గమనించియే దుర్యోధనుడు కర్ణునికి సారథివి కమ్మని శల్యుని ప్రార్థించినాడు-

యుద్ధము నందు ప్రతి వీరు నెట్టివానినైనను చంపవచ్చును. క్షత్రియ ధర్మమును పాటించి సంగర రంగమున కేతెంచినపిదప గురువులు, తండ్రులు, తాతలు, తమ్ములు- భ్రాతులు, శిష్యులు, మామలు పుత్రులనరాదు, విజృంభించి పోరుటయే సంగర ధర్మము (భీష్మ-3-216) అని శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి బోధించినాడు.

సంగర రంగము నందు ఖడ్గము గైకొని తన్ను చంపుట కేతెంచుచున్నవాడు ఎంత వేదాంత వేదియైనను వానిని సంహరింపనగును-ఇది యుద్ధధర్మము.

క. దురమునఁ గైదువుఁ గొని తనుఁ
బోరిగొన నేతెంచు నట్టి పురుషుని వేదాం
త రహస్య వేది నయినను
బోరి గొనినను గిల్బిషంబు పొందదు వత్సా [శాంతి-1-295]

ప్రతివీరుని చంపుట పాపముదాదని యుద్ధధర్మము. (ద్రోణ-5-362).
బలహీనులైన వారు బలవంతులను జయింప వలసి వచ్చినపుడు బహు మాయలను ప్రయోగించి అయినను జయింప వలయును-జయము గొనుటయే కర్తవ్యము-

క. బలహీనులయిన వారలు
బలవంతుల నోడుచునపుడు బహు మాయల న
చ్ఛలమునఁ జేయుట యొంథును
గల యదియు జయంబ కాదె కర్తవ్య మిలన్ [సభా-2-170]

యుద్ధ ధర్మమును పాటించి రణరంగమున నిహతులైన వారికి పుణ్య ప్రాప్తికలుగును. కురుక్షేత్ర సంగ్రామము ముగిసినది. వారికి పిండదానము, తిలోదకదానము చేయ ధృతరాష్ట్ర ధర్మరాజాదులు పొలికలవికేతెంచిరి. అక్కడ ధృతరాష్ట్రుడు సంగరరంగమున నిహతులైన వారికేమి గతి ప్రాప్తించునని ధర్మజుని ప్రశ్నించినాడు. ఎవ్వరు ఆత్మదేహములను అస్త్రవహ్నిలో వేలిచిరో వారు అమరలోకమున కేగుదురన్నాడు-

తే. ఎవ్వరాత్మ దేహములు సమిద్ధమైన
యస్త్ర వహ్ని వేలిచిరి వారమరలోక
మునకుఁ జని నిర్జరాంగనా జన విలసితుఁ
డైన యమరేంద్రునకుఁ బూజ్యులగుదు రధిప [స్త్రీ-2-169]

రణరంగమున భీతులై, ధైర్యములు చలించగా చచ్చిపోయిన వారు గుహ్యక గతికి పోవుదురని ఇట్లు చెప్పినాడు-

క. తఱచుగ శస్త్రాస్త్రంబులు
నెఱకులు దూఱినఁ బలించి నిజధైర్యంబులు
మఱచి తెరలి చచ్చిరి కొం
దఱు గుహ్యక గతికిఁ బోవఁ దగుదురు వారల్ [స్త్రీ-2-170]

యుద్ధమున కేతెంచి రణరంగమున నెట్లు సంహరింపబడినను వారికి కీడు మార్గము రాదు-ఉత్తమలోకమునకే పోవుదురని విబుధులు చెప్పుచున్నారు (స్త్రీ-2-171).

ఇట్లు చెప్పుట వలన రణరంగమునకు పోవు వీరులు చావునకు భయపడరు, యుద్ధమున శత్రువులను చంపుటయు, చచ్చుటయు నాటివారు పౌరుష

ముగ భావించెడివారు-కాలము మారినది. నేటి యుద్ధధర్మము వేరు. నేడు యుద్ధమున ధర్మముకంటె ప్రతివీరుని చంపుటయే ప్రధానము. నేటి వీరులకు యుద్ధ ఫలము ఉత్తమలోక ప్రాప్తియను విశ్వాసమునులేదు-యుద్ధ ఫలము సర్వ నాశనమేగాని సుఖములే మాత్రము కలుగవు-చచ్చినవారు చావగా బ్రతికిన వారు బాధలొందుదురు-యుద్ధములవలన పశ్చాత్తాపమేగాని మరి యితర ప్రయోజనమేమియు నుండదు-అందువలననే నాటివారు, నేటివారు 'పోరు నష్టము-పొందు లాభమ'ని తలచుట దీని అంతర్య మిదియే-

ధర్మశాస్త్ర గ్రంథమైన మహాభారతము నందు ధర్మ సంబంధమైన సూక్తులకు కొదువలేదు. గ్రంథవిస్తర భీతిచే శాఖాచంక్రమణ న్యాయమున ధర్మవివరణము గావింపబడినది—ఈ లోకమున ధర్మము ననుసరించిన పిదప అనుసరింపదగినది సత్యము-ఇక సత్య సంబంధములైన ఆంధ్ర మహాభారత గత సూక్తులను కొంచెము పరిశీలింపనగును.

## జ్ఞాపికలు

| | |
|---|---|
| 1. గురు బాల ప్రబోధిక | పు 105 |
| 2. బృహదారణ్యకోపనిషత్తు | I–14 |
| 3. త్రయో ధర్మస్కంధాః | II–23 |
| 4 తైత్తిరీయోపనిషత్తు | I-11 |
| 5. పూర్వ మీమాంస | I–1, 2 |
| 6. మనుస్మృతి | II–6 |
| 7. శాంతి పర్వమ్-అధ్యాయమ్ | 37–15 |
| 8. కవిత్రయ శ్రీకృష్ణ దర్శనము | పు-136 |
| 9. ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము | 6–359, 3·0 |
| 10 సంస్కృత మహాభారతము—భీష్మపర్వము. అధ్యాయమ్ | 23–8 [illegible] |
| 11. భగవద్గీత నాల్గవ అధ్యాయము | శ్లో—7 |
| 12. అందే చతుర్థాధ్యాయమ్ | —8 |
| 13. ఉద్యోగ పర్వము | 3–273 |
| 14. గౌతమ ధర్మ సూత్రములు | 1–1–2 |
| 15. ఆంధ్ర మహాభారతము-శాంతిపర్వము | 5—220 |
| 16. చూ. అధ్యాయము— | 2 పు॥ |
| 17. సుమతీ శతకము- | ప-18 |
| 18. రఘువంశము | సర్గ-1, శ్లో-7 |
| 19. భోజరాజీయము | 6—37 |

# సత్య వైశిష్ట్యము

భారతము సత్యవాక్పరిబంధమగుటచే నిందు సత్యవైశిష్ట్యమును కొనియాడు సూక్తులకు కొదువలేదు. ఈ అధ్యాయమునందు సత్యమునకు సంబంధించిన సూక్తుల పరిశీలనము చేయబడును—

## సత్యపద ప్రయోగము :

సత్యమను పదము మొట్టమొదట ఋగ్వేదమునందు కనబడుచున్నది. నిత్యకర్మలో బ్రాహ్మణులు నేటికి పఠించుచున్న ఋగ్వేద మంత్రములో 'ఋతం వదిష్యామి, సత్యంవదిష్యామి' కలవు. ఇక్కడ ఋతము వేరు సత్యము వేరు. ఋతము స్థిరమైనది. దీనికి మార్పుగాని, పరిణతిగాని ఉండదు—ఇది త్రైకాలికమైన సత్యము. మరియు నిది విశ్వజనీనమై విభ్రాజిల్లును—ఋతము త్రైకాలికమనుటకు నొక మంచి ఉదాహరణమును చెప్పనగును—దైవము సత్యము, పరబ్రహ్మ సత్యము. ఋతముకంటె భిన్నమైన సత్యము కాలానుగుణముగ, దేశానుగుణముగ పరిణామము చెందుచుండును—కావున ఋతము—సత్యము విభిన్నములు—'ఋతగ్ం సత్యం పరబ్రహ్మ' అనుటవలన నవి భిన్నములని చెప్పనగును. దాదాపు ఈ అర్థభేదములను వ్యక్తీకరించు ఆంగ్లపదములు ఋతము—Truth, సత్యము—Reality.

## సత్య నిర్వచనము :

కాలాంతరమున పీనికభేదము వాటిల్లినది—ఋతము కానిది అనృతము, సత్యము కానిది అసత్యము—వేదకాలము తర్వాత విలసిల్లిన రామాయణ భారతములందు చాలవరకు ఈ రెండు పదములకు భేదమంతరించినది. భారతకాలము నాడు, మరియు నేడు కూడ నీ పదములు రెండు సమానార్థకముననే ప్రయోగింపబడుచున్నవి—ఋతమును పల్కుచున్నాడు. సత్యమును పల్కుచున్నాడు. అట్లే అనృతము చెప్పరాదు—అసత్యము చెప్పరాదు అని మనము ప్రయోగించుచునేయున్నాము—

**సత్య దర్శి :**

మహాభారతకర్త వేదవ్యాసుడు. వేదములు పరబ్రహ్మ వాక్కులు, అవి నిత్య సత్యములు. వేదములను క్షుణ్ణముగ పఠించి వింగడించిన వేదవ్యాసుడు సత్యప్రవక్తయగుటలో నాశ్చర్యము లేదు. మరియు వ్యాసుని జనని సత్యవతి. తల్లి సార్థకనామధేయురాలు-ఆ సత్యవతీ పుత్రుడైన వ్యాసుడు సాత్యవతేయుడు. ఇతనిలో సత్యమే రూపము దాల్చినది-మరియు వేదవ్యాసుడు సత్యనిష్ఠ గల వాడు. భారత గ్రంథాంతమున సూతుడు వ్యాసుని 'మేటి మునీశ్వర సంఘంబులో నెల్ల సత్యదర్శి'[1] అని కీర్తించినాడు. మరియు వ్యాసుడు సర్వ విధిజ్ఞాత, సర్వ విజ్ఞాన భవ్యాత్ముండు, సర్వేంద్రియ ప్రబోధశాలి, సర్వజ్ఞుండు, శౌచశాంతి క్షమా దాంతి తపోనిత్య విభాసియట-అంతేకాదు అఖిల సాంఖ్య యోగ భేదవిదుడు, ధర్మోపదేశ చతుర వాగ్విలాసుండు నిస్తత్త్వవస్తువేది. వేదమయుడు మీదు మిక్కిలి ఇతడు సాత్యవతేయుడు.[2] మహాభారతము సాత్యవతేయ విష్ణుపద సంభవమైనది. అట్టి భారతమునందు సత్యము ప్రవక్తకమగుటలో సందేహము లేదు-

**సత్య వాక్ప్రబంధము :**

మహాభారతము కల్పతరు తుల్యమైనది, సత్యవాక్ప్రబంధమును పారిజాత వృక్షముతోనుపమించినారు. ఆ భావము అమృతోప సమానము-

మ. అమితాఖ్యానక శాఖలం బొలిచి, వేదార్థామల చ్ఛాయమై
సుమహా వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి, కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై, ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీ సుర ప్రార్థ్యమై
(ఆది-1-16)

మహాభారతము నందలి ఆఖ్యానములే శాఖలు-వేదార్థమే ఛాయ-వర్గ చతుష్కమే పుష్పవితతి-కృష్ణార్జున కీర్తనమే ఫలము-ద్వైపాయనుడు ఉద్యాన వనము-మహాభారతమే పారిజాతము. సంస్కృత భారత భాగవత గ్రంథము లను సంతరించిన దొక్కరగుటచే పోతన కూడ ఆంధ్రమహాభాగవత గ్రంథము నిట్లు కీర్తించినాడు.[3] నన్నయ పద్యమువలె నిడియు మత్తేభము నందు గంభీర ముగా సాగిపోవుటను గమనించుడు-

మ. లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతా శోభితమున్, సువర్ణ సుమనస్సు జ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు. విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజశ్రేయమై

ఆంధ్ర మహాభారతము పారిజాత వృక్షము కాగా ఆంధ్రమహాభాగవతము కల్పతరువైనది-పారిజాతమే కల్పతరువు-కల్పతరువే పారిజాతము.

మహాభారత మహిమము కొనియాడబడినది. గ్రంథాదిని మాత్రమే గాక గ్రంథ మధ్యమునను భారత మహిమ ప్రసక్తము.[4]

సీ. కమనీయ ధర్మార్థ కామ మోక్షములకు
నత్యంత సాధనం బయిన దాని
పేర్కొం దవిలి తన్ వినుచున్న వారల
కభిమత శుభకరంబయిన దాని
రాజులకఖిల భూ రాజ్యాభి వృద్ధి ని
త్యాభ్యు దయ ప్రదంబయిన దాని
వాఙ్మనః కాయ ప్రవర్తితానేక జ
న్మాఘ నిబర్హణంబయిన దాని

ఆ. సత్యవాక్ప్రబంధ శత సహస్ర శ్లోక
సంఖ్య మయిన దాని సర్వలోక
పూజ్యమయిన దాని బుధనుత వ్యాస మ
హా ముని ప్రణీత మయిన దాని-

అని శత సహస్రశ్లోక సంఖ్యతో విరాజిల్లుచున్న మహాభారతమును సత్యవాక్ప్రబంధముగా పేర్కొనినాడు-

**సత్య సమన్వితులు :**

కర్త సత్యదర్శి. సత్యనిష్ఠ గలవాడు. మరి తత్కృత కావ్యము సత్య వాక్ప్రబంధము. అంతియేకాదు ఆ కావ్యకథలోని భారతవీరులైన పాండవులు సత్యపరాక్రమములు.[5] భరత వీరుల కీర్తిమహిమయిట్లు సంకీర్తింపబడినది.

చ. వినుత పరాక్రముల్ ధృత వివేకులు సత్య సమన్వితుల్ యశో
ధనులు కృతజ్ఞులుత్తములు ధర్మపరుల్ శరణాగతానుకం
పనులన(గా( బ్రసిద్ధులగు భారత వీరుల సద్గుణాను కీ
ర్తనముల నొప్పు దాని విదితం బగుదాని సభాంతరంబులన్
(ఆది-3-10)

భారత వీరులైన పాండవులు సత్య సమన్వితులు-కావున భారతము నందు సత్యమెల్లడల వినుతింప బడినది, దుష్యంతోపాఖ్యానము నందు సత్య ప్రతిష్ఠాపన చేయబడినది. పాండవులు సత్య సంధులు-వారి సత్యవాక్పరిపాలన భారతమున పెక్కుమార్లు ప్రశంసింపబడినది. సమయము వచ్చినపుడెల్ల పెక్కుమార్లు పాండవులు సత్య ధనులని కీర్తింప బడిరి- 'సత్య ధర్మ నయ పరాక్రమ సహాయ సంపన్నులైన పాండవుల (దనకు గెలువ వచ్చునే?'[7] అని ధృతరాష్ట్రుడు పల్కినాడు. 'భరత కులంబు ధర్మమును బాడియు సత్యము( బొత్తు( బెంపు నుం గరుణయు( గల్గియుండు నన(గా నుతి(గన్నదని'[7] శ్రీకృష్ణుడు పల్కినాడు. ఇట్టివి ఎన్నియో ఉదాహరింప నగును. మహాభారతము నందు సమయ సందర్భములు వచ్చినపుడెల్ల సత్యాన్వేషణ, సత్యశోధన, సత్య నిరూపణము, సత్యస్థాపన చేయుట మనము గమనింప నగును. ఇందలి సత్య వైశిష్ట్యము ప్రశంసార్హము—

మౌన వ్రతము :

నోరు తెరచిననే గదా సత్యమైనను, అసత్యమైనను పలుకునది- మౌన వ్రతమును పాటించిన యెడల అసత్యము పలుకుట తగ్గును. కావుననే కొందరు అసత్యము పలుకుటను తగ్గించుటకై మౌనవ్రతమును పాటింతురు. ఒక్కొక్కప్పుడు మౌనవ్రత కారణముగ సత్యమును చెప్పుటకు వలను పడదు-దీనికి దృష్టాంతముగ భారతము నందలి మాండవ్య మౌని మౌనవ్రతమును పేర్కొన వచ్చును- మాండవ్యుడను మహర్షి అడవియందు ఆశ్రమము నిర్మించుకొని, ఊర్ధ్వబాహుండయి మౌనవ్రతము నాచరించుచు తపము గావించు చుండెను, రాజ ధనమును దొంగిలించి ముచ్చులు పారివచ్చి మాండవ్యుని ఆశ్రమము నందు దాగిరి-వారిని వెనుదగిలి వచ్చిన ఆరెకులు మాండవ్యుని దొంగల సంగతి నెరుగుదువే? యని ప్రశ్నించిరి. మౌనవ్రతమున నుండు

టచే మాండవ్యునకు సత్యము చెప్పవీలు కాలేదు, పలుకకుండెను-అంత ఆరెకులు ఆశ్రమమును శోధించి ధనముతోడ ముచ్చులను పట్టుకొనిరి. మరియు మాండవ్యుడే ముచ్చులకును దాపికాడని భావించి మాండవ్యునితో కూడ వారందరిని రాజున కప్పగించిరి. రాజు ఆ ముచ్చులకు మరణదండనం బాచరించి, తపోవేషంబున నున్న ముచ్చని మాండవ్యుని పురము వెలుపల శూలప్రోతుని గావించినాడు. అతిశాంతుడైన మాండవ్యుడు నిరాహారుడై తపమును గావించుచునే యుండెను. అతని తపోబలమునకు మెచ్చి, మహామునులు ఒక నాటిరాత్రి పక్షులైవ చనుదెంచి అట్టిదుఃఖము గావించిన వారెవరని ప్రశ్నించిరి. సుఖ దుఃఖములకు కారణము తనకర్మ వశమేగాని అన్యుల కేమి కారణమని సమాధాన మిచ్చిన దంతయు ఆ నగరరక్షకులు విని రాజున కెరిగించిరి, రాజు దీన వదనుడై మాండవ్యుని కడకేతెంచి నమస్కరించి, అజ్ఞానము సహింపుమని వేడి. శూలము పెరుకరాకున్న మొనలు రెండు ఖండింప చేసినాడు. ఇట్టి దారుణ దండము మాండవ్య మహర్షి అనుభవించుటకు స్థూలకారణము మౌనవ్రతమే. సూక్ష్మకారణము మరియొకటి కావున మౌనవ్రతము వలనను ప్రమాదము గలదు. 'సత్యంవద' అని సత్యము పలుకుటయే మేలు.

**పలుకుల-భేదములు :**

పలుకులు పలువిధములుగా నుండవగును-కాని ప్రధానముగా నివి రెండు తెరగులు- 1. మృదు భాషణములు. 2. పరుసపు పలుకులు. మృదు భాషణములు తన్ను పరివేష్టించియున్న వారినందరిని అలవరించును- 'నోరు మంచిదయిన ఊరుమంచిదట' ఇందులకే, మృదుభాషికి లోకమున గౌరవము కలదు. పరుసపు పలుకులు సప్తవ్యసనములలో నొకటిగ చెప్పబడినది-'పలుకు ప్రల్లదము అనగా నిదియే.[8] దీనినే వాక్పారుష్యముగా ధర్మరాజు పేర్కొనినాడు-వాక్పారుష్యము మహాదారుణమైనది. ఇది విషము కంటెను దహనము కంటెను మిగుల సంతాపకారి.[9] ఎరుకగల వారెవ్వరు పరుసపు పలుకులు పలుకరు—

మృదుభాషణములు పలుకు వారికి మహోన్నతి కలుగును-మృదు మధురమైన వాక్యములతో. ఇంపొదవెడు చిగునగవుతో రాజు తన మంత్రులతోడను ప్రజలతోడను సంభాషించుట మంచిదట (శాంతి-2-371). మంచివారి దగ్గరే

మృదు భాషణములు పనికి వచ్చునుగాని, దుర్మార్గవర్తనులగు వారి కవి ఇంపును పెంపవు-పైగా నా మాటలను లెక్కింపక దురభిమానముతో వారికి మదము పెరుగును-

క. మృదు భాషణములు దుర్జన
హృదయములు ప్రసన్నతా మహిమఁ బొందునె? యె
ల్లిదముగఁ గొని యంతంతకు
మద మెక్కుం గాక దురభి మానము పేర్మిన్ (ఉద్యోగ-1-34)

పరుసపు పలుకులు పలికి శ్రీకృష్ణునికి విరసము కల్గించిన శిశుపాలుని గతి ఏమైనదో మనకు స్పష్టము-కావున పరుషంపు పలుకులు విసర్జనీయములు. చక్కని సామెత నొకదానిని జ్ఞప్తికి దెచ్చుకొనుట ఉచితము-'పడితే కాలైన వెనుకకు తీసికోవచ్చునేమోగాని మాట మాత్రం వెనుకకు తీసికోలేము.' మరియొక సామెత ఈ అర్థములోనే ఉన్నది-'కాలు జారితే తీసికోవచ్చుగాని-నోరుజారితే తీసికోలేము.' నోరు జారుటయనగా పరుసముగ పలుకుటయే.

**పలుకుల ఒప్పు :**

పలుకుటను స్థూలముగా రెండు విధములుగ చెప్పనగును-1. ఎదుటి వారికి హితముగ పలుకుట, 2. ఎదుటి వారికి అహితముగ పల్కుట-ఎదుటి వారికి హితముగ పల్కినను అది ఒకప్పుడు వారికి రుచింపవు-

మహాభారతము నందొకచో పలుకులు నాల్గు తెరగులుగ చెప్పబడినవి-1. పలుకుట, 2. సత్యము పలుకుట, 3. ధర్మమార్గమున పల్కుట, 4. సర్వ జన ప్రియముగా పలుకుట.

చ. పలుకక యుండు కంటెఁ దగఁ బల్కుట మేలు, వినుండు సత్యముం
బలుకుట, ధర్మమార్గమునఁ బల్కుట, సర్వజన ప్రియంబుగాఁ
బలుకుట, యొలి నెక్కుడగు భంగులు వీనినెఱింగి యొండుమై
బలుకక నాల్గు చందములఁ బల్కఁగ మెత్తురు వాని దేవతల్
(శాంతి-5-565)

పలుక కుండుట కంటెను పలుకుట మేలు. ఆ పల్కులు నాల్గురకములు-ఈ నాల్గు రకములను తెలిసికొని ఒకరీతినే పలుకక నాల్గు చందముల పలుకుట వలన వానిని దేవతలు కూడ మెత్తురని పొగడినాడు-

పలుకులు అందరు పలుకగలరు-కాని పలికిన దానిని ఎందరు అనుసరింప గలరు? ఎందరు చేయగలరు? (కర్ణ-2-15). పలికినట్లుగ చేయుట ఎందరికి వీలగును? పలికిన మాట తప్పగరాదుగదా!

ఇతరులను మాట అనరాదు-మాటపడిన వానికి పాపములు పోవును. ఇతరులను మాట అన్నవానికి పాపములు ప్రాప్తించును-ఇతరులను మాటలు అన నేల? పాపము ఊరక తెచ్చుకొననేల?

క. పలుకు పడినతనిఁ బాపం
బులు విడుచుం, బలికినతనిఁ బొందును బాపం
బులు- నోరు పాపము తనపై
నొలయింపఁగ నేల నింద యుడిగినఁ గాదే (శాంతి-5-553)

అప్రియమగు పల్కు :

సర్వ సామాన్యముగ సాధారణ మానవులందరు తమకు ప్రియముగ పలికెడి వారిని పెద్దగా మెచ్చుకొందురు. అప్రియమైన పలుకు, అది పథ్యమైన పలుకైనను వినుట కిష్టపడరు కావున ప్రతిభావంతులైన వారి విషయము నెరింగి పలుక కుందురు (సభా-2-191). దీనికి సంస్కృతవాణి ఇట్లున్నది. అప్రియమైన సత్యమును చెప్పవద్దనుచున్నది-

శ్లో. సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్య మప్రియమ్-

కౌరవులకడ మంత్రిగా నున్న విదురుడెన్ని అప్రియములైన సత్యములను వల్లించినాడో చెప్పనలవికాదు. ధృతరాష్ట్రునకు, దుర్యోధనునకు అప్రియములైన సత్యములు చెప్పినందుకు విదురునకు వచ్చినఫలిత మేమి? ధృతరాష్ట్రునిచే నొకమారు వెడలగొట్టబడి అరణ్యవాసము చేయుచున్న పాండవుల కడ విదురుడు చేరినాడు.[10] అంతకుమును పే సభలో జూదమాడవలదనియు, పాండవులకు వికృతి సేయుట సేమముగాదనియు నప్రియమైన సత్యము చెప్పినందులకు విదురుకు దుర్యోధనునిచే దూషింపబడినాడు.[11]

**పథ్యమగు పలుకు :-**

అప్రియమైన సత్యము పలుకరాదని విదురునకు తెలిసియు మరి ఎందు లకు అట్లు పల్కినాడు? ఆ విషయమును విదురుడే సభలో చెప్పినాడు-

తే. మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు
పథ్యమగు పల్కు ప్రియము లందు బలిమినైనఁ
బలుక వలయు మోమోటక యొలసి యట్టి
వాఁడు దగు సహాయుండు భూవల్లభునకు- (సభా-2-192)

హస్తినాపుర వల్లభుని మంత్రి విదురుడు. భూ వల్లభునికి మంత్రిగానుండి సహాయము చేయువాడు పలుకవలసిన పలుకులవి. పథ్యమగు పలుకులెపుడు దుర్మార్గులకు మొదట అప్రియముగానే యుండుననుటలో నెట్టి సందేహములేదు. మంత్రికి మోమోటము పనికిరాదు-మోమోట పడినచో మొదటికే మోసము వచ్చును. కౌరవులకు రాబోవు కీడును శంకించి విదురుడట్లు పలుకవలసిన వాడై నాడు. విదురుడు సపుత్రకుడైన వైచిత్రవీర్య కార్యమునకు హితము నభిల షించువాడు.

లోకమున మనకు ప్రియముగ పలుకువారు ఎందరైనను లభింతురేగాని, అప్రియమైనను పథ్యమైన పలుకు పల్కువారు ఒకరైనను లభింపరు గదా! (ఉద్యోగ-2-89). సభలందు ఎట్టి పల్కులు 'పలుకంగనగునో భారతము తెల్పు చున్నది. మనమునకు-1. ప్రియమును, 2. హితమును, 3. పథ్యము, 4. తథ్యము, 5. అమోఘము, 6. మధురము, 7. పరిమితము అను ఏడు గుణ ములు కలిగినట్లుగానే సభలందు పలుకవలెనట-అవి ధర్మయుతములు కావలెను-

క. మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగఁ బలుకు నది ధర్మయుతముగ సభలన్ (ఆది-3-205)

కర్ణుని రథసారథ్యమునకు దుర్యోధనుని కోరికపై శల్యుడు సమ్మతించి నాడు. యుద్ధమున కేగునపుడు శల్యుడు దుర్యోధనునితో నిట్లు చెప్పినాడు. నీను

లకు కొన్ని పలుకులు చేదుగా నుండవచ్చునేమోగాని, హితములైన కార్య నిర్వహణార్థము అట్టి పలుకులు ఓర్పుతో వినవలయునేగాని నీవును, కర్ణుడును అలుకపడరాదు. విజయునకు శల్యుని ఉద్దేశము తాను ధర్మరాజున కిచ్చిన మాట నిలబెట్టుకొనుటయే. ఏమైనను ఇది చక్కని సూక్తియే పరికించుడు-

క. వీనులకుం బలుకులు సే
దైనను జెప్పుదు హితంబులగు కార్యంబుల్
దానికి నోర్వంగ వలయుం
గాని యలుక వలదు నీకు గర్ణున కథిపా (కర్ణ-1-310)

మృదు భాషణములు పలుకువారి రూపములను సౌమ్యాకారములుగనే యుండును కాబోలు-ఆంగ్లమునందలి 'Face is the index of mind' అను సూక్తి ఈ మాటకు దగ్గరగానున్నది-సౌమ్యా కృతులుగాని వారల వాక్కులు శిక్షలు ఉపద్రవకారకములని భారతము చెప్పుచున్నది.(ఆది-2-41).

**వాఙ్నియతి :**

ప్రతి వ్యక్తికి వాఙ్నియతి అత్యంతావశ్యకము. వాఙ్నియతి ఎవరికిలేదో వారి దగ్గర సిరిఉండదు. సిరి ఎంత చంచలమైనను వాఙ్నియతి లేనిచోట మరింత చంచలమని భావము-

క. సిరి విడుచును బురుషుని విను
పురుషుడు సిరి దొరకు నిది యపూర్వమే? ఫలమూ
లరతుండై వాఙ్నియతిం
బొరసియునికి యట్టి చోటఁ బురుషున కమరున్ (శాంతి-1-31)

**పలుకు వినమి ఫలము :**

పథ్యము, తథ్యమునైన పలుకు ఎవరు వినరో వారు దాని ఫలమనుభవింపక తప్పదు. ఫలమనుభవించుచున్నపుడు ఆ పలుకులు గుర్తునకు వచ్చి పశ్చాత్తాపముతోడి పరితాపము కలుగును-దుర్యోధనుని వంటి దుర్మార్గుడు కడకు పశ్చాత్తప్త దగ్ధుడైనాడు. ఏకాదశాక్షౌహిణీశుడైన దుర్యోధనుడు వెనుక నెవ్వరు లేక ఒంటరివాడై గదా కలితభుజుడై హ్రదమున దాగ దలచి పోవు

చున్నాడు. అపత్యయమునందు దుర్యోధనునికి విదురుని మాటలు జ్ఞప్తికి వచ్చి సుయోధనుడు ఇట్లు వాపోయినాడు-

ఆ. అధిక మతి నృపాలు ననుజుఁడు సెప్పి న
ట్లు కట దానిఁ గొనన యనుచు శోక
తప్త చిత్తుఁడయ్యె దైవ మెవ్వరి నెట్లు
చేయఁ జాలదేమి సెప్పఁ గలదు? (శల్య-2-5)

సత్యాన్వేషణ :

సత్యమెట్లు ప్రాప్తించునో యని సత్యమును అన్వేషించవలయును. తపము కారణముగ సత్య శౌచాదులు ఒలయును (శాంతి-4-415). సత్పురుషుడు సత్యములు కాని మాటలనాడడు. పరమర్మ భేదులును. నయ విరహితములును. ధర్మకార్య విముఖములును, నిష్ఠురములు నగు పలుకులు సత్యములు కాకునికి సజ్జనులు వాని నాడరు (శాంతి-5-546). ప్రకృతులు ఏడింటిని నడపవలయును. దానికి ఆర్జవ సత్యములు రెండును తావలములు (శాంతి-2-169). మానినులు అసత్య భాషణలు, కావున వారియందు సత్యాన్వేషణము చేసి ప్రయోజనములేదు (ఆది-4-100): శీల కారణమున ధర్మము వెలయును. ధర్మము నుండి సత్యము దొరకొనును,సత్యమున వృత్తము చొప్పడును(శాంతి-3- 46) శౌర్యము, సత్యము, సత్కార్య జ్ఞానము, భక్తి తాత్పర్యముల కారణముగ సిరి సంపదలు లభించును.

సత్యమెట్లు లభించునో అని అన్వేషింప వలయును- సత్యము తపో లక్షణము, సత్యము ఊర్ధ్వగతి కారణము.

క. క్షమము, నహింసయు, సత్యము,
సమతము, నింద్రియ జయంబు. శమముఁ బరిత్యా
గమును. దపోలక్షణములు
క్రమమున నన్నియును నూర్ధ్వగతి కారణముల్
(అరణ్య-6-105)

సద్గుణము లన్నియు సత్యాకృతులు, అగుణములు నిత్యానుష్ఠిత నిర్మల యోగాభిముఖునకు నవి సులభములు (శాంత-1-418). సమత. దమము, అమత్సరము, అనసూయాదులు సత్యము యొక్క మూర్తులు-

క. సమతయు, దమముఁ దితిక్షయు
సమత్సరము హ్రీయు ధృతియు ననసూయార్య
త్వములు నహింసాదాన
క్షమాత్య జన సూనృతములు సత్యము మూర్తుల్
(శాంతి-3-417)

**సత్య పరిశీలనము :**

సత్యమును పరిశీలించినచో దాని ఔన్నత్యము అవగతమగును. క్షమమును, శౌచమును, సత్యమును సుధర్మములు. చిత్తమును వీనిపై లగింప వలయును. (శాంతి-4-299). ధర్మానుసరణము వలన చిత్తము కలకదేర్చును. ప్రసన్న చిత్తుడైనవాడు ఇంద్రియార్థ భంగులు రిత్తలని తెలిసి కొనును. తపోదమ సత్య శీలత పరిణతి నొందును. ఈ సత్యశీలము ప్రధానమైనదని మరువ రాదు (అరణ్య-5-77). విమలమైన చిత్తము-సత్యమును. అహింసయును తనకు తావలములుగా చేసికొనును. (అరణ్య-5-47). సత్యమును చక్కగా పరిశీలింపనగును- అర్జునుడు తన గాండీవము నింకొకరి కిమ్మని ఎవ్వరు చెప్పుదురో వాని శిరము గ్రక్కున వగుల ప్రేయుదునని చిన్ననాడు ప్రతిజ్ఞ చేసితినని కృష్ణునకు చెప్పి ధర్మరాజును చంపబోవును. సత్యరక్షణము సేయుటకై కర్మ సూక్ష్మ భంగి తెలిసికొనలేక పోవు చున్నావని కృష్ణుడు మరియు నిట్లు చెప్పినాడు —

క. విను పిన్నవాడు నీవీ
యనుచిత మగు వ్రతము పట్టి తది గాకయు పె
ట్టి నృతము సూనృతమును నీ
కని యెడు చందంబు బుధులు గయికొన రెందున్ (కర్ణ-3-75)

అనృతము,సూనృతము అర్జునుడు చూచిన రీతిని బుధులు కైకొనరనియు సూక్ష్మ పరిశీలనము గావింపవలయుననియు చెప్పినాడు కృష్ణుడు.

ప్రతి వ్యక్తికి హితాలాపము మంచిది.సత్యహితాలాపచతురత అర్థమైనది

(శాంతి-4-100). సత్యాలాపము సర్వ వర్ణ నియత గుణమని భారతము వాక్రుచ్చుచున్నది (శాంతి-7-221).

సత్యవ్రతము :

సత్య నిష్ఠ కలిగి సత్యవ్రతము నాచరించుట కత్తిమీద సాము వంటి కష్ట సాధ్యమైనది. మానవ సృష్టి జరిగి లక్షలాది సంవత్సరములు గడచినను సత్య వ్రతము నాచరించినవారు పదిమందిలేరు-కృతయుగమునందు హరిశ్చంద్రుడు వ్రతము పూనినవాడు. వేదములందు పేర్కొనబడిన హరిశ్చంద్రుని సత్యవ్రత మంత గొప్పది కాదేమోగాని పురాణ ప్రసిద్ధుడగు హరిశ్చంద్రుడుగ ప్రసిద్ధుడై నాడు- సత్యము కొరకు సర్వనాశనమైనను సహించి సత్యమునే పల్కువాడు సత్య హరిశ్చంద్రుడు. విశ్వామిత్రుని వంటి రాజర్షికూడ హరిశ్చంద్రునిచే అసత్యము ఆడించలేక పోవుట పురాణ ప్రసిద్ధము. ఆ పిమ్మట ఆడినమాట తప్పని వాడు బలి చక్రవర్తి. శుక్రాచార్యుడెంత చెప్పినను వినక వామనునకు దాన మీయ కడంగినాడేగాని ఆడినమాట తప్ప లేదు- పైగా సర్వనాశనము తనకు కల్గినను తనదు జిహ్వ తిరగనేరదనినాడు-

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూల నంబైన దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైన హరియైన నీరజ భవుండ భ్యాగతుండైన నా
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమాధీవర్య ! వేయేటికిన్[12]

మరియు 'సూనృతంబుకాని నుడియదు నాజిహ్వ- బొంకజాలనాకు బొంకు లేదు' అది బలి చక్రవర్తి సత్యవ్రతము. ఆ పిమ్మట పేర్కొనదగిన సత్యవచనుడు ధర్మరాజు-ధర్మరాజుని సత్యవ్రతము 'అశ్వత్థామ హతః- కుంజరః' కారణముగ నపహాస్యము పాలయినది. సత్యవ్రతము నడపుట చాలా కష్టము.

అనృతము దుఃఖాత్మకము. దీని నతిగించి సత్యమును పాటించవలెనన్న మోహవిఘాతి నియమములు నిష్ఠతో నాచరింప వలయును- సుధీ జనులే అట్లు ఆచరించి సత్యాలాపమునకై క్రమింతురు. (శాంతి-4-102) ఎవ్వడు సత్యము నెపుడు పల్కునో వానికి ధర్మగతి యగును [అరణ్య 5-24]. కంకుభట్టు వేష ధారియైన ధర్మరాజును నీవెవ్వరవు? అని విరాటుడు ప్రశ్నించినాడు. ధర్మజుడు

విక్కము చెప్పరాదు. సత్యము చెప్పినచో అజ్ఞాతవాస సమయభంగమగును. అసత్యము చెప్పిన అసత్య దోషమంటును. అట్టి విషమ పరిస్థితిలో ధర్మజుడు సత్యము నడుపుట ఎట్లు?

క. నానావిధ భూతమయము
మేనతి చంచలము మనము మెయికొని నిక్కం
బేనరునకుఁ జెల్లింపం
గానగు సత్యంబు నడపు క్రమ మెట్లుండెన్. (విరాట-1-193)

సత్యరక్షణము సలుపుటలో ఒక్కొక్కప్పుడు సంకట పరిస్థితి ఏర్పడును. సత్యము సలుపుటకై అర్జునుడు ధర్మరాజును సంహరింపబోయినాడు(తన గాండీవమును కృష్ణున కిమ్మని నందులకు). ధర్మపథముగాని సత్యమును రక్షింపవలదని కృష్ణుడు హితోక్తి ఇట్లు చెప్పినాడు.

ఆ. కర్మ సూక్ష్మ భంగి గానక యిమ్మెయి
సత్యరక్షణంబు సలుపు పొంతె
భ్రాత ధర్మపరుఁడు రాజిమ్మహాత్ముఁ జం
పఁగఁ దలఁచుట ధర్మపథము గాదు [కర్ణ 3-74]

సత్య మహిమ :

సత్యముయొక్క గొప్పతనము ప్రశంసనీయమైనది. సత్యమువే వల్కవానికి సాధింపరానిది లేదు. అమృతము మృత్యువు, సత్యము మోహము. శాంతిపరుడై సమ సుఖదుఃఖుండగుచు సత్యమునకు మృత్యువు గెలువవగువట(శాంతి 4-26) సత్యమహాత్మ్యమంతటిది.

సమస్త ధర్మములకును సత్యము కుదురు-యోగ, మోక్షాదులగు సత్ప్రథములన్నియు సత్యకార్యములు. అసత్యముకంటె మహాపాపము ఇంకొకటి లేదు. అశ్వమేధయాగ సహస్రముకంటె కూడ సత్యము గొప్పది.ఆ యాగసహస్రము సత్యముతో సీడుగావు (శాంతి 3-419) జలపరిపూర్ణములైన మాతులు మాటికంటె నొక భావి మేలు. ఎందువలననగా నూతినుండి నీరు పొందుడు తీసికొని

త్రాగుటకు నొక చేద, పాత్ర కావలయును. ఈ రెండు లేనిదే నూతిలోనున్న నీరు వలన ప్రయోజనమేమి? కావున నూరు నూతులు కంటె ఒక బావి మేలు. బావియనగా నిక్కడ దిగుడు బావి అని అర్థము చెప్పుకొనవలెను. దప్పిగొన్న బాటసారులు దిగుడు బావితో దిగి దప్పి తీర్చుకొందురు. బావులను త్రవ్వించునది పాంధుల దాహము తీర్చుట కొరకే. దాహము తీర్చిన వారికి పుణ్యము లభించును వంద బావులు త్రవ్వించి వందలాది ప్రజల దాహము తీర్చువారికి పుణ్యమెంత కలుగును? అంతటి పుణ్యముకంటె నొకయజ్ఞమొనర్చిన పుణ్యప్రాప్తి యెక్కువ అట. అందువలన మరి బావులు నూరిటికంటె నొక సత్క్రతువది మేలు. అట్టి శతక్రతువుల వలన ప్రయోజనమేమి? సుతుడు లేనిచో- 'పున్నామ్నోనరకాత్త్రాయత ఇతి పుత్రః' అనునది వేదవచనము[13]. కావున క్రతువు లొనర్చుటకంటె నొక సుతుడు మేలగుచున్నాడు. పుణ్యవర్తనుడగు పుత్రుడు ఉభయ వంశముల వారిని ఉద్ధరించునట. కాని అటువంటి పుత్ర శతకము కంటెను ఒక సూనృత వాక్యము శ్రేష్ఠమని సత్యమహిమను శకుంతల దుష్యంతుని సభలో వక్కాణించినది (ఆది 4-94).

మరియు వేయి అశ్వమేధ యాగ మహిమను ఒక సత్యమును తులనిడి తూయగా సత్యము ప్రక్కనే ములు సూపినది:

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దులనిడి తూపంగ సత్యము
వలననములుసూపు గౌరవంబున పేర్మిన్. (ఆది-4-95)

ఈ భావము పునరుక్తమగుటను గమనించునది. [చూడుము ఇంతకుమును పున్న పు. 116 శాంతి పర్వము 3-4-9]. పుణ్యప్రాప్తి కొరకు చేయు సర్వ తీర్థముల ఫలముకంటె సర్వవేదశాస్త్రములు చదివిన వచ్చు ఫలము సత్యముతో సరిరావు. ధర్మము లన్నిటిలోను గొప్పది సత్యమని ధర్మజ్ఞులైన వారే చెప్పు చున్నారు. ఇంక నెవ్వరు చెప్పినను విశ్వసింపక పోవచ్చునేమోగాని, ధర్మ శాస్త్ర నిపుణులైన ధర్మజ్ఞులే సత్యమహిమ నిట్లు కొనియాడుచున్నారు-

తే. సత్వతీర్థాభి గమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు (ఆది-4-96)

సాంగోపాంగములగు చతుర్వేదాధ్యయనముకంటె నొక సత్యము ఉన్నత మైనది. సత్యముతో నేవియు పోలవు. ముందు పేర్కొన్న పద్యమునందలి 'సర్వవేద సమధిగమము' ఇక్కడ మరల చెప్పబడుచున్నది. సందర్భమననుస రించి వేరువేరు సమయములందు కొన్ని విషయములు భారతమంతటి విశాలమైన గ్రంథమునందు పునరుక్తములు కాక తప్పదు-మరియు భారత మొకనాటి రచన గాదు. వ్యాసుడే సంవత్సర త్రయము రచించుటవలన పునరుక్తులుండవచ్చును. వ్యాస శిష్యులొకతరి, సూతుడు కాలాంతరమున గ్రంథాభివృద్ధికి కారకులగుటచే ప్రక్షిప్తములు, పునరుక్తులుండుట అత్యంత సహజము. పునరుక్తుల వలన ప్రయోజనము పాఠకుని చిత్తమునకు పట్టుటయే.

క. వగవఁగ సాంగోపాంగము
లగు నాలుగు వేదములయ్యు నధ్యయనము పో
ల్పఁగ నొక సత్యముతో నెన
యగునే యెవ్వియును బోలవటె సత్యంబున్ [అరణ్య 2-83]

పైన రెండు మార్లు పేర్కొనబడిన విషయమే మరల పునరుక్తమగు చున్నది. ఇంతక భేదముండ లోపును. అశ్వమేధయాగములు ఒక వేయి - ఒక సత్యములోని అర్థమును తుల్చిడి తూచగ రెండు సరిసమానములైనవని చెప్పు చున్నాడు.

తే. వాజిమేధముల్ వేయొక్క వలనఁ బెట్టి
యలఘు సత్యంబు దక్కటి వలనియందు
నిల్పి తులఁ దూఁపఁగా సత్యనిష్ఠలోని
యర్థమున కెత్తువచ్చె నయ్యశ్వరములు (అను-2-43)

ధర్మములందెల్ల అహింస పాటించుట ధర్మము. అదియు సత్యయుక్త

మైనచో గొప్పది- విబుధులైనవారు శ్రుతులు పఠించి సత్యమే అధికమని వ్రాక్కుచ్చుచున్నారు.

ఆ. వినుమహింస ధర్మవితతి కెల్లను మేటి
యదియు సత్యయుక్తమైన వెలయు
ననఘ శిష్ట చరితలందు సత్యమ కడు
నధికమనిరి శ్రుతుల నరసి బుధులు [అరణ్య 5-48]

సత్యముకంటెను మించినదిలేదు. సత్యకారణముగనే తపము, యజ్ఞము, వేదము, దాంతి, శాంతి అగును. సత్యమును వదలుటవలన నిర్మలమైన నిత్యానుష్ఠానములును నిష్ఫలములగుచున్నవి. కావున ఎట్టి పరిస్థితులలోను సత్యమార్గమునే అనుసరింపవలెను (శాంతి 4-151). సత్యమే బ్రహ్మము. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ'. సత్యమే తపము. సత్యము ప్రజలను సృజించును. సత్యమే లోకాధారము. సత్యము అనృతమును చంపి హితమొనర్చును. అసత్యమాడు బుద్ధివి, అసత్యమైన పలుకును చంపగలదు సత్యము. అట్లు చంపి సూనృతవాదికి హితమొనరించుచుండును.

క. సత్యమ బ్రహ్మము తపమును
సత్యమ ప్రజలను సృజించు సత్యమలోక
స్థిత్యాధానముఁ జేయును
సత్యం బనృతంబు సేఁత సంపి హితమగున్ (శాంతి-4-100)

సత్యమహిత సాధారణమైనది కాదు. పాపవర్తనుడైన బ్రాహ్మణునికంటె శూద్రుడు మేలు- ఎప్పుడు? సత్యము, శౌచము, ధర్మము ననుసరించువాడు శూద్రుడైనను నతడు సద్బ్రాహ్మణ సమానుడు. అనగా నిక్కడ విశితముగా పరికించిన మంచి-చెడ్డలు రెండు కులములగుచున్నవి. అందువలననే గురజాడ 'మంచిచెడ్డలు మనుజులందున-యెంచి చూడగ, రెండె కులములు మంచియన్నది మాలయైతే-మాలనేనగుదున్'[14] అనుటలోని ఆంతర్యము-భారతపద్యమును స్ఫురింపుచుడు.

ఆ. పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రుకంటె నీచతముండు
సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు
నతఁడు సద్ద్విజుండ యనిరి మునులు (అరణ్య-5-137)

'సత్యాన్నాస్తి పరోధర్మః' అనుట కలదు. సత్యముకంటె ఇతర గొప్ప ధర్మములేదు. అసత్యమాడు వానిని లోకము నిందించును. సూనృత వ్రతము వలన పెక్కు ఫలములు గలవు. కావున ఇక సత్యఫలమును సమీక్షింతము.

**సత్యఫలము :**

సత్యమాడు వానికి సుగతులు సుగమము లగుచున్నవి. సత్యహితోక్తులు పలుకు వారికి అనిమిషలోకము ప్రాప్తించును (అను 5-219). అనృతము లేమి అనగా సూనృతము నుపాసింపవలెను. తదుపాసనము వలన ఫలము చిరతరము వొనరించుట. సత్యవాది దీర్ఘకాలము బ్రతుకునట [అను 4-91]. సత్య ధర్మ రతులగు మానవులకు కార్యసిద్ధి వెనువెంటనే సిద్ధించును [కర్ణ 1-58]. మోహచ్యుతి కలుగవలెనన్న మానవుడు మదిలో సత్యము, శౌచము, శమము, దమము నిలుపవలెను.

క. విను తెవులుడుపఁగ భేషజ
మునకుం దలకొనిన చందమున మది సత్యం
బును శౌచము శమమును దమ
మును నెలకొలుపంగ వలయు మోహచ్యుతికిన్ (శాంతి-4-286)

అహింసయు, దానము, సత్యము, క్రోధ వర్జనము మున్నగు నివి ఉత్తమమైన ధర్మరాశి. ఇవి ధర్మమునకు పరసీమగా పరిగణింప నగును. వీనిని మన సునకులగింపవలయునట [అను 5-42].

**అసత్య ఫలము :**

అసత్యమాడు వారిని జనులు విశ్వసింపరు. అనృతోక్తులు పల్కు వారిని లోకము నిందించును. ఇచ్చెదనని చెప్పి ఈయకుండుట, కొనియెదనని చెప్పి తీసికొనక యుండుట రెండును అనృతములే (శాంతి-4-150). జీవిత సత్యము

లను చక్కని రసగుళికల వంటి పద్యములతో నందించిన ప్రజాకవి వేమన సత్యమాడు వానిని కీర్తించుచు, అసత్యమాడు వానినెట్లు నిందించినాడో చూడుడు-

ఆ. నిజము నాడు వాఁడు నిర్మలుండై యుండు
నిజము నాడు వాఁడె నీతి పరుఁడు
నిజము పల్కకున్న నీచ చండాలుండు
విశ్వదాభిరామ వినుర వేమ.

అనృతమాడు వారికి పాతకము కల్గును-ఆ పాతకము పోవలెనన్న అనృత మెవరితో నాడితిమో వారిని మరల సంప్రీతుని చేయగా నా పాపము హరించి పోవునట-అనృత ఫలము చెప్పుటయేగాక భారతము పాపపరిహారార్థమేమి కావింపవలయునో కూడ మనకు తెలియజేయుచున్నది. మహాభారతము సర్వ సంశయ నివృత్తికారి యని చెప్పుటలోని ఉద్దేశ మిదియే.

క. అనృతోప చార కలనం
బునఁ బుట్టిన పాతకంబు పోవుందానె
వ్వని నప చరించెఁదగ నా
తనిఁ బ్రీతుం జేయ ధర్మతత్త్వ ప్రవణా (శాంతి-1-310)

అసత్యోపచారము పాపమని బుధజనములు చెప్పుదురు. (శాంతి-1-93) ఘోరనరకమున కేగెడి వారి చిహ్నములు చెప్పుచు బొంకులగు పల్కులు పల్కుట ఒక చిహ్నముగా భారతము పేర్కొనినది.(అను-5-220)

సభకు వచ్చి ఎవ్వరైనను ఒక ధర్మసందేహ మడిగినపుడు, తెలిసినవారు దానికి సమాధానము చెప్పవలెను. తెలిసియు లోభ, లాభ, పక్షపాత బుద్ధులతో చెప్పక మిన్నకుండిరేని సభ్యులు అనృత దోషఫలము నందలి సగభాగమును పొందుదురట-

ఆ. సభకు వచ్చి ధర్మ సందేహ మడిగిన
నెఱిఁగి చెప్ప కుండిరేని సభ్యు
లనృత దోష ఫలము నందర్ధ మొందుదు
రనిరి ధర్మ వేదులైన మునులు (సభా-2-237)

కాని అనృత దోషఫలమెక్కడ పేర్కొనలేదు, కాని పాపము, నరక ప్రాప్తి మున్నగునవే ఫలములుగా నెరుగవలెను-

ఎవ్వరెవ్వరు అసత్యము పలుకరాదో తెల్పుచున్నారు-సాక్షియగువాడు, ధర్మమును దర్శించినవాడు, సాక్ష్యమును తెలిసినవారు అనృత మాడరాదు- అసత్యమాడినట్లయిన వారిని వరుణపాశ సహస్రము కట్టి బాధించునట-నేడు న్యాయస్థానములలో సాక్ష్యము చెప్పుచున్నవారికి ఈ విషయము నెరిగించిన బాగుగా నుండును-భారత గ్రంథముమీద చేయివైచి ప్రమాణము చేయించుటకు ప్రత్యామ్నాయముగ నిట్టి సూక్తులు చెప్పి హితము బోధించుట శ్రేష్ఠమగును గదా!

తే. సాక్షియును ధర్మదర్శియు సాక్ష్య విదులు
దప్పఁ గాదు తప్పినను నధర్మయుక్తి
వరుణ పాశ సహస్రంబు వానిఁ గట్టి
పాయునేఁటేఁట నొక్కొకఁ డాయతముగ (సభా-2-242)

అన్ని సందర్భము లందును సత్యమునే పలుకుట వలను పడదు-నీచులతో నిజము చెప్పరాదు, నిజమాడు వానిని లోకము నిందించునని వేమన తెల్పి యున్నాడు. సత్యవాది లోకప్రియుడు కాలేకపోవుచున్నాడీ దినములందు-ఈ రోజులలో అసత్యవాది లోకప్రియుడగు చున్నాడు-

## సత్యమాడరాని సందర్భములు :

సత్యము నాడరాని సందర్భములును కొన్నిగలవు-హింసాకరమగు సత్యమునాడరాదు-హింసాకరమగునని తెలియునపుడు అసత్యమాడినను అనృత ఫలము రాదు-హింసాకరమగు సత్యధర్మము కాదను దానికి దృష్టాంతముగా నొక చక్కని ఇతిహాసము భారతమునందలి కర్ణపర్వమున శ్రీకృష్ణుడు అర్జునునకు చెప్పినాడు-పెద్దయు వినికిలేని కౌశికుడను బ్రాహ్మణుడు సరిత్సంగమ పుణ్య క్షేత్రమున నివసించు చుండెను-సత్యమే పలుకుదునను వ్రతముతో తపమాచ రించుచుండెను-ఒకనాడు పాంధులు కొందరు ముచ్చులను చూచి వెరగంది

కౌశికునాశ్రమ ప్రాంతమున నున్న పొదలందు దూరిరి. బాటసారులను వెనుతగిలి వచ్చుచున్న చోరులు తపోధనుని వారెట దాగిరని ప్రశ్నించిరి? ఆ కౌశికుడు సత్యవిభాగ విధిజ్ఞుడు కాకపోవుటచేతను, తన కసత్యదోషము వాటిల్లునన్న సంశయము చేతను, పాంథులు గుల్మలతా గహనము చొచ్చినారని తెల్పెను. అంత దొంగలు వారిని చంపి, వారి ధనముగొనిపోయిరి. కాలాంతరమున ముని మరణించి తద్వచన దోషకారణముగ నరకప్రాప్తుడైనాడు. కావున హింసాకరమగు సత్యము ధర్మముగాదు. తొలుత వినిన దానినే పట్టి మూర్ఖుడు పెద్దలనడిగి తెలిసికొనక ప్రవర్తించి దుర్గతి పాలగును. (కర్ణ-3-78). హింసా కరమగు సత్యమాడరాదు-

సత్యము, అహింస రెండును ఉత్తమ ధర్మములే-అహింసతో సత్యమును రక్షింపనగును. అసత్యము పల్కుటయైనను హింస జరుగకుండ కాపాడవలెను-

క. సత్యంబు నహింసయు నను
సత్యుత్తమ ధర్మ యుగళ మందు నహింసన్
సత్యము గాచుట ధర్మ మ
సత్యమున నహింసఁగావఁ జను నండ్రు బుధుల్. (కర్ణ-3-73)

అసత్యమాడియైనను అహింసను రక్షింపవలెనని బుధులు చెప్పుచున్నారు- సత్యము పల్కుట సర్వ ధర్మములకు మేటి. అనృత మాడుట మిక్కిలి పాతకమే-కాని విశేషమైన యుక్తిగలదు-ఇతరుల ధనము, ప్రాణము నపహరింప దలచుచున్న పాతకులతో సూనృతము పల్కరాదు- పల్కినయెడల నది పాతకము-బొంకులు పలికి ఆ పాతకులను హింసించినను అది ధర్మమేయగును-సర్వ భూతములకు హితము సేయగోరుచు పలికెడి బొంకులెల్ల ధర్మములేయగును-భూత బాధకములగు పిక్కులు పాతక జనకములగును-భూతముల యొక్క దుష్ట శిష్టత్వములు అతి సూక్ష్మతా వేద్యములు గాన వానిని చక్కగా నెరుగవలెను-

సీ. సత్యంబు పల్కుట సర్వధర్మములకు
మిక్కిలి, యనృతంబు మేటిపాత
కము, తద్విశేషంబు గలదు చెప్పెద నొరు
నర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ

జూచు పాతకులతో సూనృతం బాడుట
పాపంబు, బొంకులు పలికి యట్టి
వారి హింసించుట పరధర్మమిది యొక్కం
డేల భూతములకు హితము సేయు

తే. బొంకు లెల్లను ధర్మముల్ భూత బాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము
భూతముల దుష్ట శిష్టత్వములు వివేక
సూక్ష్మతా వేద్యములు కానిఁ జూడవలయు. (శాంతి-3-45)

సర్వ భూతదయ కొరకు సత్యవాక్యము కంటె నుత్తమమైనది ధర్మవు-ఒరులకు నొప్పి కల్గించరాదు-ఒరులకు ఉపతాపమునేది కల్గించునో అది మిక్కిలి అధర్మము. కావున ఇతరులకు హాని కల్గించు సత్యమును పరిహరింప వగును. అసత్య దోషమురాదని పిండితార్థము-

ఆ. సర్వ భూతదయకు సత్యవాక్యమునకు
నుత్తమంబు ధర్మ వొండెఱుంగ
నొరుల నొప్పి కోడ కుపతాప మొనరించు
నదియ కడు నధర్మ మనిరి బుధులు. (ఆది-3-119)

సత్యా నత్యముల ధర్మ సూక్ష్మత :

కొన్ని సందర్భములందు పలికిన సత్యము అసత్య దోషమువలె పాతకమగును. అట్లే మఱి కొన్ని సందర్భములందు పలికిన అసత్యము సత్యము వలె సుగతి కల్గించును. కావున సత్యాసత్యముల పలుకుటలోని అంతర్యము సూక్ష్మముగా నుండును. ఆ ధర్మ సూక్ష్మత నెరిగిన మానవుడు సత్యా సత్యములను సమయ సందర్భములను గమనించి పలుకవలెనని భారతము బోధించుచున్నది-

ప్రాణహాని నచ్చు సందర్భమున, సర్వధనాపహరణము జరుగునపుడు నడిపెడి సత్యము అనృత తుల్యము, ఆసందర్భమువందు అనత్యము పలికినను నది సూనృత సమము. కావున ఇట్టి సమయ ధర్మము నెరింగి సత్యా సత్యము లందు నేది పలుకవలెనో తెలిసికొనునది.

ఆ. ప్రాణహాని వచ్చు పట్టున సర్వ ధ
నాపహార వేళయందు నడుపు
సత్య మనృతమం్రడు సత్యంబు సూనృత
మని పరిగ్రహింతు రార్య జనులు (కర్ణ-1-77)

మరియు సర్వ భూత హితముగా రి పలుకు బొంకుకూడ సత్యఫల ప్రదా యిని యగుచున్నది. సర్వ భూత భయాస్పదమైన ప్రభూతపు సత్యము బొంకుతో సమానము. ప్రాణాతురుడై నపుడు, పరిణయ విషయమునందు పల్కెడి అసత్యము సత్యాతిశయముగ పరిగణింపఁబడును. కావున ఇటువంటి ధర్మసూక్ష్మముల నెరింగి మానవుడు ప్రవర్తించిననో నార్యులు మెత్తురు-

ఉ. భూత హితంబుగాఁబలుకు బొంకును సత్యఫలంబు నిచ్చుఁ, ద
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్లు, ప్రా
ణాతురుఁడైనచోఁ బరిణయంబున యందును బల్కు బొంకు, స
త్యాతి శయంబ యండ్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్
(అరణ్య-3-62)

## అసత్యము పలుకనగు సందర్భములు :

అనృతము పలుకుట పాతకముగా మనవారు పరిగణించుచున్నారు-అస త్యము పలుకుట పాపమైనను కొన్ని సందర్భములందు పలికినను ఫరవాలేదు. అసత్య దోషము అంటదు. ప్రాణ రక్షణ సమయమున అసత్య వచన దోషము రాదు [ద్రోణ-5-310]. తన ప్రాణము రక్షించు కొనుటకుగాని, ఇతరుల ప్రాణమును రక్షించుటకు గాని వ్యక్తి అసత్యము పలికినను పలుక వచ్చును-

అనృతమును చెప్పుట పాతకమే, అయినను ఈ క్రింది సందర్భము లందు చెప్పనగును- 1. వనిత విషయమున, 2. వివాహ సమయమున, 3. పరి హాసము కొరకు, 4. ప్రాణాపాయము అనగా మృతివచ్చిన, 5. సర్వధనాప హరణము జరుగు సందర్భముననను అసత్యము పలికినచో నది పాపము కాదని భారతము వక్కాణించు చున్నది-

క. అనృతము పాతకమగు నై
నను వనితల యెడనుఁ బెండ్లి, నవ్వున, మృతి వ
చ్చిన, సర్వధనముఁ జెడు చో
వినుమది పాపంబు కాదు విమల చరిత్రా (శాంతి-3-438)

శుక్రుని వచనమునకు నొంతంబడిన యయాతి తానెట్లు బొంకనేర్తునని శర్మిష్ఠకు చెప్పినాడు- అంత శర్మిష్ఠ బొంకనగు సమయసందర్భముల నిట్లు ఏకరువు పెట్టినది- 1. ప్రాణము బోవుచున్నపుడు, 2. సర్వధనాపహరణమునందు, 3, వధగావచ్చిన, విప్రార్థమునందు, 4 వధూజన సంగమమునందు, 5. వివాహ సమయములందు బొంకవచ్చునట——

క. చను బొంకగఁ బ్రాణాత్యయ
మున, సర్వ ధనాపహరణమున, వధగావ
చ్చిన విప్రార్థమున, వధూ
జన సంగమమున, వివాహ సమయములందున్ [ఆది-3-178]

ఇంతకు ముందున్న పద్యమున నైదు సందర్భములు, చెప్పబడగా నీ పద్యము నందు నైదు సమయములు పేర్కొనబడినవి. మొదటి పద్యములో చెప్పిన 'నవ్వు' ఇక్కడ పృగ్గమము. కాని మరి ఒక వేరు సందర్భము ఇందు చెప్పబడినది, అది-వధగా వచ్చిన విప్రార్థమునందు;

కృష్ణద్వైపాయనుడు ధర్మరాజునకు శాంతి పర్వము నందు ధర్మాధర్మము లెరిగించుచు- పాపములవలె నుండి దూష్యములు కాని విషయములు చెప్పుచు వ్యాసభగవానుడిట్లు వాకుచ్చినాడు. ఎప్పుడు బొంక నగునో చెప్పుచున్నాడు- 1. ప్రాణహాని తప్పింప దలచి నపుడు, 2. పరిణయము నందు, 3, గురుజన కార్యార్థమునందు, 4. అంగనతో సంభాషించునపుడు, 5. సర్వధనము చెడునపుడు అని ఇక్కడ ఐదు సమయములనే పేర్కొనినాడు చూడుడు-

తే. ప్రాణహాని దప్పించుచోఁ బరిణయంబు
నందు, గురు జన కార్యార్థమయ్యు, నంగ
నా జనముతోడి సంభాషణమున, సర్వ
ధనముఁ జెడి యెడునెడ బొంకఁ జను నృపాల [శాంతి-1-289]

పై పద్యములన్నిటిలోను చెప్పబడిన సందర్భముల మొత్తము వరుసగానివి- 1. మృతి, 2. వధగావచ్చిన విప్రార్థనము, 3. ధనాపహరణము, 4. వివాహము, 5. వనిత, 6. నవ్వు 7. గురుజన కార్యార్థమున ఈ సమయములందు మాత్రమే అసత్యము పలుక నగును, ఈ సందర్భములందుగాక ఇకనే సమయములందు అసత్యము పల్కుచున్నారు. ప్రజలకు సంశయము కలుగవచ్చును- ఇది ఆ కాలమునాటి ప్రజల ప్రవృత్తి, ధర్మము-నేటి ప్రజలు అసత్యము పలుకట కలవాటు పడిపోయియున్నారు.సమయ సందర్భములక్కరలేదు. ప్రతి చిన్న విషయమునకు అవసరము లేకపోయినను అసత్యమును చెప్పుచున్నారు- అసత్యము పలుకరాదను నియమ నిష్ఠలతో నున్నపుడు పైన పేర్కొన్న సందర్భములందు అసత్యము పల్కనగును. సత్య నిష్ఠలేనివారు అసత్యనిష్ఠ కలవారు సత్య మహిమ నెరుగలేరు-సత్య వాక్పరి పాలన కావించు ప్రజలు నేడు అరుదుగ లభింతురు—

అసత్యము పలుకు సందర్భములను ఆంధ్ర మహాభారతమునందు నన్నయ ఒక మారు (ఆది-1-178)' తిక్కన రెండు మార్లు (శాంతి-1-199, 3-438) చక్కని పద్యములలో విరచించినను నవి సామాన్యులకు కంఠస్థము కాలేక పోయినవి. జానపదులకు సహితము నోటికి వచ్చిన పద్యము పోతన మహా భాగవతములోని ఈ క్రిందిది—

ఆ. వారి జాక్షులందు వైవాహికము లందుఁ
ప్రాణ విత్తమాన భంగమందుఁ
జకిత గోకులాగ్ర జన్మ రక్షణమందు
బొంక వచ్చు నఘము పొందదధిప (8-584)

శుక్రాచార్యుడు బలి చక్రవర్తితో చెప్పిన మాటలివి- శుక్రనీతి ఇది- 1. వారిజాక్షులందు. 2. వివాహములందు. 3. ప్రాణభంగము. 4, విత్త భంగము, 5. మాన భంగము, 6. గో రక్షణము, 7. విప్ర రక్షణము.భారతమున చెప్పనివి ఇందు రెండు క్రొత్తవి పేర్కొనబడినవి-మానభంగము, గో రక్షణము-భారతమునందు ఏడు చెప్పబడినవి. భాగవతమునందును ఏడు చెప్పబడినవి. మొత్తము సందర్భములు ఈ రెంటితో కలిపి తొమ్మిది యగుటను పాఠకులు గమనింప వలయును—

## సత్య స్థాపన :

సత్యమే పర(బహ్మము, విమల సత్యమునకు బొంకు కారణముగ (ప్రమాదము వాటిల్లినపుడు దక్షులైనవారు ఉపేక్షింపరాదు-అట్లు ఉపేక్ష చేసినచో నది ఆ ఉపేక్షించిన వారికే చేటు కల్గించును—సత్యస్థాపన అంతిమమున జరుగును. సత్య శుభదాయకమైన దైవము ఉండనే ఉన్నది. ఆ దైవమే. ఆ పర(బహ్మమే సత్యరక్షణము గావించి సత్యమును స్థాపించును. (ఉద్యోగ-3-27౨). సారపు ధర్మమనుటలోను, విమల సత్యమనుటలోను ఒక రహస్యమున్నది. ధర్మమునకు సారమను విశేషణము, సత్యమునకు విమలమను విశేషణము వేయుటలోని రహస్యమిది-స్థూలదృష్టికి, సూక్ష్మదృష్టికి కూడ నిలబడుధర్మము సారపు ధర్మము. నిలబడు సత్యము విమల సత్యము, కొన్ని ధర్మము లధర్మములు గను, కొన్ని అధర్మములు ధర్మములుగను సూక్ష్మదృష్టికి అవగత మగుటను గమనింపవలెను-అట్లే కొన్ని సత్యములు-అసత్యములుగను, మరికొన్ని అసత్యములు-సత్యములుగను పరిగణింపబడుటను పైన పేర్కొనిన ఆయా సందర్భములందు గమనింపదగును-

సత్యము సర్వ (శ్రేయము, సత్యవైశిష్ట్యము నెరింగిన అనంతరము దాన మహిమమును కొనియాడుట యుక్తము. దానమును కొనియాడు సూక్తులను పరికింతము.

### జ్ఞాపికలు

| | | |
|---|---|---|
| 1. స్వర్గారోహణ పర్వము | | -80 |
| 2. అందే | | -80 |
| 3. ఆంధ్ర మహా భాగవతము | -(ప్రథమస్కంధము | 1-22 |
| 4. ఆంధ్ర మహా భారతము | ఆది-3-9, 10, 11 | |
| 5. అందే. శల్యపర్వము | | 2-249 |
| 6. ఉద్యోగ పర్వము | | 2-241 |
| 7. అందే. | | 3-259 |
| 8. ఉద్యోగ పర్వము | | 2-44 |
| 9. సభా పర్వము | | 2-17 |
| 10. అరణ్య పర్వము | | 1-54 |
| 11. సభా పర్వము | | 2-188 |
| 12. ఆంధ్ర మహా భాగవతము | | 8-593 |
| 13. ఆది పర్వము | | 4-89 |
| 14. ముత్యాల సరాలు | —లవణరాజు కల | పు-19 |

# దాన మహిమము

ఈ లోకమునందలి మానవులకు ధనముపైనున్న ఆశ మరి ఏ ఇతర వస్తువుపైన నుండదు. ధన సంపాదనమునకై మానవుడు పడరాని పాట్లు పడుచున్నాడు. కష్టసాధ్యమైన ధనమును ఇతరులకు దానము చేయుట సామాన్య మానవులకు సాధ్యపడదు—ధనాశ గలవారికి దానము చేయుట యనగా ప్రాణము పోయినట్లుండును.

సీ. దాన మూర్జిత ఫలదంబర్థ సాధ్యమై
పరగుటఁగరము దుష్కరము నదియు
నరులకు నధిప ప్రాణంబుల కంటెను
రూపింప నర్థంబు తీపు వినవె
యుగ్రంబులైన యాయుధముల మొనలపై
నఱుకుట యంభోధి దఱిసి చనుట
కృషి పాశుపాల్య సంక్లేశంబు నొందుట
యడవులఁ గొండల నిడుమ వడుట

ఆ. నవసి పొవసి యనుదినము ఁబర ప్రేష్యులై
యునికి దలఁప నర్థమునకె చూవె
యట్టి దుఃఖ లబ్ధమైన యయ్యర్థంబు
విడుచుటె వ్యిథమునఁ గడిఁది గాదె (అరణ్య-6-111)

అందువలననే ఈ లోకమున దానము చేయువారు చాల అరుదుగ దర్శన మిచ్చుచున్నారు. దానమిచ్చు పుణ్యాత్ముడు లక్షమందిలో నొకడు కనబడుటలేదు. ఏ మాత్రము కీర్తికాంక్షలేక దానము చేయువారు ఉన్నారా? యను సందేహము పొడముచున్నది. మరి గుప్తదానము చేయు వారెందరున్నారు? నేడు మన మెరిగిన దాతలు చాలవరకు పేరు ప్రతిష్ఠలు సంపాదించుటకై బిరుదులు తెచ్చుకొనుటకై దానముచేయుచున్నారే కాని వారు చేయుచున్న గుప్తదానములు లేవనియే చెప్పనగును.

**దాత జనన సంశయము :**

నిష్కాములై, నిష్ఫలార్థులై దానము చేయు దాతలు కోటిమందిలో నొకడైన ఉన్నాడా? నిష్కామముతో చేయుదానము ఉత్కృష్టమైనది, అట్టి ఉదాత్తులైన దాతలు జన్మించినారా? లేదా? యనుసంశయము వ్యాస భగవానునికే గల్గినది. గీర్వాణ భారతవాణి దాత విషయమున నిట్లు అనుమానించినది—

శ్లో. "శతేషు జాయతే శూరః - సహస్రేషు చ పండితః
వక్తా దశ సహస్రేషు - దాతా భవతి వానవా"

నూరుమందిలో నొక శూరుడు జనింపవచ్చును. వేయిమందిలో నొక పండితుడు ఉదయింప వచ్చును, పదివేల మందిలో నొక మహావక్త జన్మింపనగును, కాని దాత అనువాడు ఉదయించినాడా? లేదా? అని సందేహము, అనగా నిజమైన దాతలు అంత అరుదుగా లభించు చున్నారని భావము.

**మహాదాతలు :**

రామాయణము, మహాభారతము, అష్టాదశ పురాణములు శోధించినను మహాదాతలైన పుణ్య పురుషులు పట్టుమని పదిమంది మనకు లభించుటలేదు. పురాణ కాలమునందు పేర్కొనదగిన దాతలు— 1. దధీచి, 2. శిబి, 3. బలి చక్రవర్తి, 4. జీమూత వాహనుడు, 5. రంతిదేవుడు, 6. సక్తుప్రస్థుడు, 7. దానకర్ణుడు. ఈ సందర్భమునందు ఆ మహాదాతలు ఒనరించిన దాన విశేషములను సంగ్రహముగనైనను కొని యాడుట అప్రస్తుత ప్రసంగము కానేరదని భావించుచు నవి ఇట ప్రసక్తములైనవని విన్నపము.

దధీచి తపశ్శాలియగు నొకముని. దేవతలు తమ అస్త్ర శస్త్రములను దానవుల బారినుండి రక్షించు కొనుటకై దధీచి కిచ్చి దాయుమని చెప్పిరి. పెద్ద కాలము దేవతలు దధీచి దగ్గరనుండి వారి అస్త్రములను గ్రహింపరైరి— అంత దధీచి అభిమంత్రించి దేవతల అస్త్రములను పానము చేసెను తర్వాత దేవతలు వచ్చి తమ అస్త్రములనడిగిరి. తన శరీరము నందలి ఎముకలను 'అస్త్రముల శక్తి పట్టిన దనియు, తన ఎముకలను తీసికొనవలసినదిగా దధీచి కోరెను, బ్రాహ్మణహత్యా దోషమునకు దేవతలు అంగీకరింపరైరి. అంత దధీచి యోగా

గ్నిని కల్పించుకొని నిజ శరీరమును విడువ దలచి తన ఎముకలను అస్త్రము లుగా గైకొనుడని దేవతలకు చెప్పి యోగాగ్ని దహను డాయెను. దధీచి ఎము కల నుండియే బ్రహ్మదేవుడు చక్రము, వజ్రాయుధము మున్నగు అస్త్రములను తయారు చేయించెనని చెప్పుదురు.[1] ఆత్మాహుతినే గావించి, దేవతల కార్యా ర్థమై ప్రాణత్యాగము చేసిన అత్యుత్తమదాత దధీచి.

ఉశీనరుని పుత్ర రత్నమగు శిబి చక్రవర్తి అజాత శత్రుడై, ప్రజలను కన్న బిడ్డలవలె పోషించుచు ఉశీనర దేశమును పరిపాలించెను. పరమ శివ భక్తునికి అక్షయ ధనము లొసగెను. శిబి గంగాతీరమున ననేక అశ్వమేధ యాగము లొనర్చిన పుణ్యజీవి. శిబి చక్రవర్తి శరణాగత రక్షణకు సుప్రసిద్ధు డాయెను. ఈతని పరీక్షించుటకై అగ్ని భట్టారకుడు పావురము కాగా, దేవేం ద్రుడు డేగ అయ్యెను, పావురము డేగచే తరమబడుచు యాగ మొనర్చు చున్న శిబిని శరణువేడెను. శిబి పావురమును రక్షింప దలచి డేగతో నీ కాహార ముగ వేరొక దానిని కోరు కొనుము ఇచ్చెద ననెను. డేగ శిబి శరీర మాంస మును పావురమంత బరువును కోరు కొనెను. అంత పావురమును త్రాసు నందిడి శిబి నిజశరీర మాంసమును తొడనుండి కోసి త్రాసులో వేయించెను. ఎంత కోసినను శిబి శరీర మాంసము పావురముతో తూగలేదు. అయినను శిబి శరీరమును కోయించుచునే యుండెను. ఆ మహాత్యాగమునకు అచ్చెరువంది డేగ- పావురములు నిజ శరీరములను ధరించి శిబిని కీర్తించి, అతని శరీరమును యథా రీతి గావించిరి.[2] ఒక పావురమును రక్షించుటకై, బాధనోర్చి నిజశరీర మాంసమునే దానమిచ్చిన మరియొక మహాదాత శిబి చక్రవర్తి.

బలిచక్రవర్తి ప్రహ్లాదుని మనుమడు- విరోచనుని పుత్రుడు- బలి దేవత లను జయించి త్రిలోకాధిపతి యయ్యెను. దేవతలు బలి చక్రవర్తిని సంహరింప వలసినదని బ్రహ్మదేవుని వేడుకొనిరి-ఆది నారాయణుడే బలిని నిర్మూలించునని బ్రహ్మ చెప్పెను-శ్రీమన్నారాయణుడు వామనావతారము ధరించెను. బలి చక్రవర్తి కడకేగుదెంచి, వామనుడు మూడడుగుల నేల దానమిమ్మని అడిగెను. బలిదాన మున కియ్యకొనెను- మంత్రియగు శుక్రాచార్యుడు వచ్చినవాడు అసాధారణు డని గ్రహించి, దానమీయ వలదని బలికి చెప్పెను- బలి ఇచ్చిన మాట తప్ప నని చెప్పి, వచ్చినవాడు విష్ణువని తెలిసియు దాన మిచ్చినాడు, వామనుడు ఒక

కాలితో భూమిని, మరియొక పాదముతో నాకాశమును కప్పి, మూడవ పాద మెక్కడ నుంచవలయునని బలినడిగెను. అంత బలి తన శిరముపైనుంచుమని కోరెను. వామనుడు బలిదాన మహిమను గొని యాతని సంహరింపక, సుతల లోకమున కధిపతి గావించెను.[3] తనకు ప్రాణనష్టమని తెలిసి తెలిసి, వామనుని కిచ్చిన మాట తప్పరాదని, మూడడుగులనేల దానమిచ్చిన బలి చక్రవర్తి దానము ప్రశంసనీయమైనది.

జీమూత వాహనుడు పితృసేవా తత్పరుడైన ఒక విద్యాధరుడు. మలయవతిని పరిణయమాడెను. వివాహానంతర మొకనాడు బావమరదితో వాహ్యాళి కేగెను. ఒకచోట పాముల ఎముకల గుట్టను గాంచెను. దానికి కారణమేమని జీమూతవాహనుడు తన బావమరది నడిగెను–గరుత్మంతుడు వాసుకితో గావించిన నియమానుసారము, అనుదినము నొక పాము నాహారముగ గొనగా నేర్పడిన పాముల ఎముకల గుట్టలని చెప్పెను. ఆనాటి గరుత్మంతుని ఆహారార్థమై శంఖచూడుడను నాగము ఏతెంచెను. రోదించుచునతని తల్లియు నక్కడ కేతెంచెను. 'పరోపకారార్థ మిదం శరీరమ్'ను భావము గల జీమూతవాహనుడు శంఖచూడునకు బదులుగ తానే వధ్యశిలయెక్కి గరుడునకాహారమయ్యెను. గరుత్మంతుడేమియు నెరుగక జీమూత వాహనుని భక్షించుచుండెను. ఇంతలో శంఖచూడుడు వచ్చి తన్ను భక్షింపుమని గరుడుని కోరెను. తన్ను భక్షింపుమని జీమూతవాహనుడు కోరుచుండెను. గరుత్మంతుడు అప్పుడు తెలిసికొని ఇంద్రు నడిగి అమృతమును కురిపించి జీమూతవాహనుని రక్షించెను. పరోపకారార్థమై తన శరీరమునే త్యాగ మొనర్చిన జీమూతవాహనుని బుద్ధి ఎరిగి గరుత్మంతుడిక పాములను హింసించనని మాట ఇచ్చెను.[4] ఈ త్యాగము మరి మరి కొనియాడ దగినది.

రంతిదేవుడు యాగమొనర్చుచుండగ గోవులు ఏతెంచి తమ్ము వేల్చుమని అతని ప్రార్థించెను. రంతిదేవుడు సందేహించుచుండగ నా గోవులు 'జ్ఞానముచే ఈ కార్యమునకు తమ్ము పంపిరని' తెలుపగ నియ్యకొని ఆ గోవులను వేల్చెను అతని అధ్వరమున వేల్చబడిన గోవులు గోలోకమునకు పోయెను. వేల్చబడని గోవులు భూలోకముననే యుండెను.[5] రంతిదేవుడు తన సంపద నంతను అడిగిన వారికి భేదనక ఇచ్చుటచే నతడు పేదవాడై, తినుటకు కూడ

లేనివాడాయెను. ఒకమారు రంతిదేవుడు నలువది దినములుపవాసము చేసి, తర్వాత కొంచెము అన్నమును సంపాదించి ఆరగించబోయెను. ఇంతలో నొక అతిథి వచ్చెను. రంతిదేవుడు ఆహారములోని సగభాగము నిచ్చెను. పిమ్మట ఆరగింప బోయెను—అంతనొక చండాలుడు, కుక్క ఏతెంచెను. మిగిలిన అన్నమును వానికిచ్చెను. అతని భూతదయకు, దానమునకు మెచ్చి బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షమై తామే అతనిని పరీక్షించుటకై అట్లు వచ్చితిమని చెప్పి వరము వేడుకొమ్మనిరి. విష్ణుభక్తిని ప్రసాదింపుడని రంతిదేవుడు కోరుకొనినాడు. అన్న దాన మొనరించిన రంతిదేవుని త్యాగము మిక్కిలి ప్రశంసార్హము.6

ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమునందు రోషకామ విరహితుడగు నొక బ్రాహ్మణుడు వసించుచుండెను. అతడు ఉంఛవృత్తితో జీవించుచుండువాడు. అతని భార్యయు, తనయుడు, కోడలును, సహచరత్వమున నుండిరి. అనావృష్టి కారణముగ నందు పెద్ద కరవు ఏర్పడెను-వారు నలుగురు తృణధాన్యమును ఏరి కొనివచ్చి జీవించుచుండిరి. ఒకనాడు ఉదయము నుండి సాయంకాలమువరకు వెదకి తెచ్చిన దానితో నొక కుంచెడు పేలపిండి తయారుచేసికొని, సమముగా విభాగించుకొని ఆరగించబోయిరి. అంతనొక ధరామరుడు అతిథిగా నేతెంచెను. అతని పాదములు కడగి సేవించిరి. తన ఆకలి ఆసక్తుతో తీర్చవలసినదని అతిథి బ్రాహ్మణుడు వారిని కోరెను-తండ్రి తన పాలిచ్చెను, కాని అతిథి బ్రాహ్మణుడది ఆరగించి సంతృప్తుడు కాలేదు. ఏమి చేయవలయునని ఆ తండ్రి తలంచుచుండ నతని భార్య తన పాలిచ్చెను. తృప్తుడుకాని బ్రాహ్మణునకు తర్వాత తనయుడు, కోడలు తమ తమ భాగముల కూడ నిచ్చిరి. అది అంతయు తిని తృప్తుడైన ఆ అతిథి బ్రాహ్మణుడు తాను ధర్ముడనని తెల్పి, వారి ఆతిథ్య దానమును కొనియాడెను, పిమ్మట బ్రహ్మ విమానమురాగా నదియెక్కి ఆ నలువురు బ్రహ్మలోకమున కేగిరి. ఆకలితోనుండి భుజింప బోవునపుడు వచ్చిన అతిథికి ఆహారమును దానము గావించిన సక్తుప్రస్థుడు ప్రశంసార్హుడు. ధర్మరాజు అశ్వమేధ యాగమున నిచ్చిన భూరి దక్షిణల కంటెను సక్తు ప్రస్థుని దాన ధర్మము గొప్పదని నకులము కీర్తించెను.7

కుంతీ తనయుడగు కర్ణుడు దానకర్ణుడుగ ప్రకీర్తితుడు. భూసురులు వేడిన ప్రాణములైనను ఇచ్చు దాన కర్ణునకు కవచము, బ్రాహ్మణ వేషమున ఇంద్రుడు వచ్చి

కవచ కుండలములను వేడుననియు, అవి ఇచ్చి ప్రాణసంకటము తెచ్చికొనకు మనియు సూర్యుడు కర్ణునితో చెప్పెను. అయినను సూర్యుని మాట మన్నింపక, కర్ణుడు విప్రవేషధారియైన ఇంద్రునకు తన కవచకుండలములనిచ్చెను. శరీరము నుండి ఒలిచి, కవచకుండలముల నింద్రున కిచ్చి, అర్జునుని చేతిలో మరణము నొందిన కర్ణుని కీర్తి దశదిశల వ్యాపించినది. అతడు దానకర్ణుడైనాడు-

యశః కాయులు

రాజులు నశించిరి. రాజ్యములు అంతరించినవి. కాని దధీచి, శిబి, బలి, కర్ణాదులు యశః కాయులైరి, ఆ చంద్రార్కముగ వారి దాన మహిమము కీర్తింపబడుచునే యుండును. దానఫలము కీర్తి. కీర్తి పుణ్యగతినిచ్చును. కీర్తి తల్లివోలె రక్షించును, ఆయురైశ్వర్యములభివృద్ధి గావించును. కీర్తి విహీనుడు జీవచ్ఛవము. [అరణ్య-7-294], కీర్తిలేని వానికివి జీవనము నిరర్థకమైనది, నిత్యమైన ధనము నిర్మల కీర్తియే (ఆది-8-31). కీర్తి ఉన్నంత కాలము ఆ వ్యక్తి జీవించు చున్నట్లు పరిగణింప నగును- కీర్తిగలవాడే పూజనీయుడు-

క. ఇలఁ గీర్తి యెంత కాలము
గలిగి ప్రవర్తిల్లె నంత కాలంబును ని
త్యుల కారె కీర్తిగల పు
ణ్యులు కీర్తి విహీనుఁ డెందునుం బూజ్యుండే (ఆది-8-32)

దాత గుణములు :

దాత పరమ సౌమ్యుడై యుండును. దానలక్షణము పూర్వజన్మ సంస్కార కారణమున నబ్బును- దాతకు అంతః కరణ శుద్ధి ఆవశ్యకము, ప్రియము పొంపిరి వోవ దానము చేయవలెను. అయిష్టముతో గాని, చేయవలసి వందులకు చింతించుచు గాని దానమొనరింపరాదు. సంతోషముతో చేయు దానమే పరమోత్కృష్టమైనది-

క. పరుషత్వము లేకంతః
కరణంబున శుద్ధి చాలఁ గలిగి ప్రియము
పొంపిరి వోవఁ జేఁత దానము
పరమోత్కృష్టము పద్మపత్ర నిభాక్షీ. [అను-5-212]

ధనవంతులయ్యును కొందరికి దానగుణముండదు. అట్టివారు దానమపే క్షించినను నియ్య జాలరు. దానమీయని వానిపై నద్దలకు అలుక పనికిరాదు. 'ఒడఁబడి యీని వానియెడ నుల్లమునందుఁ గృతఘ్నతంగడుఁ జెడుగగు'నని (శాంతి-౩-67) భారతము బోధించుచున్నది-

దానమడిగిన వానికి అడిగినంత దానమిచ్చుట అన్ని దానములందును ఉత్తమమైనది (అను-౨-335) దాతయగువాడు ఎదిరివారి కోరిక తీరునట్లుగ దానమీయవలెను. దానమడుగువానికి పరమతృప్తి కల్గునట్లుగ దానమిచ్చుట అర్థ్యధర్మము. 'ఇచ్చుచోఁ గడమ వడంగ నీ కెదిరి కాంక్షితముల్ మదిముట్టఁ దీర్తురు' (అరణ్య-౧-228). దానమడిగిన వారికి పూర్ణ సంతృప్తి కల్గునట్లుగ దాన మిచ్చుట లెస్స.

## దానమిచ్చి తీసుకొనుట :

దానమిచ్చి తీసికొనరాదు. ఒకసారి దానమిచ్చిన దానిని మరి ఏ కారణముననైన తిరిగి పరిగ్రహింపరాదు- భూమి దానమిచ్చిన వాడు దానికి కాచికుడుప వలెను. ప్రాఙ్నన్నయ యుగ శాసనములలో నీ విషయము ప్రతి శాసనము నందును మనము గ్రహింప నగును- దాన రక్షకునకు పుణ్యమును, దానమునకు వక్రము వచ్చువారికి పంచ మహా పాతకములగు ననియు నాశాసనములందు పెక్కుమార్లు చెప్పబడుటను మనము గమనించియే యున్నాము. దాన మిచ్చిన భూమిని తిరిగి తీసికొని నట్లైనచో వాని వంశము వారు ఇరువదొక్క తరముల వారు నరక వాసులగుదురట—

ఆ. పూర్వ దత్తమైన భూమి నెవ్వఁడు పుచ్చి
కొనియె నతఁడు తనదు కులమువారి
నిరువ దొక్క తరము నరక వాసులఁ జేయు
దాను నడుము కాఁగ ధర్మనిరత [అను 2-365]

## న్యాయాన్యాయార్జిత ధనదానము :

అన్యాయార్జితమైన ధనమును దాన మొసంగరాదు- అట్టి ధనమును దాన మిచ్చినను దానఫలము లభింపదు- మానవునకు అంతఃకరణ శుద్ధి కావలెను- ధర్మ మార్గము ననుసరించి ధనమును సంపాదింపవలెను- అట్టి న్యాయార్జిత

మైన ధనమును దానమిచ్చిన యెడల పుణ్యప్రాప్తి కలుగును-కావున న్యాయార్జిత విత్తమునే దాన మీయ నగునుగాని. అన్యాయార్జితమైన విత్తమును దానమీయ రాదు. అన్యాయార్జితమైన ధనమెంతయో ఇచ్చుటకంటె, న్యాయార్జిత విత్తమొక ఇంచుకయైనను చాలును అది ఫలము నిచ్చును-

శా. అన్యాయార్జితమైన విత్తమునఁ జేయంబూను దానంబు మూ
ర్ఖ న్యాయంబది, దానఁ జేసి ఫల పాకంబేమియున్ లేదు. యు
క్త న్యాయార్జిత మించుకంత యయినం గాలంబు దేశంబు న
మ్మాన్యంబై తగఁ బాత్ర యోగమున సౌమ్యంబై ఫలించుం
దుదిన్ (అరణ్య 6--112)

ధర్మా ధర్మ లబ్ధ దానము :

ధర్మ లబ్ధమైన దానిని దానమిచ్చుటను గురించి, అధర్మ లబ్ధమైన దానిని దానమున కుపయోగించుటను గురించి శాంతి పర్వమున నిట్లున్నది. పై భావమునకు నిది దగ్గరగా నున్నది. దాదాపు పునరుక్తియనియే చెప్పనగును. ధర్మమార్గాను సారముగ సంపాదించిన ధనము పాతికయైనను మిక్కిలి ఫలము నిచ్చును- అట్లుగాక పాపకారునిచే సంచితమైన ధనము కోటియైనను నది నిష్ఫలమని దానశాస్త్ర కోవిదులు చెప్పు చున్నారట-

ఆ. ధర్మలబ్ధ మైన ధనము పాతిక యేని
బహుళ ఫలము నిచ్చుఁ బాపవృత్త్యు
పార్జితంబు కోటియైన నిష్ఫల మండ్రు
దాన శాస్త్ర విదులు మానవేంద్ర [శాంతి 5-192]

అయాచక దానము :

అడిగినను దానమీయని వారు గలరే గాని, అడుగకయే దానమిచ్చువారు ఈ పుడమి నరుదుగనైన నుందురా? అని సంశయము- అడిగిన వారికి దానమిచ్చుటకంటెను. అడుగని వారికి అవసరము నెరింగి దానమిచ్చుట మిక్కిలి ఉత్తమము- వేడుట చావుతో సమానమని దానకోవిదులు చెప్పుచున్నారు. అందువలననే ద్రోణుడు- 'వేఁడుటెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనున్

వేఁడికోలు చితంబని అని భావించుటలోని అంతర్యమిదియే-వేడగా నంత కంటెను పెద్ద చావట-అర్థి ప్రార్థనను పూర్ణము చేయువాడ వానిని, తన్నును దయారతి రక్షించువాడగును-

చ. అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁ గాఁగ నెఱింగి
క్కుడు ఫలమిచ్చు దాన విధికోవిద వేఁడుట చావు,
బడుటది పెద్దచావు, తగుప్రార్థన పూర్ణము చేయు
యడిగినవానిఁ దన్నును దయారతిఁ గావఁగఁ జాలు
[అ

## పాత్రతా పాత్రతలు :

దానమిచ్చువాడు పాత్రతా పాత్రతల నెరింగి దాన మీయనగు పాత్రుడెవరు? అపాత్రుడెవరు? భారతమిట్లు ఎరిగించుచున్నది. పాత్రున కిచ్చునది. అభిముఖులై వచ్చిన అశార్థులను తనువ వలఁ రులను వేడకుండుట లెన్స.

క. ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగ నొరువేఁడ కుండునది, యభిముఖులై
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వ భూతప్రీతిన్ [అ

అపాత్ర దానము ధనవ్యయమే గాని ప్రయోజన ముండదు దానము ధనమునకు రక్ష యగును. (శాంతి-2-399).

మరియు పాత్రము మేలై యొనరించు దానము ఇచ్చువానికి, వానికి భువన ద్వితయ రంజకతను కలిగించును. అది సౌఖ్యమగు నుండ నగును. (శాంతి-1-334). దానవిధి అసమీచీనమైన యెడల నట. పాత్రమైనచో నది ఇచ్చునతనికి పరిగ్రహించు నతనికి మేలు (శాంతి-1-183). అపాత్రునికిచ్చిన ఈని వృథ పోవును, కావునపా దానమీయ వలెను, [శాంతి-1-33].

న్యాయ మార్గమున లభ్యమైన ధనమును పాత్రత ఎరిగి దానమీఁ

అట్టి ధనమును అపాత్రుల కిచ్చినచో కీడగును. అంతియేకాదు పాత్రులకు పెట్టక పోయినను కీడు సంభవించును. అనగా పాత్రుల కీయవలెను- అపాత్రుల కీయరాదు-

ఆ. పాడితప్ప కుండఁ బడయు సొమ్ములకు న
పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్టకునికి యనఁగ నెట్టన రెండు వి
ధములఁ గీడు తొడరు ధరణినాథ [ఉద్యోగ-2-43]

యోగ్యుడైన విప్రుడు పాత్రుడు. అట్టి విప్రుడు తృప్తి బొందగా దేవతా సమూహము కూడ సంతృప్తి నొందునట, మరియు ముని సమూహము, పితృజన సమాజము కూడ తృప్తులగుదురట. కావున విశిష్టుడైన బ్రాహ్మణుని వెదకి తెచ్చి దానమీయనగును. తత్త్వవేదులు, వేదాంత సారము నెరిగిన బ్రాహ్మణులకు దానమిచ్చుట సహస్రగుణమగును. వేదాధ్యయనాదులు గావించినవాడు, ప్రజ్ఞావంతుడు, శీలవంతుడునగు బ్రాహ్మణునకు దానమిచ్చిన నది వంశ విస్తారకమగును-

తే. తత్త్వ విదులైన బ్రాహ్మణోత్తములకీగి
విను సహస్ర గుణంబగు విశ్రుత శ్రు
తంబుఁ బ్రజ్ఞయు శీల వృత్తములుఁ గలుఁగు
వారి కిచ్చుట వంశ విస్తారకంబు [అను-2-50]

దైవ పిత్యములగు దానములకు ఎవరు పాత్రులో తెలియచేయుచున్నాడు భోజనార్థులను సంతృప్తి పరచువాడు. తస్కరులచే నపహరింపబడి ధనార్థియైన వాడు, వ్రతనిర్వహణార్థము ధనము వాంఛించు నతడు, తల్లిదండ్రులను విజ దారసుతోదర పోషణార్థము తపించు వాడును, మహావ్యాధిగ్రస్తుడై జీవితముపై నాసతోనున్నవాడు, నిపిష్టా పుడైన భూమిసురుడును, భిక్ష వృత్తిచే జీవించు వాడు మున్నగు వారందరు దైవ పిత్యములకు అతిశయము కల్గ పాత్రలగుదురు [అను-2-60]. మరియు పాత్రుడెవరో? అపాత్రుడెవరో పరిచ్ఛేదించి భారత మిట్లు సంశయ విచ్ఛేదము కల్గించుచున్నది. అపాత్రులెవరనగా-పరిహాసకుడు,

దుర్జనుడు, అంగవిహీనుడు, మదించినవాడు, చోరుడు, ఉన్మత్తుడు, నపుంసకుడు, చెడ్డమాటలాడు వాడు, కులహీనుడు, వేదాధ్యయనము లేనివాడు, నిజ వృత్తిని త్యజించినవాడు, దుర్వృత్తి గలవాడు. మరి పాత్రులెవరనగా-అతి దీనుడు, విపత్తులో నున్నవాడునట, ఇంచుక గమనించుడు-

సీ. పాడియు నాడియు బ్రదుకు వారలఁ బరి
హీనకు దుర్జను నంగ హీను
మత్తుని ముచ్చు నున్మత్తు నపుంసకుఁ
జెనఁటి మాటలఁ దేల్చు మనుజుఁ గులము
చాలమి వేదంబు చదువమి నిజవృత్తి
హాని దుర్వృత్తి గలట్టివాని
దాన పాత్రంబులుగా నియ్య కొనరు పె
ద్దలు; దీనుఁడును విపద్బాధితుండు

తే. సిగి కర్జులు దయ పేర్మి నిచ్చుచోట
నైన నవగుణ మెక్కుడై కానఁ బడిన
నిందితాత్ముల కిచ్చుట నిష్ఫలంబు
పాత్ర నిశ్చయ మిట్టిది పౌర వేంద్ర (శాంతి-'-1.9)

అపాత్రదానము నిష్ఫలము. అపాత్ర భూతుడగుట ఎఱుగక దానమిచ్చిన యెడల నది కీడొనరింపదు [శాంతి-1-702], అపాత్రవు టివి ఒప్పదని మద్ర పతియగు శల్యుడు రాధేయునకు చెప్పినాడు-రిక్తవారికి ఉజ్జ్వలార్థములు కొందని ఈయరాదు- ఇచ్చిన యెడల జనము నవ్వుదురు-మిక్కలి ధనమున్నవాడు ఆ ధనమును సద్వ్యయ మొనరింప నగునే గాని అపాత్రదానము మాత్రము చేయ రాదట (కర్ణ-2-33). పాడి తప్పకుండ ఆర్జించిన సొమ్ములను అపాత్రముల కిచ్చిన యెడల కీడు అగును (ఉద్యోగ-2-43) అపాత్ర జనులకిచ్చుట ఎట్టి నిష్ఫలమైనదనగా-షండునకు సుందరినిచ్చునట్లు, బూడిదలో నేయిపోసినట్లు, ఓటి కుండలో నీరు పోసినట్లుండును-

తే. షండునకు బిడ్డ నిచ్చిన చందమొందు,
బూదిలో నేయి వేల్చుటఁ బోలు, నోటి
కడవ నీళ్లలు పెటిన కరణియగు న
పాత్ర జనులకుఁ బెట్టుట పౌరవేంద్ర. (శాంతి-1-33)

దాన విశేషములు :

దానము పెక్కు రీతుల గావింప నగును-భూమి, స్వర్ణము, గోవు, ధనము, అన్నము, పానీయము, తిలదానము, ధూపదీపదానము, కడకు ప్రాణదానము చేయవచ్చును-విప్ర వరునకు నిచ్చు నీ దానములు రెండు లోకములందును సౌఖ్య కారి యగును-పై దానములే గాక-కన్య, గృహము, అంబరము, శయనము, ఆసనము, వాహనాదులైన దానములును గలవు-

ఆ. కన్య భూమి గృహము కనక మన్నము జల
మంబరంబు శయన మాసనంబు
వాహనంబు విప్ర వరునకు నీగి లో
కములు రెంట సౌఖ్య కారి యగుడు (అను-2-333)

మరి కొన్ని ఇతర దాన విశేషములును గలవు. విప్రులకు ఛత్రమిచ్చి నచో పుత్ర లాభము కల్గును-శకటము నిచ్చుట సకల కామ్యదానసమమైనది. చెప్పులు దానమిచ్చిన వాడు కంటక ప్రాయులైన శత్రు వీరుల సాధించునట-

ఆ. ఛత్త్రి మిచ్చి కాంచుఁ బుత్త్రుల బురుషుండు,
సకల కామ్యదాన సమము శకటు
మిచ్చుట నఘ చెప్పు లిచ్చినఁ గంటకు
లైన రిపుల ద్రొక్కి యతఁడు తిరుగు (అను-2-189)

ఇక వివిధ దానవిశేషములను వాని ఫలములను తెలిసి కొందము-

ప్రాణ దానము :

దానము లన్నిటను ప్రాణదాన మధికమైనది-సకల తీర్థక్షేత్ర సందర్శన మును, సర్వవ్రత విధానము నాచరించుటయును, సర్వదాన ధర్మాదులైన క్రియ లొనరించుటయును ప్రాణదానముతో సరిసమానములు గావు (ఆది-3-134).

ప్రాణము రక్షించినవారికి ప్రియము సేసెదననుట ఏ మాత్రమును గొప్పకాదు (సభా-1-1). ప్రాణదానము, ప్రాణరక్షణ ఈ రెండును అత్యుత్తమ కర్మలు-

భూ దానము :

భూదానము ఉత్తమమైనది, అనుమానమైనది, భూదాన మొనగునపుడు భూతములన్నియు సంతోషపడునట-

క. వసుదా యని యైన వసుధా
నొసగినతనిఁ దన్ని తన్ని యొసఁగె ననుచు సం
తస పడు భూతము లన్నియు
నన మానము భూమి దాన మమరాధీశా (అను-2-363)

రాజులు పాపములకు ఆకరములగుటచే నాపాప పరిహారార్థము భూదాన మొసగవలెను. పాపనివారణార్ధము అధిక భూమి దానమును భూపాలకు లొనరించుటయే గాని వేరుమార్గము వారికికలేదట (అను-2-364). బహుయాగకర్త, పరమశాంతుడునైన విప్రుని పిలిచియైనను భూమిని దానమిచ్చుట భూదానములలో ఉత్తమము (అను-2-354). భూదాన ఫలము పెక్కు విధముల లభించును. రణరంగమున నిహతులైనవారు, గురుపూజ యొనర్చువారు, మరి ఎట్టి పుణ్యాత్మకులైన వారు కూడ భూమి దానకర్తను పోలరని పరమమునీంద్రులవాక్కు (అను-2-356). అర్హుడైన విప్రునకు గో చర్మ మాత్రమైన భూమిని దానమిచ్చినచో పోనటువంటి పాపములుండవు. అను-2-355). ఇతర దానములన్నిటికంటెను భూమి దానము వినుత ఫలములనొసంగును, ఒక్క భూదానము చేతనే కనకము, రజతము, అంబరము, ధాన్యము, నవరత్నములు దానమిచ్చి నంత ఫలము ప్రాప్తించునట పరికించుడు-

క. కనకము రజతము వస్త్రం
బును ధాన్యము వివిధ రత్నములు నిచ్చిన య
వ్వినుత ఫలంబుల నెల్లను
గను నుత్తమ భూమిదాన కర్త నరేంద్రా. [అను-2-351]

ధానము అన్నిటికిని భూదానము ఎక్కువ. ఎందువలననగా సమస్త

ధాన్యములును, అనేక వస్త్ర ధన రత్నాదులను భూమి వలననే మనకు లభించు చున్నవి కాబట్టి (అను-2-350). భూమి సకల రత్నగర్భ-అనేక గుర్రములు, ఏనుగులు, వనితా సహస్రములు, సర్వ రత్నము లిచ్చినట్టి ఫలవిశేషము భూ దాన కర్తకు లభించును-అందువలన భూమి దానము సర్వశ్రేష్ఠమని చెప్పు చున్నారు-

ఆ. భూమి రత్న గర్భ పురుహూత యటుగానఁ
గలుగు భూమి దాన కర్త యైన
వాని కశ్వహస్తి వనితాది సర్వ ర
త్నములు నిచ్చు నట్టి యమిత ఫలము (అను-2-362)

భూమి చిరకాలముండును, భూమికి ఎంత ఆయువు గలదో అంతకాలము భూదానకర్త సుఖములననుభవించు చుండును కొంచెము భూమిని ఇచ్చిన వాడు కూడ నమరలోకమునందు పెద్ద భూమిని ఏలగల్గుచున్నాడు. రాజైనవాడు రణ మృతి నొందినను సరి, లేక పోయినచో భూదాన ఫల పుణ్యమునైన పొందిన మంచిది- భూ దానము బ్రహ్మహత్యాది పాతకముల నన్నిటిని హరించునట్టిది. పాపాత్ముడైన వాని నుండియు భూదానము గ్రహింపవగును-వానిచే పాపము రాదు-భూదానము అశ్వమేధయాగ సమానమని పరమ మునులు వాక్రుచ్చు చున్నారు.

సీ. భూమి కెంతాయువు భూదాన కర్తయు
నంత కాలను సుఖ మందు చుండు
నమరలోకంబున నల్పమైనను భూమి
యిచ్చిన బహుభూమి ఏలునతడు
రాజు విశేషించి రణమృతి యొందెను
భూదాన కర్తృత్వ పుణ్య మొందెఁ
బడయంగ వలయు ఁబాపగఁ నోపు బ్రహ్మ హ
త్యాది పాతకములనైన భూమి

తే. దాన మెంత పాపాత్మచే నైన భూమి
గొనిన 'గల్మష మొందదు వినుము మహిత
మైన భూదాన విధియును నశ్వమేధ
యాగమును సదృశంబు లంద్రాది మునులు (అను-2-352)

ధనదానము :

'స్వ భార్యాయాంచ యౌవనమ'ని నిజదార పరులైన బ్రాహ్మణులకు ధన దానమీయదగును. సంతత యజనరతులైనవారు, కామరోషహంతలు నగు సద్బ్రాహ్మణులకు ధనదానమిచ్చుట యుల్లోకములందును పూజ్యమగు నందురు (అను-2-341)-

సువర్ణ దానము :

సువర్ణదానంబు మహిమ ప్రశంసనీయము-సువర్ణము అగ్నిమయము. దేవతలు అగ్నిమయతనతిశయిల్లు చున్నారు-కాబట్టి సువర్ణదాన మొనరించుట దేవతలనీగి యట్లలని శ్రుతులు బోధించుచున్నవి. (అను-3-138). సువర్ణము అసదృశమైనది-సువర్ణము పావనతాస్పదము. సువర్ణమును భక్తితో విప్రావళి కొసగు దాతలకు పావనత ప్రాప్తించుటలో నాశ్చర్యమేమి గలదు? (అను-3-139). స్వర్ణము ఆయుఃప్రదమని హరిశ్చంద్రుడు చెప్పెనట. స్వర్ణము పావన మైనది. ఇది దాతకు భావశుద్ధి నొనరించును-సువ్రతమైన బుద్ధితో, కడు నిష్ఠ ముతో దీని నొసగు దాతలు కడుంగడు కీర్తనీయులు గదా!

తే. కనక మాయుః ప్రదంబు పావనము భావ
శుద్ధి నొనరించు దాతకు సువ్రతమున
వేడ్కతో దాని నిచ్చుట వేలు పొగడ
నేలయనియె హరిశ్చంద్రుఁ డిద్ధ తేజ. [అను-2-382]

పావనమైన సువర్ణము వంశావలికి తనకు నిర్మలాత్మత నొసంగును (అను-3-135)

గోదానము :

గోవుల మహిమ కొనియాడ తగినది-తపస్సంపన్నుల కంటె గోవులు శ్రేష్ఠములు-సత్య లోకమునందు గోవులు సోమ నంగ తత్వమున సంచరించును.

హోమ నిర్వహణమున కవసరమగు పాలు, పెరుగు, నేయిని గోవులిచ్చు చున్నవి. గోవుల చర్మము, శృంగములు, వాలము, రోమ చయము. శకృన్మూత్రములు పనికి వచ్చు చున్నవి. శీతా తపవ్యధను గోవులు పొందవు గావున నవి అతిభరమైన పనులు చేయగలవు. గోవును బ్రాహ్మణుని ఏక తత్త్వమే (అను-2-397). గోవులను విప్రుల కిచ్చినచో విషమపు గతులు కల్గవు. అత్యంత సుఖముతో నేరిని పొందరాని ఉత్తమ లోక గతులు గోదాన కర్తకు లభ్యములు. గోవుల పాలు అమృత తుల్యములు. కావున గోవునిచ్చిన వానికి అమృతము దానమిచ్చినంత ఫలము ప్రాప్తించును.

క. గోవుల పాలమృతం బని
దేవేంద్రుఁడు చెప్పెఁగాన ధీరత్వ నిధీ
గోవు నొసఁగ నమృతము స
ద్భావంబున నిచ్చినట్టి ఫలమొదఁ గూడున్ [అను-2-399]

గోవులు ప్రాణములని సమస్త మునులు చెప్పుచున్నారు కావున ప్రాణ దాన కర్తకగు నట్టి మంచి ఫలము గోదాన కర్తను లభించుచున్నది. (అను-2-400). గోదానము చేయునపుడు కడు జాగరూకత వహింపనగును. గోవును క్రూరుడైన వానికి, నాస్తికునకు నిచ్చిన యెడల పరమ దుఃఖము గోదాన కర్తకు ప్రాప్తించును. మరియు నట్లిచ్చినచో గోదాత నరకలోకమునకు పోవును-కాబట్టి గోదానమును పాత్రుడైన వానికే ఈయ దగును.

క. క్రూరునకు నాస్తికునకు దు
రారంభున కిచ్చినం బరమ దుఃఖమునుం
గూరును గోవది దాతను
నారకిఁ జేయుం బరీక్షణము కడు వలయున్ (అను-2-401)

గోప్రదాన విదులైన వారెవరును గొడ్డు టావునీయరు అట్లే బడుగు ఆవును ఈయరాదు. రోగగ్రస్తమైన గోవును దానమీయరాదు. క్షేపువదలిన దానిని అనగా పాలు ఇచ్చుట అపివేసిన గోవును ఇచ్చుట మంచిదికాదు. ఏదైన గుణలోపమున్న గోవును,ఆయాసపడియున్న గోవును దానమిచ్చుటవలన ప్రయోజనము లేదు. (అను-2-402) గోవుల సమూహమును దానమిచ్చు

వానికి పుణ్యలోకము లేమిగొప్ప? మోక్షమే సిద్ధించును కాబట్టి గోదాన ఫలము అత్యద్భుతమైనది-

క. విను పుణ్య లోకముల కా
వనఘా విప్రులకు గో చయంబుల బెక్కి-
చ్చిన నవి దాతకు మోక్షం
బును జేయఁగఁ జాలు నండ్రు పూర్వాచార్యుల్ (అను-2-403)

పృథివి, సరస్వతి, గోవు ఈ మూడును దానవిధికి నొక్క ఎత్తులు వీనినిబోలిన దాతవ్యములు లేవు (అను-2-411), గోవు అగ్నిమయము,మరియు నమృతమయము. హోమ విధాన శ్రీవాహినికి గోవు ఆవశ్యకము. స్వర్గలోక ప్రాప్తికి గోదానము నిచ్చెన వంటిది. గోవు అమరులకైనను పూజింప దగినది (అను-2-277). గోవులలో కెల్ల శ్రేష్ఠమైన గోవు కపిల- ఆ కపిల గోవును సద్బ్రాహ్మణున కిచ్చినచో దానములందెల్లనది లెస్సది. పాపమునది పరిహరించి-దాతకు పుణ్యము నొసగును-

క. మొదవులలో నెల్లఁ గపిల
మొదవు వరిష్ఠంబు రాజముఖ్య నియతిమై
నది విప్రున కిచ్చుటరయఁ
దుది దానంబులకు, నఘకు దురితాటవులన్ (అను-1-19)

గోదాన పాత్రు లెవరనగా- శిష్యుడు, వ్రతశీలుడు, పాపరహితుడు, శాంతుడు, దాంతుడు, క్రోధరహితుడు (అను-3-14). గోదానమిచ్చినాతడు చంద్రలోకవసన సౌఖ్యము నొందును. (అను-3-15). గోదానము సుపథగమైనది- దాతకు మేలు ఆపాదించును. గోదానము విపథగతమైనచోనది దురితోత్పాదకమగును. (అను-2-416).

గోవు పవిత్రము, గోవే మహ విర్జన్మ భూమి- ఎల్ల భూతములకు నాధారభూతము గోవు, అతుల లక్ష్మికి మూలమైనది గోమాత- అత్యంత దురితమనెడి జలనిధి దాటుటకు గోవు ఓడవంటిది, నిర్జన సద్మమునకు గోవు నిచ్చెనవంటిది- సురలకు గోవు మనికి పట్టు (అను-3-28), 'ఎంత చెట్టుకంత గాలి' అనురీతి ఎంత గోసంపదయున్న అంతంత దానములు చేసినచో నవి యన్నియు సమ

ఫలములే యగుచున్నవి- ఎట్లనగా పది గోవులున్నవాడు- ఒకగోవును, నూరు గోవులున్నవాడు- పది గోవులను, వేయి గోవులున్నవాడు- నూరుగోవులను దానమిచ్చినచో నందరికి గోదాన ఫలము సమముగానే లభ్యమగునట-

క. పదియును నూఱును వేయును
మొదవులు గలవారు దానములు గా నొకటిం
బదియింటి నూటి నిచ్చిన
నదియు నదియు సదృశ మగు ఫలము నెడన్, (అను-2-30)

పేద కుంచెడు ధాన్య మిచ్చినను, ధనికుడు కోటి ఇచ్చినను, తత్తత్ఫలములు మాత్రము సమమే (అను-5-211), గోదాన ఫలము పూర్వముగా కొనియాడబడినది. కొమ్ములకు బంగారు తాపడముచేసి, ధౌత వస్త్రముల నలంకరించి, గోవును సదక్షిణ పూర్వకముగ నొక బ్రాహ్మణున కిచ్చినచో దాత ఆ గోవున కెన్నిరోమములు గలవో అన్ని సంవత్సరములు త్రిదశలోకమున వసించును-అతని వంశీయులేడు తరములవారు సుగతిని పొందుదురట-

సీ. కాంస్యోప దోహయుఁ గాంచన చారు శృం
గయు, ధవళాంబర కలితయును, స
దక్షిణయును నయి తగు గోవుఁ బాత్రత్వ
భవ్య విప్రునకు సద్భక్తి తోడ
నిచ్చిన దానికి నెన్ని రోమము లన్ని
దివ్య వత్సరములుఁ ద్రిదశ లోక
మున వసింతురు కులంబున యేడు తరముల
జనములను గతికి ననుతు రధిప . . . (అను-2-333

అన్నదానము :

అన్నదానము విశేషమైనది, పరమ మునులును, దేవతలును అన్నమును నుతింతురు. లోకతంత్ర విధి క్రతువులు మిగిలిన సర్వమును అన్నము వలన నడచును. గావున అన్నము చాల విశిష్టమైనది (అను-2-369). అన్నదానముతో సమానమగు దానము ఎందును ఎన్నడును లేదు-అన్నదాన ఫలము పుణ్యతమము-

ఆ. అన్నదాన సదృశ మగు దాన మెందు నె
న్నఁడును లేదు కావునను విధేయ
మన్న దాన మధిక యత్న పోతంబుగాఁ
బూని దాని చేఁత పుణ్యతమము. (అను-2-370)

ప్రాణాధారమైనది అన్నము. ఇంటిలోని వారికి పెట్టక పోయినను పరవా లేదు గాని, అతిథికి అన్నము పెట్టుట అధిక పుణ్యమునిచ్చును. ఆకలితోనున్న శ్రాంతుని, వృద్ధుని, తాపసోత్తముని, బాలుని, వికలాంగుడైన వానిని, వనితను తృప్తిని గావింప కుండుట ధర్మముగాదు-అన్నము నర్థించువారిని గని గృహ మేధికి కోపము తగదు-ఆకొని వచ్చిన మాలవానిని గాని, చివరకు శ్వానమును గాని ప్రియమొనర్చి ఆహారము పెట్టదగును. మనుజులను దేవ పితృ సమూహ మును అన్నదాన విధులను ఆదరముగ నాచరింపవలెను. దీనితో మిగిలిన వేవియు సమానములు కాజాలవు (అను-2-371). అన్నదాత-అర్థిని కులగోత్రము లడుగ రాదు-విద్యావంతుడా? యని పరికింపదగదు-విప్రుడు అడిగినంతనే అన్నమిడుట కరు లెన్న (అను-2-372). కల్పాదియందు బ్రహ్మదేవుడు అన్నము అమృత సమానమని కీర్తించెను-అన్నహానిచే నధిక బలుడును దుర్బలుడగు చున్నాడు. అన్న భుక్తివలననే శరీరము నందలి సకల ధాతువృద్ధి యగుచున్నది- కావున జనమునకు అన్నమడిగి నంతనే ఈయదగును-

తే. అజుఁడు కల్పాది యందన్న మమృత మనియె
నన్నహాని బలాధికునైన దుర్బ
లాత్ముఁగాఁ జేయుఁ గావున నన్న భుక్తి
సకల ధాతు వృద్ధికి నయి జనము గోరు (అను-2-374)

అన్నదాతకు స్వర్గలోకము నందలి సుఖములను భోక్తవ్యములు, స్వర్లో కము నందు దాతకు మణిమయములైన శయ్యాసనములు, మనోజ్ఞమైన మాల్యా లేపనములు, అమృత భోజనము దక్కును- మరియు మహనీయ మహిళాను భవము అవగా అప్సరసల సుఖము లభ్యమగును (అను-2-376). దానముల కారణముగ దాత కృత పాపములు నశించిపోవును. పాపములను నాశనము చేయుటకు అన్ని దానముల కంటెను అన్నదానము ఉత్తమమైనదని మునులు వక్కాణించుచున్నారు.

క. విను దానంబుల (బాపము
లనఘా చెడు దానములకు నన్నిటికిని న
ఙ్జన సేవ్య యన్న దానము
మునులధికం బం(డ్రు పాపములఁ బాపునెడన్. (అను-4-270)

వి(ప్రులకు న్యాయార్జితమైన అన్నమును అవశ్యము పెట్టగ వలయును-దీని కారణముగ పాయని పాపములే ఉండవు (అను-4-271). ఆకలిగొన్న (బాహ్మణులను తృప్తి పరచుటకై దాత అన్నమును (ప్రయత్నించియైనను తెచ్చి పెట్టవచ్చును. అట్టి దాత స్వర్గలోకములందలి పురుషులచే నర్చనీయుడగుచు నక్కడ వెలుగొందుచుండును.

తే. తివిరి యేనియు నన్నంబు తెచ్చి శిథిలు
లైన వి(ప్రుల యాఁకలి నపహరించు
పురుషుఁ డూర్ధ్వ లోకంబుల పురుషవరుల
కర్చ నీయుఁడై వెలుఁగుచు నందయుండు. (అను-4-272)

వైశ్యుడు కష్టపడి వాణిజ్య విధులందు సంపాదించిన అన్నమును దాన మొనరించి ఏ సుగతిని పడయుచున్నాడో అట్టిసుగతిని శూ(ద్రుడును బొందనగును. ఎట్లనగా పగలంతయు 'చచ్చి-చెడి సంపాదించిన అన్నమును చతుర్థ కులజులు అర్థులకు పెట్టినచో దివము కాంతురు (అను-2-?74). సాయం సంధ్య ముగి యక మునుపే అన్నపానదానములు యథావిధిని తన ఓపినంత చేసి, తర్వాత భుజించిన యెడలవది ఉత్తమ ధర్మమగును. ఇట్టి ఉన్నతమైన ధర్మమింకొకటి కానరాదు-

తే. దివము వంధ్యంబు గాకుండఁ దివిరి యన్న
పాన దానంబు లొదవిన భంగిఁ జేసి
మఱి భుజించుటఁ బోలెడు మహిత ధర్మ
కార్య మొండొకఁ డెందునుఁ గలదె యరయ [అను-2-?1?]

ధర్మము లన్నిటిలోను ముఖ్యమైనది అన్నదానమని ఎరుంగుము. కొన్ని విషయములు ధానములందు పునరుక్తమగుటను ఛదువరులు గమనింప నగును.

**పానీయ దానము :**

అన్నము తర్వాత మానవునకు చాల అవసరమైనది జలము. జలము లేనిదే కొన్ని రోజులు కూడ బ్రదుకజాలరు. పానీయదానము ఉత్తమదానమని మనువు చెప్పినాడు. మనువు అఖిల ధర్మతత్త్వ రహస్య సంవేదియై మనుస్మృతిని సంతరించి అందు దానములలో నుత్తమమైనది పానీయ దానమని చెప్పెను. (అను-2-383)- కాబట్టి నూతులు, బావులు, చెరువులు, కొలకులు త్రవ్వించవలయును. ఇవి అన్నియు పావనము లగుటచే త్రవ్వించిన వానికి పుణ్యలోకముల నవి ప్రసాదించును. (అను-2-384). ఈ విషయ మెరింగిన వారగుట చేతనే మొన్న మొన్నటి వరకు మనవారు వేసవికాలమునందు పాంథుల దాహ నివారణార్థము మార్గమధ్యమున నూతులు బావులు త్రవ్వించుచుండిరి- త్రవ్వించిన ధర్మకర్తల పేరులను అక్కడ రాతిపలకపై చెక్కియుండుటను గమనింపనగును- మరియు వేసవికాలమునందు మార్గ మధ్యమున జలపూర్ణములగు కుండలను పెట్టి కూలికి మనుషులను పెట్టి పాంథులకు దాహము నిచ్చుట నేటికిని మనము పల్లె ప్రాంతము లందు చూడనగును- కొన్ని బావులు, చెరువులు వ్యక్తుల పేరున పిలువ బడుటయు మనము చూచుచునే యున్నాము-బావులు మానవులకుపయోగపడుచుండగా చెరువులు మానవులకే కాక, తిర్యక్కులకు నుపయోగపడుచున్నవి- జలపక్షులు, జల జంతువులు, పశువులు వేసవి కాలమునందు దాహమును తీర్చుకొనునది ఆ చెరువులందే కదా! ఎవ్వడు కావించిన జలాశయము లందు గోవులు నీరు సేవించుచున్నవో అతని వంశము వారందరికి ఊర్ధ్వలోక ప్రాప్తిని ప్రసాదించునని భారతము వక్కాణించుచున్నది-

క. అనఘా యెవ్వని కావిం
చిన సలిలాశయము నందుఁ జెల్లఁగుచు గోవుల్
గొను నీరాతని వంశం
బున కవి కావించు నూర్ధ్వ భువన ప్రాప్తిన్ [అను-2-385]

మరియు నెవరు కావించిన జలాశయము నందు మానవులు మందు వేసవిలో అవభృథ స్నానము ఆచరించుచున్నారో అతడు స్వర్గలోక ప్రాప్తుడగునే గాని, దుర్గతులపాలు కాడు, ఈ విషయము తెరింగిన వారు కావుననే మనదేశ

మునందు జనపదములందు చెరువులను మన ధర్మపరులు త్రవ్వించి యుండిరి. ఇప్పటికిని పల్లె సీమలలో చెరువులందే ప్రజలు స్నానమాడుటను చూడవచ్చును. ముఖ్యముగా వేసవి కాలములందు మానవుల తాపమును హరించునవి ఆ చెరువులేయగుట తథ్యము.

తే. ఆఁకలేక యెవ్వాని జలాశయమున
మండు వేసవి యందును మనుజ కోటి
యవభృథ స్నానంబు లాచరించు
నతఁడు పొందఁడు విషమ దుర్గాధి గతులు [అను-7-326]

అన్న పానములు రెండును మానవున కత్యంత ముఖ్యములగుటచే నవి ప్రాణాధారము లగుటచే వానిని దానము చేయుట దానము లందెల్ల గొప్ప. సురలు అమృతముగను, నాగకులము సుధగను, పితృకోటి స్వధగను విభిన్న నామములతో నొప్పు చున్నది అన్నమే. మహాత్ములైనవారు అన్నము ప్రాణమందురు. కావున అన్నదానము ప్రాణదాన సమము, మరి అన్న పాకమునకు జలము ప్రధానము. నీరు లేనిదే అన్నము ఉడుక జాలదు. కావున అన్నముకంటె జలము ముఖ్యము. జలము నందే చంద్రుడుదయించినాడు. జలమే చంద్రుడందురు. జలము వలననే ఔషధులు అభివృద్ధిని గాంచును. కావున అన్నముకంటె జలమే ఉత్తమమని చెప్పనగును (అను-2-405). ఏ దానమును చెప్పునపుడు ఆ దానము ఉత్తమమైనదని చెప్పుటను పరిశీలకులు పరికించ నగును.

## తటాక నిర్మాణ ఫల విశేషము :

నూతులు, బావులు, తటాకములు జలమునకాధారము లగుచున్నవి. తటాక నిర్మాణము పుణ్యఫల ప్రసాదియని కొంత చెప్పియుంటిమి. సలిలాశయమ్ము లొనరించిన వాని పితృ సమూహము ప్రియ మందుదురు. ఊర్ధ్వలోక ప్రాప్తులగుదురు. త్రవ్వించిన వానికిని పుణ్యలోకములు దక్కును. గావున తటాక నిర్మాణము గావింపవలెను (అను-3-331). మరియు తటాకము దేవతలకు, మానవులకు, తిర్యక్కులకు ఆశ్రయమగుచున్నది. అంతియేగాక ఆ తటాకము నందలి మధుర జలములను గ్రోలి, గోవులు ఆ దాతకు పుణ్యలోకములను ప్రసాదించు చుందును. తటాక నిర్మాతకు ఈ లోకమునందు కీర్తిసంపదలు అభివృద్ధి

చెందును-మూడు కాలములందు అనగా వర్ష, సీత, వేసవి కాలములందు తటాకము జలపూర్ణమై యుండవలెను. అట్లున్నయెడల తటాక నిర్మాణ కర్తకు అశ్వమేధ యాగ ఫలమేకాక, విభిన్న యజ్ఞఫలములు లభ్యములు. ఆ తటాకము నొడ్డునందు తరువులు పెంచిన యెడల ఇంకను మంచిది, సుగతులు పడయనగును. ఇహలోక సుఖము అతనికి ప్రాప్తించును, ఎందువలననగా నా తరువులు విహంగాది బహు భూతములకు నివాస యోగ్యములు (అను-3-330). మరియు నా వృక్షముల ఛాయ పాంథులకు ఉపయోగపడును. ఆ తరుచ్ఛాయ అతిథి వర్గమును ప్రమోద మొంద జేయును-వాని పుష్పములు సురగణమునకు మోదము కలుగజేయును. ఫలములు పితృ గణమునకు సమ్మోదము కలిగించును-కావున వృక్షముల పెంచుట చాల శుభము-

తే. ఛాయ నతిథివర్గంబుఁ, బుష్పముల సురగ
ణంబుఁ, బండులఁ బితృ నివహంబుఁ, బ్రమద
మందఁ జేయు వృక్షంబులట్లగుట వృక్ష
రోపణ క్రియ మేటి ధర్మపు కుమార (అను-3-332)

వృక్షములను పెంచుటను మానవుల ఆరోగ్య దృష్టితో పరికించినను చాల మంచిది మానవుల కవసరమగు ప్రాణవాయువును వృక్షములు ఇచ్చు చున్నవి. ఆధునిక యంత్రములచే గాలి వాతావరణము కలుషమగుచుండగా నా కాలుష్యమును సంహరించునవి వృక్షములే-అందువలన నేడు మన వారందరు వృక్షరోపణ క్రియపై మోజు పడుచున్నారు-మనిషికి ఒక్క మొక్క నాటవల సిన అవసర మెంతేని ఉన్నది. ఈ విషయమును అనాడే మహాభారతము వ్రాసిచ్చి యుండుటను గమనించువది.

తిల దానము :

తిలలు దివ్యముని పుంగవుడగు కాశ్యపుని గాత్రము నుండి జన్మించినవి. కాన తిలలు భవ్యములైనవి. తిలలతో చేయు యజనము అఖిల వస్తువులతో నొన రించు యజనముతో సమానము (అను-2-391). మరియు తిలలను పితృభోజ్య ధాన్యముగ జలజభవు డొనరించినాడు. తిలల దానమిచ్చినంతనే పితృచయము అత్యంత శుచులగుదురు - మరియు సర్వసురతాది దోషము లెల్లను నశించి పోవును (అను-2-390). తిలదానము సర్వదానముల కంటెను శ్రేష్ఠమని

మునులు చెప్పుదురు-మునులందరు తిలలను దానమిచ్చుట చేతనే పెంపు వహిం చిరి-తిలల దానము నందు పాత్రత ప్రధానము-

క. తిలదాన మఖిల దానం
బుల కంటె విశిష్ట మెల్ల మునులును నియతిం
దిల లర్థము లగు పాత్రం
బుల కిచ్చియ కాదె పెంపు పొందిరి వత్సా. (అను-2-392)

శర్మినాముడైన ఒక విప్రుని పిలిచి యమధర్మరాజు తిలదానమాహాత్మ్యము నిట్లు బోధించియున్నాడు-దానముల కెల్లను తిలదానము ఎక్కువ-తిలల కొరకు పితృకోటి ఆశపడుదురు-పాపములు ప్రాప్తించవు-ఎవరికి? తిలభక్తికి. పుణ్యము కోరువారు తిలలనెప్పుడు బ్రాహ్మణులకు దానమీయవలెను (అను-2-409). బ్రహ్మ జ్ఞాన సంపన్నులగు బ్రాహ్మణులకే దానమీయ వలయునని భారతము అనేక పర్యాయములు చెప్పుట గమనార్హము.

ధూప దీప దానము :

సుమనో ధూప దీప నైవేద్యములు ఉత్తమమైన పూజా సాధనములని తెలిసికొనుము-ధూప దానము చేయునెడ గమనించవలసిన అంశములేవి? అనగా-సల్లకీ (అందుగుచెట్టు) జాత నిర్యాసమును ఎల్లదేవతలు మెత్తురు. అంతకంటె కూడ గుగ్గిలము ఉత్తమము. అగలు అనగా చందన విశేషము గంధర్వ యక్షోర గాది సంఘములకు అత్యంత ప్రియము (అను-4-12). ధూపదానములయందు కడు నుత్తమమైనది కర్పూర ధూపము (అను-4-13), సురలకు సుమధురమైన ధూపము ఇష్టము. యక్షులకు కటువుగ నుండు ధూపము ప్రియము, రక్షస్సమితికి తీక్ష్ణమైన ధూపము, హృద్యమైనది (అను-4-14). ధూపదాన కర్తకు పుష్టి. ఆయువు కలుగును, దేవ జాతులేకాక రాక్షసులు కూడ ధూపమునకు మెచ్చి ఇష్టసిద్ధి ప్రాప్తి చేయుదురు-

తే. తగిన యట్టి ధూపము దేవతలకు నిచ్చి
పరమ పుష్టియు నాయువుఁ బడయుఁగర్త
యక్ష గంధర్వ పన్నగ రాక్షసులును
ధూపమున మెచ్చి కోర్కు లిత్తురు కుమార. (అను-4-5)

మలయజమును, అగరును మరియు వస్తువులును ధూప విషయమున ప్రియమైన వస్తువులు (అను-4-16)

దేవతార్చన సేయునపుడు తామస వృత్తిగల భూతరక్షో ముఖముల్లైన కుత్సితపు జాతులెల్లను దీప సన్నిధిని అడగిపోవును. కావున దీపదాన మధిక మైనదని గ్రహింపుము (అను-4-17). దీప దానమును ఆలోకదానమనియు చెప్పుదురు- ఎందువలననగా దీపము వెలిగించుటచే సద్ధర్మాలోకన శీలము వెలిగించు వానికి లభించును. [అను-4-18]- ఘృతము చాలక పోవుటచే వర్తి నికృష్ట మగుటను తగనమర్పించి పెంచరాదు. దీపదాన విషయమునందు ప్రకాశ వస్తువు దృఢ దీప్తికముగ నుండ వలయును. (అను-4-19). ఆవుల ఘృతము దీపము వెలిగించుటకు చాల ముఖ్యము గేద. మేక మున్నగు జంతువుల నేయి తైలము మధ్యమమైనవి. మేదో స్థిమాంసరసములు దీప సమర్పణమునకు ఉపయోగింపరాదు- అవి చాల నింద్యములు (అను-4-22). ఇతరులు పెట్టిన, వెలిగించిన దీపమును దొంగిలింపరాదు. దొంగిలించినవానికి అంధత్వము ప్రాప్తించును. దేవాలయముపై దీపము నిడిన వాడు విభూతికి పాత్రమగుచున్నాడు (అను-4-21). దీపదాన మొసగిన దాతకు అమర పూజిత సుఖము లభ్యమగుచున్నది-

క. జ్యోతిస్స్వా లోక్య కులో
ద్ద్యోతన మహిత ప్రకాశ యోగంబులు పు
త్రాప్తి తెచ్చు దీపదానము
దాత కొసఁగు నమర పూజిత సుఖత్వంబున్ (అను-4-23)

ఎందును దీపదాన విధి శ్రేష్ఠము. అనిశము దీపదానము చేయవలెను. అట్టి దాతకు ఊర్ధ్వలోకగతి కల్గును. మరియు పరమ దివ్య బోధము-దాతకిచ్చును. (అను-4-40)

పైన పేర్కొన్నవి గాక ఇంకను కొన్ని ఇతర దానములు గలవు- ఘృతము అగురు వస్తువుల నిచ్చుట మంచిది. యాగాది కర్మకాండ కివి ఆవశ్యకములు. ఘృతము, అగురు మున్నగునవి అగ్నిభట్టారకునకు, యాగములకు నత్యంత ప్రియతమము లైనవి. [అను-2-38]. చిన్న చిన్న మట్టి కుండ

అను విప్రునకు దానమిచ్చినచో నాభూసురు లొనరించు ఆచమన ముఖ కర్మల లోని ఆరవ వంతు ఫలమును దాత పొందును- మరియు పొయ్యిమండుట కొరకు ఇంధనములను అనగా కాష్ఠముల నిచ్చువానికి ధనము అభివృద్ధి గాంచును-

తే. గరగ లొసంగిన నరుఁడు భూసురు లొనర్చు
నా చమన ముఖ కర్మంబు లందు షష్ఠ
భాగ ఫలమొందు, నెగడికిఁ బాచనమున
కింధనము లిచ్చి ధనముల నెసక మెసఁగు (అను-2-388)

దానమహిమము ప్రశంసార్హము అన్నిదానములకంటెను అడిగిన వానికి అడిగినంత యిచ్చుట గొప్పది. అఖిల భూతములకును అభయమిచ్చుట కంటెను అడిగినంత దానమిచ్చుట శ్రేష్ఠతరమని ఆర్యజనులు చెప్పుచున్నారు. (అను-2-335)

దానముల కంటెను ఉత్తమమైనవియు కొన్నికలవు. దానముల కంటె వీర శయనము మేలు- దానములేకాదు మరి ఏ ఇతర పుణ్యకార్యములును వీర శయనమునకు సాటిరావు. (అను-2-337). దానాద్యుత్తమ కార్యముల కారణ ముగ సంభవించు ఉన్నతగతులు రణనిహతుడైన వానికి లభించు నుత్తమ గతు లతో సరిపోలవని మహనీయులు వక్కాణించు చున్నారు-

క. దానా ద్యుత్తమ కర్మ వి
ధానంబులఁ బడయు గతులు దాత్తరణము నం
జా నేర్చు వాని చనియెడు
మానిత గతిఁ బోలవంద్రు మహనీయాత్ముల్ (శ్రీ-1-111)

తత్త్వము నెరిగిన వారికంటెను, అనూనమైన దక్షిణ ఇచ్చిన వారి కంటెను, యాగ సహస్రములు చేసిన వారికంటెను అక్రోధనుడు గొప్పవాడని చెప్పుచున్నారు. క్రోధములేని మానవుడు అలభ్యముగు చున్నాడు అజాత శత్రు వులే అరుదు, పురాణకాలమునందు ప్రసిద్ధి చెందిన అజాతశత్రువు ఒక్కడే- అతడు ధర్మరాజు. అట్టి ధర్మరాజు కూడ అక్రోధనుడని మనము చెప్పజాలము.

క్రోధము తక్కువగా గలవాడు ధర్మజుడని చెప్పవచ్చునేమో గాని అక్రోధను డని చెప్పజాలము. ధర్మరాజు సాదువనియు. సాదురేగిన తలపొలము నవగాని నిలువదనియు సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పియున్నాడు.[10] ధర్మరాజు అక్రోధనుడు గాడనుటకు సాక్ష్యము భారతమున గలదు. కర్ణునిచే యుద్ధరంగమున నవమానితుడై ధర్మరాజు శిబిరమున కేతెంచి వ్రణములకు వైద్యము చేయించుకొను చుండెను. అతనిని పలకరించుటకై కృష్ణార్జునులు ఏ తెంచిరి. కర్ణుని చంపి వచ్చినారని తలంచిన ధర్మజుడు, వారు కర్ణుని చంపిరాలే దని తెలిసికొని క్రోధముతో నర్జునుని దూషించుటయే సాక్ష్యము.[11] కావున అక్రోధనుడు చాల అరుదు. అందువలన అక్రోధనుడు మానవోన్నతుడని కీర్తింపబడి యున్నాడు.

క. అనుపమ నియమాన్వితులై
యనూన దక్షిణలఁ గ్రతు సహస్రంబులు సే
సిన వారికంటె నక్రో
ధనుఁడ గరం బధికుఁడండ్రు తత్త్వ విధిజ్ఞుల్. (ఆది-3-146)

దాన మొనరించుట రాజునకు తగును. అది అజ కల్పిత ధర్మము. ప్రజ లకు దాన మొనరింపని రాజు నరకమునకు బోవును. (శాంతి-2-336). కావున దాన మొసంగుట మానవులందరికి అవసరము, ఆదరముతోనిచ్చు దానము దురి తమును హరించును (అను-2-35). భూసురులకు ధనమును, ధాన్యమును, గోవులను, రత్నములను, భూములను, సలిలమును, అన్నమును, మొదలగు దానములిచ్చువారికి యజ్ఞములు, తపము లొనర్చినంత పుణ్యము చేకూరును (అను-2-347). దాన ధర్మాది ఉత్తమ క్రియలు ఈ లోకమున నాచరించినచో నా పుణ్యమే వారిని స్వర్గలోక సుఖములు పడయ చేయుచున్నవి. రాబోవుజన్మము నకు నది శుభము గావించును. కావున దాన ధర్మము లొనరించుటయే కడు మేలు.

తే. ఇందుఁ జేసిన పుణ్యంబ యందుఁ గుడుచు
మీఁది జన్మంబునకు నదిమేలుఁ జేయుఁ
గాన తన శక్తితోఁ గూడ దాన ధర్మ
చిర పరోప కారంబులు సేయ వలయు (అరణ్య-6-109)

దానము వంటి ఉత్తమగుణమే కాక మానవునకు కారుణ్యము కూడ చాల అవసరము. క్రోధమును త్యజించుట ఎంత దుర్ఘటమో అట్లే కరుణ కల్గియుండుటయు కష్టసాధ్యమే-జీవకారుణ్యము శ్రేష్ఠమైనది. దయకల్గి యుండుట మానవోన్నతులకే సాధ్యపడును-ఇక దయా మాధుర్యమును వ్యక్తీకరించు సూక్తులను పరిశీలింపనగును-

## జ్ఞాపికలు

1. పూర్వ గాధా లహరి- పు-192
2. అందే పు-452
3. ఆంధ్ర మహా భాగవతము- అష్టమ స్కంధము 519 నుండి-679 వరకు
4. శ్రీ హర్ష కృత నాగానందము నందలి కథ
5. అను శాసనిక పర్వము 3-90 నుండి 86 వరకు
6. ఆంధ్ర మహా భాగవతము-నవమస్కంధము 641 నుండి 650 వరకు
7. అను శాసనిక పర్వము 4-218 నుండి 252 వరకు
8. అరణ్య పర్వము 7-282 నుండి 315 వరకు
9. ఆది పర్వము 5-218
10. ఉద్యోగ పర్వము 2-13
11. కర్ణ పర్వము 3-51

# దయా మాధుర్యము

'ధనమూలమిదమ్ జగత్తు'ను మాట సత్యమే అయినను నీ ప్రపంచము ముఖ్యముగా ధర్మము, సత్యము, దానము, దయ అనెడి నాలుగు సద్గుణములపై నాధారపడి యున్నది-ఈ నాల్గు గుణములను మించిన సద్గుణములు ఇకలేవు. పై నాల్గు గుణములు గల మానవుడు కడు నుత్తముడుగా పరిగణింపబడును-ధర్మ తత్త్వ మెరిగినవాడు కరుణార్ద్ర హృదయుడై యుండును. సత్యనిష్ఠ కలవాడు దయార్ద్ర మనస్కుడగుటలో నాశ్చర్యము లేదు. దానము చేయు మహానుభావుడు కరుణరస తరంగిత హృదయుడై యుండు నను టలో నెట్టి సంశయము లేదు.

**మానవ దయ :**

ధర్మము, సత్యము, దానము అను మూడు గుణములకంటె దయా గుణము ఉత్తమమని ధర్మశాస్త్రములు ఉటంకించుచున్నవి. ఈ విషయమును వివరించు ప్రసిద్ధ శ్లోకమును పరికించుడు-1

శ్లో. "శాంతి తుల్యం తపోనాస్తి-న సంతోషాత్ పరం సుఖం
నతృష్ణాయాః పరోవ్యాధిః-నచ ధర్మోదయాసమః"

శాంతికి తుల్యమైన తపస్సులేదు. సంతోషమును మించిన సుఖములేదు. తృష్ణ(అనగా ఆశ, గాఢమైన కోరిక)ను మించిన అధికమైన వ్యాధిప్రగ్యము. దయకు సరి సమానమైన ధర్మము ఇంకొకటి లేదు-కావున మానవుడు దయ కల్గి యుండుట చాల అవసరము.

దయగలవాడే 'పరోపకారార్థ మిదమ్ శరీరమ్మ'ను సూక్తిని పాటించ గలవాడు. సద్గుణ సంపన్నుడై, సన్మార్గము నందు ప్రవర్తించు సత్పురుషుని కలి పురుషుడు కూడనేమి కీడు చేయగలడు?2

శ్లో. "సదయం హృదయం యస్య-భాషితం సత్యభూషితమ్
కాయః పరహితోయస్య-కలిస్తస్య కరోతి కిమ్"

ఏ వ్యక్తి హృదయము దయా పరిపూర్ణమై ఉండునో, ఎవని భాషితము సత్యముతో నలంకరింపబడి యుండునో, ఎవని శరీరము పరహితార్థమైయున్నదో ఆ సుగుణ సంపన్నుని కలిపురుషుడు కూడనేమి చేయగలడని ఈ మనోజ్ఞమైన సూక్తి ప్రశ్నించుచున్నది.

దయ అనగా కరుణము. జీవ కారుణ్యములేని మానవుని జీవితము వ్యర్థము. మనను పరివేష్టించియున్న ప్రజలపై దయ ప్రసరింపచేయవలయును. పరమభక్తాగ్రేసరుడైనను వానికి దయార్ద్ర చిత్తముండవలెను-మహా భాగవతము నాంధ్రీకరించిన పోతన భక్తి తత్పరుడు. అతడుకూడ మానవునకు సత్య భాషణము, దయ రెండును అవసరమని వక్కాణించినాడు. ఈ రెండులేని వాని జన్మ సార్థకము గాదని వ్రాసుచ్చినాడు.

తే. చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరు నొవ్వంగ హరి కీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలపఁడేని
కలుఁగ నేటికి తల్లుల కడుపు చేటు.[8]

మానవజన్మ ఎత్తిన తర్వాత చేతుల నిండారగ సుమనోజ్ఞ పుష్పములచే శివుని పూజింపవలెను. చేతులు ఉన్నందుకు ఫలమదియే గాని కేవలము భోజన మారగించుట మాత్రమేకాదు-నోరు ఉన్నందులకు ఫలితము హరినామస్మరణ చేయుచు కాలము గడపవలెను. నోరు నొచ్చు వరకు హరిని కీర్తింపవలెను. నోటి నుండి వెలువడు భాషణములన్నియు సుమధురములై సత్యభాషితములు కావలెను. మరియు దయార్ద్ర హృదయుడు కావలెను-అవిలేని వాని పుట్టుక వలన ప్రయోజనము లేదు. వారు పుట్టుట వలన తల్లులకు కడుపు చేటేగాని ప్రయోజనము శూన్యము. పరమ భాగవతోత్తముడైన సహజకవి పోతన కూడ మానవ జీవితమున కుండదగు దయా ప్రాధాన్యమును హెచ్చరించినాడు-

దయార్ద్ర హృదయుడైన మానవుడు తనవలె ఎదుటి వారిని కరుణ భావముతో సమానముగ చూచును-దీనులను కడు దయతో నాదరింపవలెను. ఎదుటి వారు మన వంటివారే కావున మనకు కష్టము, నష్టము కలిగించు పనులు ఎదుటి వారికి కూడ కల్గించునను భావము ప్రతివ్యక్తికి ఉండవలెను. తానెంత సుఖ

ముగా జీవింపవలెనని ఆశించుచున్నాడో ఎదుటి వారు కూడ నట్టి సుఖముతో జీవింపవలెనని మనము భావింపవలెను. 'సర్వే జనాస్సుఖినో భవంతు' అని తలచుట ఉత్తమ ధర్మము-ఎదుటివారి కష్టమును గూర్చి ఉపేక్షింపరాదు-ఆ కష్టము మనకు ప్రాప్తించినయెడల ఎంత బాధపడుదుమో అని విచారింపవలెను-ఎదుటి వారి బాధను తన బాధగా భావింపగల మానవుడు ఉత్తముడు-ఈ విషయమునే వివరించు సంస్కృత సూక్తి సారమును గ్రహించుడు-

శ్లో. "శ్రుణుతాం ధర్మ సర్వస్వమ్-శ్రుత్వా చాప్య వధార్యతామ్
 ఆత్మనః ప్రతి కూలాని-పరేషాం న సమాచరేత్.[4]

సర్వ ధర్మములను శోధించిన సారమును వినుడు, విని ఆ ధర్మసారమును సంపూర్ణముగా మనసునకు హత్తించుకొనుడు, మీ ఆత్మకు ప్రతికూలములైన పనులను ఇతరులకు మీరు చేయకుడు. ఆ చేష్టలకు మీ ఆత్మ ఎట్లు బాధ చెందునని మీరు తలతురో అట్లే ఇతరుల ఆత్మకూడ బాధపొందునని భావించుడు.

ఈ ధర్మ రహస్యమును తిక్కన సోమయాజి సుమనోజ్ఞముగ చదివినంతనే చదువరుల హృదయమునకు హత్తుకొనిపోవునట్లుగ, ఒకటి రెండు పర్యాయములు పఠించినంతనే కంఠస్థమగునట్లుగ, 'నలతి యలతి తునియల కాహళ సంధించిన'[5] విధముగ పద్యమును సమకూర్చినాడు. కందపద్యరచనకు ఘనుడగు తిక్కన ఈ సుమధుర భావమును సుందరమైన కందములో సంతరించినాడు-

క. ఒరులేమేమి యొనర్చిన
 నరవర! యప్రియము తన మనంబున కగుఁ దా
 నొరులకు నవి చేయ కునికి
 పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్. (శాంతి-5-220)

ఇతరులు ఏమేమి చేసిన తన మనసునకు అప్రియములుగా తోచునో వానిని తాను ఇతరులకు చేయకుండుటయే పరమధర్మ పథములకెల్లను ఉత్తమమైనది. ఇందు ధర్మవిషయమే, ధర్మరహస్యమే చెప్పుచున్నను నిది దయకు కూడ సంబంధించినదియే యగుచున్నది. దయగల మానవుడే ఎదిరిని తనవలె చూడగల్గుచున్నాడు-దయాగుణ సంపన్నునకు యావత్ప్రపంచము మోకరిల్లుచుండును-

దయా గుణము దైవగుణము-దయయే దైవము. దైవమే దయాస్వరూపము. అందువలననే గోపికలు "నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు 'కృపారసంబు' పైఁ జల్లెడువాఁడ"ని కృష్ణుని కీర్తించినారు-దేవదేవుని చూపులు కృపారస వాహినులు, కృపారస ప్లావితములు-ఆ పరమేశ్వరుడు దయార్ద్ర హృదయుడు గావుననే దీనులను రక్షించును. అంతియేకాదు చక్రి 'కలఁడందురు దీనులయెడ,' నను టలోని ఆంతర్యమును మనము గ్రహింపవలెను. దీనులను రక్షింప వలసిన బాధ్యత దయార్ద్ర హృదయులైన మానవులదే- మానవులు మరచినపుడు దీనులను ఆ దైవమే రక్షించగలడు- ఆ దీనులయందే తాను నివసించగలడు- దయ కలిగి యుండుట దైవలక్షణమని పిండితార్థము. సర్వధర్మరహస్య వేదియగు భీష్ముడు నిజశరీర త్యాగమునకై కృష్ణుని అనుమతి కోరినాడు- తన్ను 'కరుణజూడు' మనినాడు (అను-5-462). తన్ను 'అధిక కారుణ్యము'న రక్షింపుమని భీష్మడు కృష్ణుని కోరినాడు (అను-5-463). ఆ కృష్ణభగవానునిది 'కరుణామృత మయంబగు నాలోకనము' (అను-5-348) కావున కరుణా స్వరూపమే కృష్ణభగవానుడు-

**భూతదయ :**

దయలో కూడ భూతదయ అత్యుత్తమమైనది. సర్వభూతముల యందును కారుణ్యము గలమానవుడు పారలౌకిక సుఖము ననుభవింప గలడు. మానవునకు జీవకారుణ్యము అత్యవసరము

శ్లో. దయావాన్ సర్వ భూతేషు- పరత్ర సుఖమేధతే

'జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల' ? అన్నట్లుగ ద్రవీభూత చిత్తము గల మానవునకు తెగ బారెడు జడలతోను, భస్మలేపనములతోను పని లేదు, సర్వ జంతువుల యందును కారుణ్యము చూపగల దయార్ద్ర చిత్తుడైన వానికి జ్ఞానము, మోక్షములు కరతలామలకములగు చుండగా వానికి జడలతో, విభూతి లేపనముతో పని ఏమి?-

శ్లో- 'యస్య చిత్తం ద్రవీభూతమ్- కృపయా సర్వజంతుషు
తస్య జ్ఞానేన మోక్షేణ-కిం జటా భస్మ లేపనైః

మాయా యుక్తుడైన యమధర్మరాజు అడిగిన ప్రశ్నలకు సమాధాన

మొసంగిన ధర్మరాజునకు యముడు వరము లిచ్చెద వేడు కొమ్మనును- అంత కౌంతేయాగ్రజుడు- 'నామది యెల్ల నెడును గ్రోధమోహాదులం బెడఁ బాసి ధర్మము నందు నెక్కొనఁ జేయవే?[10] అని వేడినాడు. క్రోధాదులైన అరిషడ్వర్గము మీద తన మనసు లగ్నము కానట్లుగ కోరుటయేగాక, తన మనస్సు ఎల్లపుడును ధర్మము నందు నిలుచునట్లుగ కోరుకొనినాడు. ధర్మముపై నంతటి లక్ష్యము ధర్మజున కున్నది. దయ, భూతదయ, రెండును ధర్మము నందంతర్భూతములగును గావున నీ విషయమిట ప్రసక్తమైనది-

కంసుడు అక్రూరుని పంపి రామకృష్ణులను మధురకు రప్పించినాడు. మధురానగర సౌందర్యములను తిలకించుచు బలరామ కృష్ణులు వీధులయందు విహరించు చుండిరి. మార్గ మధ్యమున మాలాకారుడగు సుదాముడను వాడు ఎదురు పడెను. కృష్ణుడు కొన్ని మాలలీయ వలసినదని సుదాముని కోరినాడు. వెంటనే సుదాముడు మనోజ్ఞమైన దామములను కొన్నిటిని కృష్ణున కర్పించినాడు. ప్రీతుడైన శ్రీకృష్ణుని కాంచి సుదాముడిట్లు కోరు కొనినాడు-

క. నీపాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము ను నితాం
తాపార భూతదయయును
తాపసమందార! నాకు దయసేయగదే[11]

పరమ భాగవతుడైన సుదాముడు భగవత్పాద కమల సేవను కాంక్షించుటలో నెట్టి ఆశ్చర్యమును లేదు. భాగవతులతోడి స్నేహమును కోరుకొనుటలోను వింతలేదు- అపార భూతదయను కోరుకొనుటలోనే వైశిష్ట్యమున్నది, ధర్మజుడు ధర్మమును కోరగా, సుదాముడు భూతదయను కాంక్షించినాడు. భాగవతుల కుండవలసినది- భూతదయ కూడ, సర్వభూతదయ ఉన్నపుడే జీవితము సార్థకమగుచున్నది. 'ఆత్మవత్ సర్వ భూతాని' అని తలంచుటలోనే జీవకారుణ్యము ఉట్టిపడు చున్నది-

శిష్ట చరితము లెట్టివో భారతము చెప్పుచున్నది- దానము, సత్యము తపము, యజ్ఞము మున్నగున వన్నియు పేర్కొనుచు అఖిల భూతముల యందును దయార్ద్రుడగుటయు శిష్ట చరితమని చెప్పినది. [అరణ్య-5-14]

సమదర్శన దృష్టితోనే మానవుడు అఖిల భూతములను తనయట్లుగ భావించు చున్నాడో వాడు అమల న్యాయపరుడగు చున్నాడు. అట్టి సమదర్శి యైన వానిని దేవతలు కూడ వందనీయునిగా కీర్తించు చున్నారు-

క. సమదర్శియై యఖిల భూ
తములనుఁ దనయట్ల కాఁగఁ దలఁచుచు నెవ్వం
డమల న్యాయ పరుండగు
నమరులతని వంద నీయుఁడండ్రు నరేంద్రా! (శాంతి-5-482)

హింస సేయకుండుటయే దయకలిగి యుండుట. అనృతమును గూర్చి చెప్పుచు అది పాతకమనినావు. ఇతరుల యొక్క ధనమునుగాని, ప్రాణమును గాని అపహరింప చూచు పాపాత్ములతో సూనృతమాడుట కూడ మహాపాతక మగును- అనృతములు పలికి అట్టి పాపాత్ములను హింసించుట ధర్మమగును- మరియు భూతములకు హితము సేయు బొంకు లెల్లను ధర్మములే అగుచున్నవి, భూతములను హింసించు లేక బాధించు నిక్కము లన్నియు పాతకములే అగును, సర్వభూతముల దుష్ట శిష్టత్వములు వివేక సూక్ష్మతావేద్యములు గావున ధర్మము జ్ఞులు వానిని పరిశీలించి చూడవలయును (శాంతి-3-45)

సత్యవాక్యమునకు, సర్వ భూతదయకు మించిన ధర్మము ఇంకొకటి మృగ్యము. ఇతరుల బాధను గ్రహింపక, వారికి తాపము కల్గించినంతటి అధర్మము ఇంకొటిలేదు. 'ఒరులేమేమి యొనర్చిన' పద్యమునందలి భావమిక్కడ సంవదించు చున్నది-

ఆ. సర్వభూత దయకు సత్య వాక్యమునకు
నుత్తమంబుధర్మ మొండులేదు
నొరుల నొప్పి కోడకుపతాప మొనరించు
నదియ కడు నధర్మమనిరి బుధులు [ఆది-3-219]

దయాగుణము :

దయాగుణములేవి? అనుప్రశ్న ఉదయించును, అక్రూరత దయాగుణము అహింస పాటించుట దయాగుణము. కృప గలిగి యుండుటయు దయాగుణమే-

మరియు కారుణ్య భావము దయాగుణము–క్రూరత గలవాడు, హింస యొనరించు వాడు దయా విరహితుడగును– దయా గుణము నెట్లు సాధింప నగును? అను ప్రశ్నకు సమాధానము భారతము నందు మనము, శోధింపనగును.

అధ్వరము కంటెను అధికమైనది తపమని చెప్పుదురు. మరి తపమనగా నేమియో చెప్పుచున్నాడు. తపమనగా మేని ప్రన్నదనమును ఇవురించుట గాదు. అహింస, సత్యము, దమము, దయను పాటించుటయే తపము, ముక్కు మూసి కొని ధ్యానము చేయుటగాదు–

ఆ. అధ్వరంబు కంటె నధికంబు తపము త
పంబనంగ మేని ప్రన్నదనము
నివురఁ జేఁత గాద హింసయు సత్య వా
క్యంబు దమము దయయుఁగాని యరయ [శాంతి–2–348)

త్రికరణ శుద్ధిగా అనగా వాఙ్మనః క్రియలందు పరులకు గాని ఎవరికి గాని కీడు తలపకుండుట దయా గుణము. దీనులను ఎల్లపుడు అధిక కారుణ్య ముతో రక్షింప పూనుట దయాలక్షణము– ఎదిరివాని కాంక్షితములు లేవనక అన్ని కోర్కులు తీర్చుట ఆర్య ధర్మము. శరణాగతులైన వారిని ప్రోచుటయు నార్య ధర్మమే– ఇవి దయాపరునకు గాని సాధ్యపడవు కావున నివి దయా గుణ ములని చెప్పవచ్చును. [అరణ్య–7–228].

పాపరహితుడు, పుణ్యాత్ముడగు బ్రాహ్మణుని అమరులు కూడ ప్రశం సింతురు. ఆ పుణ్యాత్ముని లక్షణము లేవియో మనకు చెప్పుచున్నాడు. సత్యము నెల్లపుడు పల్కువాడు, దయను పాటించి హింసావిదూరుడైనవాడు, కరుణ వహించి ఇంద్రియ విగ్రహముతో ఎల్లవారిని తనయట్లకాచూచునట్టి ధర్మాభిర తుడు, కామమునందు తగులని వానిని బ్రాహ్మణుడందురు [అరణ్య–5–24]. ఎల్లవారిని తనయట్లకా చూచుట అనగా 'ఒరులేయేవి యొనర్చిన' అను పద్య భావమును జ్ఞప్తికి దెచ్చుకొనుడు. ఇదియు సుమారుగ నట్టి భావమే–

శరణాగత లక్షణము దయారహితున కుండదు. శరణాగత రక్షకుడు దయాపరుడనియేగదా దానిభావము. రక్షింపుమని వేడినచో దుర్బలుడైన వాడు కూడ తనకోపినంత ప్రయత్నము చేయునే గాని దయావిరహితుడై ఊర

కుండదు. మరి దుర్బలుడే ఓపినంత చేయుచుండగా కూడదు. ధీరుడైనవాడు దీన జనుల యున్న విధము గాంచి యూరకుండునా? అని ప్రశ్నించుచున్నాడు-

ఆ. కావరయ్య యనినఁ గరము దుర్బలుఁడైన
జెనసి యోపినంత సేయుననిన
నూర కుండు నయ్య? యుత్తమ కూరుండు
దీన జనుల యున్న తెఱఁగు నూచి [అరణ్య-5-412]

లక్ష్మీదేవి గర్వులైన రాక్షసులను విడిచి. దేవేంద్రుడు సత్యధర్మ పరుడగుటచే అతని దగ్గర వసియింప వచ్చితినని లక్ష్మీదేవి చెప్పినది. అంత ఇంద్రుడు ఎట్టివారు నీ కిష్టులు ఎట్టివారు నీకు అవిష్టులని అడుగగా నాదేవి ఇట్లు చెప్పినది- గురుభక్తి నిరతులు, సుర పూజనపరులు, సత్య వాక్పరిపాలకులు, దానశీలురు, పరధన పరదార పరాఙ్ముఖులు, బ్రాహ్మణ ప్రియులు, దివావి ద్రానియుక్తులైన వారు, వృద్ధులను, దుర్బలులను స్త్రీలను రక్షించు కృపారతులును, శుచిగా నుండువారు, అతిధుల నాదరించువారు ఆ దేవి మెచ్చువారట, మెచ్చని వారెవరో కూడ ఆమెయే చెప్పినది- ధర్మవిరహితులై కామ క్రోధములను తగిలి యుండువారు, గర్వులు, బలియు భైక్షము విడవి వారు(అనగా పిల్లికి కూడ బిచ్చము పెట్టనివారు) పరుషమైన వాక్కులతో అతిక్రూరమైన చరిత గలవారు ఆమె మెచ్చనివారు- ఆమె మెచ్చువారిలో కృపారతులు అనగా దయాపరులు గలరు- మెచ్చని వారిలో క్రూరులు గలరు- క్రూరులనగా దయావిరహితులని చెప్పవగును- కావున దయాగుణమును దేవతలు మెత్తురు [శాంతి-5-11].

మంత్రి ముఖ్యుడు ఎట్టి గుణవంతుడు కావలెనో ఎరిగించుచు నతడు అక్రూరుడుగా నుండ దగుననియు చెప్పినాడు- అక్రూరత దయా పరునకే ఉండునని చెప్పి యుంటిమి [శాంతి-2-369]

శరతల్ప గతుఁడైన భీష్ముడు ధర్మరాజునకు పుణ్యతీర్థ విశేషముల నెరిగించుచున్న సందర్భమున నీ విధముగా చెప్పినాడు. క్షమము, తపము, అహింస, శమమును తీర్థముల వంటివే-వాని కారణముగ శుచిత్వము మనుజునకు ప్రాప్తించునే గాని, రిక్తజలములందు స్నానమాడిన ప్రయోజనము లేదని వాక్రుచ్చుచున్నాడు-అహింస అనగా దయను చూపించుట.

క. దమమును౯ దపము నహింసయు
శమమును తీర్థముల వాన శౌచాతి శయం
బమలగుణ ! కల్గురి త్త జ
లములం దోఁగిన శుచిత్వ లాభము గలదే. (అను-2-91)

గృహస్థ ధర్మములు ఎట్టివో చెప్పుచు నందు కరుణను పేర్కొనుట గమనార్హము. కరుణాకరుడే దయాపరుడు. గృహస్థునకు మిగిలిన సుగుణములతో పాటు దయయు అవసరము (శాంతి-2-231).

కృపణత లేక అతిక్రూర కర్మములందు నిమగ్నులైన వారికి నశర్మ ప్రాప్తి కల్గునని భారతము చెప్పుచున్నది (ఆది-7-136). కావున క్రౌర్యము అవశ్యము పరిత్యాజ్యము. కరుణ కలిగియుండుటయే దయాపరుని గుణము. పరుల బాధ లేకుండగ సాధు జనముల ధనమును రక్షింపవలసిన బాధ్యత రాజుది. నిష్కరుణతో రాజే సాదులైన వారిధనమును అపహరించినచో సాధుజన మేమి సేయుదురు? (ఆది-7-104) రాజునకు కరుణ అవసరము.

దశగుణ ఏ ధర్మము లు సరిరావు-శరణమని కోరివచ్చిన భయంకర శత్రువును కూడ ప్రీతితో రక్షింపవలయును-ఇది కరుణాకరుల లక్షణము. భారతీయుల జీవన స్రవంతిలో కలసిపోయిన ప్రాచీనార్య సంప్రదాయము ఈ శరణాగత రక్షణము-

క. శరణంబని వచ్చిన భీ
కర శత్రువు నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం
గరుణా పరుల తెఱంగిది
యిరవుగ సరిగావు దీనికే ధర్మంబుల్. (అరణ్య-5-413)

దయాపరుడైన వాడే శరణాగత రక్షకుడు. శరణు చొచ్చిన వానిని ప్రసన్నుడై రక్షింపదగును-సాదరముతో సతని రక్షించుట ఉత్తమమైన ధర్మమని విబుధులు వినుతించుచున్నారు-

మహార్హుడైన ఈ బోయవానిని శరణాగతుడైన వానిని ఓపినభంగి రక్షింపుమని పెంటి కపోతము మగ పావురముతో చెప్పుచున్నది. (శాంతి-3-313).

శరణాగతుడైన బోయవాడు భయంకరమైన చలితో వణకిపోవుచున్నాడు. మంటవేసి చలిపోగొట్టినది. వానికి ఆకలివేయగా తన భార్యయగు కపోతివి బోయవాడు వలలో బంధించి సందులకు క్రౌర్యము పాటింపక, దయతో నాతనికి తన్ను ఆహారముగా సర్పించుకొన్న కపోతము యొక్క కారుణ్యము ప్రశంస నీయమైనది. దయకు అది పరాకాష్ఠ. ఆత్మ సమర్పణము అనన్య సాధారణ మైనది.

రాజగువానికి దయ కడు నవసరము-ధనవంతుల సిరిని గాంచి రాజు ఈర్ష్యపడరాదు-అసూయాపరుడు రాజు కారాదు-వారి సిరిని అపహరింప దలప రాదు-అఖిల జనులను రాజు దయాపరుడై పాలింపవలయును.

క. ఆపనికి (గీడుదోయుచు
భూపాలుఁడు ధనము గలుగు పురుషుల సిరిఁదాఁ
జూపోపక కొనఁదగదు ద
యాపరుఁడె పెంపవలయు నఖిల జనములన్.(శాంతి-2-396)

హింస :

హింస యొనర్చువాడు క్రూరుడు. దయాపరుడు హింస యొనర్పజాలడు. సర్వ భూతములను తనవలె చూచును గాన హింసకు ప్రయత్నించడు. హింస నడపుట అనగానేమి? మనసునందు, వాక్కునందు, కాయమునందు హింస నడ పుట మాంసము తినుటతో మొత్తము ఈ నాల్గు హింసలే అగుచున్నవి. మాంస భక్షణము చేయుటయనగా అన్య జంతువులను హింసించుట యగుచున్నది. కావున మాంస భక్షణము దయాపరులకు కీడు అని చెప్పుచున్నాడు. దయలేని వాడే మాంసాహారి యగునని పిండితార్థము. అన్య మాంసముచే నిజాంగ మాంసమును పోషించుట చాల చెడ్డది.

తే. మనసునను వాక్కునను గాయమునను హింస
నడపు మాంసంబుఁ దినుటతో నాలు గయ్యెఁ
దెఱఁగులవి సువ్వె హింస వర్తింపఁ జేయుఁ
గానఁ గడుఁ గీడు మాంసభక్షణము తలఁప (అను-4-286)

యజ్ఞ మొనరించి, పశువులను బలి ఇచ్చుట హింసయగుచున్నది. అట్టి యాగము వలన ఫలములేదు. అది అహంకార సహితమైనది-త్రికరణ శుద్ధి యున్న ధ్యానము. అదియే యాగమొనరించిన వచ్చు అనంత ఫలము ఈయగలదు. కావున పశువులను వేల్చు యాగములు వలదు-హింస ఒనరింపరాదు. ఈ ఉద్దేశ మతోనే జైన బౌద్ధమతములు ఆవిర్భవించినవి-

క. విను పశు యజ్ఞము హింసన
మనంత ఫలదంబు కాదహం కృతి సహితం
బనఘా వాఙ్మనస నియమ
మను యాగం బిచ్చు నవ్యయా నందంబున్ (శాంతి-3-28

హింస జరుగునని భయము కల్గినపుడు అహింసను పరిహరింపచేయుట కునై సత్య వాక్పరిపాలకుడు కూడ నసత్యము పలుకవచ్చును. హింసను అపుటయే పరమధర్మము [కర్ణ-3-78], హింసాకరమైన సత్యము ధర్మము కాదు [కర్ణ-3-71]. సత్యము పలుకునపుడు అది హింసకు కారణమగుచున్నదో లేదో పరికించి చూడవలెను. అరిషడ్వర్గము గల మానవుడు ఉత్తముడు కాజాలడు. హింస ఒనరించు మానవుడు అరిషడ్వర్గముగల వాని కంటెను అధముడగుచున్నాడు [శాంతి-1-426],

ఎట్టెటి సమయములందు మానవుడు హింస యొనర్చుచున్నాడో భారతము మనకు బోధించు చున్నది. మానవుడు కావలెనని హింసచేయరాదు తనకు తెలియకుండగనే నిత్య కృత్యములందు కొంత హింస తప్పక జరుగు చున్నది. దానినిట్లు పరిహరింపనగును- ఎంత అహింసా వ్రతులైనను కొంత హింస చేయకుండ లేరుగదా! మునులు అడవిలో తపము గావించుచున్నను వారు తరుమూలశాకనిపీడనమును గావించుట లేదా? నిజముగ పరికింప నదియు హింసయే గదా!

క. పనివడి యహింస వ్రతముగఁ
గొని వనమున నున్న మునులకుం దొడరదె హిం
సనము? తరు మూల ఫల శా
కనిపీడన మదియు హింసగాదొకొ? తలఁపన్ (అరణ్య-5-59)

మరియు జలము, భూమి, ఆకాశము సర్వము జంతుమయము, కాబట్టి అనుదిన కృత్యములందు అవశ్యము హింస కలుగు చున్నది-హింస ఏమాత్రము ఒనరింప కుండ జీవితయాత్ర సలుపుట అత్యంత దుర్ఘటము. ఇది అంతయు నాలోచింపకుండ మేము హింసచేయము అని కొందరు తలంతురు [అరణ్య-5-58].

ఎంత జాగరూకతతో మసలినను మానవుడు ఎంతో కొంత హింసను ఒనరించుచునే యున్నాడు. ఎట్లనగా కృషీవలుడు నాగలితో భూమిని దున్ను నపుడు ప్రాణులు అనేకములు చనిపోవుచున్నవి- మరి అది హింసఅగునా? కాదా? మరియు మానవులు నేలపై సంచరించునపుడు వారి పాదముల క్రిందపడి పెక్కు చిన్నప్రాణులు చచ్చు చున్నవిగదా! కావున హింసావిధి ఏ మాత్రము చేయక పోవుట మానవునకు కుదురదు. నిజమునకు ఇదియంతయు హింసగా ధర్మ సూక్ష్మము తెలిసినవారు పరిగణింపరు. మనము తెలిసి తెలిసి హింస చేయుటనే హింసగా లెక్కింతురు. తెలియకచేయు హింస ఈ లోకము నందలి మానవులకు తప్పదు. ముక్కుకు గుడ్డలు కట్టుకొనినంత మాత్రమున హింస చేయుటను తప్పించలేము.

హింసతో కూడిన పశుయజ్ఞము అధికమైన అనంత ఫలదము కాదని ఒకచో చెప్పిన [శాంతి-1-28] భారతమే మరియొకచో నాహింస హింస కానేరదనియు, నది అహింసతో సమానమనియు వక్కాణించు చున్నది- పశుహింస యొనరించి యాగముయి చేసిన వానిని ధర్మపరునిగా వేదములు కొనియాడు చున్నవట- మరియు సముచితమైన హింసనము అహింసతో తుల్యమట- ఈ భావమును జైన బౌద్ధములు ఒప్పు కొనవు—

క. విను పశు హింసా కృతయా
గ నిరూఢుని ధర్మపరుఁనిగా వేదంబుల్
గొని యాడెడు సముచిత హిం
సన మరయ నహింస గాన జగతీనాథా! (శాంతి-1-111)

**అహింస :**

'అహింసో పరమ ధర్మః' అని ఆర్యోక్తి. అహింసను మించిన పరమ ధర్మము అనగా ఇతర ధర్మము ఇంకొకటి లేదు- కావున మనుజుడు అహింస

నాచరింపవలెను. అహింస ధర్మవితతి కెల్లను మేటిగా భారతము [అరణ్య-5-48] చెప్పుచున్నది.అహింస సత్యాయుక్తమైనచో మరింత మంచిది. శ్రుతులు చదివిన బుధులు దానము, ధర్మము, తపము మున్నగు నుత్తమ గుణములన్నియు అహింసకంటె తక్కువయని కీర్తించు చున్నారు- కావున అహింసయే పరమ ధర్మము. అహింసా చరణమే ఉత్తమ మానవ లక్షణము. ఇదియే జైన బౌద్ధము లకు మూల స్తంభము-

క. దానము ధర్మము తప మి
జ్యా నిష్ఠ యనంగఁ గల్గు సత్క్రియ లెల్లన్
మానవ నాథ యహింసా
నూన కృతులంద్రు శ్రుతుల నూనిన పెద్దల్ (అను-4-29౦)

అందువలన అహింస అచరణమే అత్యుత్తమ గుణము. సత్కార్యము అగుచున్నది.

ఉత్తమ ధర్మము లేవి అనగా- అహింస, దానము, సత్యము,అక్రోధము అనునవి నాల్గు- ఈ నాల్గును ఉత్తమ ధర్మరాశి- ఇవి ధర్మమునకు పర సీమ. [అను-5-421] సత్యము అహింస అను నుత్తమ ధర్మయుగళము నందు అహింసచే సత్యమును గాచుట ధర్మము [కర్ణ-3-73]. సత్యము మూర్తులు ఏమిటో నిరూపించుచున్నారు-సమత, దమము, తితిక్ష, అమత్సరము. హ్రీ, ధృతి, అనసూయ, అహింస, దానము, క్షమ మున్నగునవన్నియు సత్యము మూర్తులు (శాంతి-3-417). కావున అహింసయు గొప్పదే అగుచున్నది-

హింస చేయనట్టి మానవుడు ఈ లోకమున మృగ్యము, కావి ప్రతి మనుజుడు హింస చేయకుండుటకై ప్రయత్నింపవలెను. వీలయినంత వరకు హింసకు చొరకుండుటయే లగ్గు-త్తమ తమ ఓపినంతకు హింసా మార్గమునకు తొలగుటయే అహింసయని చక్కగ తెలియ చేసినాడు-

తే. హింస సేయని వాఁడు లేఁడి జగమున
నొక్కఁడైనను, దమ తమ యోపినట్లు
హింస తెరువున కెడ గల్గియేఁగ వలయు
నదియ చూపె యహింస నా నతిశయిల్లు (అరణ్య-5-60)

నహుషుని ప్రశ్నలకు ధర్మజుడు సమాధానములిచ్చుచున్నాడు-అహింసను గూర్చి నహుషుడిట్లు ప్రశ్నించినాడు. అప్రియమొనర్చియు, అసత్యవాదియయ్యు, హింస గావింపని వాడు సుగతులెట్లు పొందుచున్నాడు. అహింస ఎట్లు మేలగుచున్నది?

తే. అప్రియం బొగిఁ జేసియు, ననృతవాది
యయ్యు, హింసగావింపని యమ్మహాత్ముఁ
డేఁగు సుగతికి నం ద్రదధి యెట్లు సెప్పు
మయ్య యనఘ యహింస మేలైన తెఱఁగు. (ఆరణ్య-4-112)

ఆ ప్రశ్నకు సమాధానముగా ధర్మజుడు—'దానము, ప్రియమొనర్చుట, సత్యము, అహింస ఈ నాల్గును సమానములే. అయినను అహింసయే మేలగును- ఎట్లనగా దేవ మనుష్యతిర్యగ్యోను లనెడు మూడు గతులందును మానవుడు దానాది ఉత్తమగుణ శోభితుడై, అహింసాపరుడై దేవగతిని పొందుచున్నాడు, అహింసాపరుడు కానివాడు అనగా హింసాపరుడు తిర్యగ్యోనులందు జన్మించుచున్నాడు' అని చెప్పుటను గమనించునది-

మాంస భక్షణము మానినచో నది అహింసయగును. మాంసానేకరుచి నెరింగినవాడు మాంస భక్షణము హింసగదా అని మానజాలడు (అను-1-287) మాంసము పితృ దేవతలకు ప్రియంబనియు, శ్రాద్ధకర్మ మాంస ముఖ్యముగా నడప వలయునని చెప్పుదురు గదా! జీవహింస చేయక మరి మాంసమెట్లు లభించును? మాంస భక్షణమును విడుచుట అశ్వమేధయాగము కంటెను పూజనీయ కర్మమందురు. జీవములను చంపుటగాని లేక చంపబనుచుట గాని రెండును హింసగానే పరిగణింపవలయును. (అను-4-190). పితృ కార్యార్థమై యజ్ఞ నిర్వహణార్థమై వేద విహితమైన హింసవలన చెడులేదట. అది అహింసగాబోలు (అను-4-191). యజ్ఞ యాగాదు లొనర్చుట ఆర్యధర్మము. కొన్ని యాగము లందు జంతు హింస తప్పదు. సంపూర్ణముగా యాగ నిర్వహణ కావలెనన్న పశు విశసనము తప్పదు-

ప్రాణులను చంపి మాంసము కొనునపుడు ఆ జీవులకు ఎంత నొప్పి

కలుగుచున్నదోయని దయగలవాడు చింతింపగలడు. తనమేనువల్లు నొప్పించిన నెట్లగునని తలంచువాడు అట్టి అహింసా కర్మను మానును—అట్టి ఉత్తమ మానవుడు దయార్ద్ర చిత్తుడై మాంసాహారమును త్యజించును—

ఉ. మ్రానసుజాతనుం గలదె మాంసము ప్రాణుల మేనఁగాక, య
మ్మేనుల నొంచునప్డు తమ మేనులు సోఁకిన మాత్ర నెట్లగున్
దాని దలపఁగా వలదె? తానది మానిన హింస లన్నియున్
మానవె యంచు నుత్తముఁడు మాంసము మాను దయార్ద్రచిత్తుఁడై
(అను-4-294)

మాంస భక్షణము మానుట కంటె ఉత్తమమైన దయలేదు. మాంస భక్షణము ఒక దోషము. అది మానుట ఉత్తమ కర్మ. ఏ ధర్మములను దయకు సమములు కావు. కాన దయార్ద్ర హృదయముతో మాంసాహారమును అవశ్యము పరిత్యజింప వలయును—

తే. మాంస భక్షణ దోషంబు మాను దాన
మహిమ సనుటయు మాంసంబు మఱి భుజింప
కున్నఁజూవె ధర్మము లెవ్వియును దలంప
దయకు సదృశంబులే? కురు ధరణినాథ. (అను-4-307)

దయకు మించిన ధర్మము లెందును లేవని చెప్పినాడు గదా! దయా ఫలమేమి? అని ప్రశ్న ఉదయించుచున్న—ఇక దయాఫలమును కొంచెము పరిశీలింతము—మహాభారతము సర్వ సంశయ విచ్ఛేదకారిగదా! దయాఫలము చెప్పబడినదిఁదు—

**దయా ఫలము :**

ఎవరు దయార్ద్ర చిత్తులై జీవహింస మానుదురో వారు పుణ్యాత్ములు. తన ఆత్మకు ప్రాణభయము ఎట్లున్నదో, అట్లే జీవులకును ప్రాణభయము సమానముగ నుండునని భావించు కరుణాకరుడు మాంసాహారమును ముట్టడు. అట్టి వానికి సత్యలోకములు సంప్రాప్తించును—దయాఫలములలో బ్రహ్మలోకము కలుగుట ఒకటియని చెప్పనగును—

ఈ లోకము కర్మభూమి. ఈ జగత్తు భోగాస్పదము కాదు. ఆ లోకము

అనగా ఊర్ధ్వలోకము మిక్కిలి భోగాస్పదము. అది నిజమైన భోగాస్పదము. ఈ ప్రపంచము భోగాస్పదమువలె నుండునుగాని పరిశీలించిన అది మిధ్య. ధర్మ పరులైన వారికి ఊర్ధ్వలోక ప్రాప్తి కల్గును. సత్యము, శౌచము, సౌజన్యము దయాదులు కలవారికి ఆ ఊర్ధ్వలోకము ప్రాప్యమగును. మరి అవి లేని వారికా లోకము అప్రాప్యమే. (శాంతి 4-1'0).

క్షమము, అహింస, సత్యము, నమ్రతము, ఇంద్రియజయము, శమము, పరిత్యాగమనునవి తపోలక్షణములు. ఇవి అన్నియు మానవునకు ఊర్ధ్వలోక ప్రాప్తికరములు. కావున అహింసను అనుసరించువానికి ఊర్ధ్వగతి లభించును. (అరణ్య 6-108). రాజునకు దయ ముఖ్యము. దయామయుడైన ధరణీపుడు ప్రజలను కన్నబిడ్డలవలె ప్రోచును. దానికి తపములు, యజ్ఞములు సమముకావు. మరియు దయతో ప్రజలను పాలించు రాజునకు జయము లభ్యమగును. సంపదలు తాసురతంపరలై వర్థిల్లును. కీర్తి విరాజితుడగును. మరియు సుగతి కల్గుట దయాఫలమే (శాంతి 2-301).

దయగలవానికి దురితములు తొలగును. శరణాగతుడైన వానిని దయతో రక్షించియు, యుద్ధరంగమున శస్త్రబాధితుడైన వానిని తెచ్చి దయగా చూచుట వలన రాజు దురితములను పోగొట్టుకొనవచ్చును (శాంతి 2-426). శరణు చొచ్చిన వానిని దయతో రక్షింపక పోయిన యెడల వానికి ఆ దయారహితునకు ఊర్ధ్వలోకము తప్పిపోవును (ఉద్యోగ-1-161).

భూతరక్షణ :

ధర్మమును రక్షించువారిని ఆ ధర్మమే రక్షించును. అట్లే భూతములపై కోపము చెందు వానిని ఆ భూతములన్నియు వానిపై అలుగును. భూతహితము గోరువాడు భూతములకు అభయమిచ్చును. అంత ఆ భూతములన్నియు వానికిని అభయమిచ్చును.

క. భూతముల కలుగు నతనికి
భూతము లఖిలములు నలుగు భూతహితార్థీ!
భూతముల కభయ మిచ్చిన
పూతాత్మున కభయమిచ్చు భూతావళియున్. (అను 4-309)

దానము, తపము, ధర్మము, యజ్ఞము, శౌచమంత్ర తంత్ర సత్యములును అహింసా రూపములవి బుధులు ఘోషించుచున్నారు. అహింసవలన కలుగుసంపద ఎల్ల సంపదలతో సమానముగ తులతూగును(అను 4-310). దాదాపు ఈభావము పునరుక్తియయినది. [చూడుడు ఇదే అధ్యాయము 203 అను 4-298]. ధర్మోత్తరయగు నహింసముయొక్క శ్రేష్ఠత్వమును నింకను పెద్దగ కొనియాడదగును (అను 4-311).

క్రౌర్యగుణము :

దయాగుణమును సంకీర్తించు సూక్తులు ఇంతటితో ముగిసినవి ఈ అధ్యాయమును ముగించుటకు మునుపు మహాభారతమునందలి క్రౌర్యమునకు - కారుణ్యమునకు ప్రతీకలుగా నిలబడుచున్న రెండు పాత్రలను కొంచెము పరిశీలింపవలయును. క్రౌర్యము - హింసకు, కారుణ్యము - అహింసకు ప్రతిరూపములు. క్రౌర్యమునకు ప్రతీక అనగా అదయుడైన వాడని. కారుణ్యమునకు ప్రతీక అనగా సదయుడైనవాడని చెప్పనగును. అదయుడగు వ్యక్తి అశ్వత్థామ, సదయుడగు వ్యక్తి అర్జునుడు. అర్జునుడు దయాస్వరూపుడెల్లపుడు. అశ్వత్థామ ఎల్లపుడు కాకపోవచ్చును గాని సౌప్తిక పర్వమునందు అదయుడై ప్రవర్తించి క్రౌర్యమునకు ప్రతీకగా నిల్చినాడు.

క్రౌర్యము క్షాత్ర సంబంధమైనది. కొంతవరకు కారుణ్యము చాలవరకు బ్రాహ్మణ సంబంధమైనది. ఈ గుణములు పై పాత్రలయెడ తారుమారయినవి. బ్రాహ్మణుడైన అశ్వత్థామయందు క్రౌర్యమును, క్షత్రియుడైన పార్థునియందు కారుణ్యమును చోటు చేసికొనినవి.

పాండవ పాంచాల బలము అష్టాదశ దిన యుద్ధానంతరము నాటిరేయి అమిత నిద్రనొందెను వారందరిని గురుసుతుడు సుప్తదశలో నుండగా సంహరింపదలచి, ఈశ్వరుని వేడి, వేదికయందు అగ్నిప్రజ్వరిల్లచేసి ఆత్మాహుతి చేయ కడంగెను. అంత పరమేశ్వరుడు ప్రత్యక్షమై అతనికి నొక ఖడ్గము నిచ్చి దీవించెను. అశ్వత్థామ ఎరుగకుండగ తేజోరూపమున నీశ్వరుడు అతని తనువునందావేశించెను. పిమ్మట గురుతనయుడు నిద్రాలసవృత్తి అత్యంత విపన్నులై పడియున్న బలముపై నురికెను, పాంచాల వరుడగు ధృష్టద్యుమ్నునిపై లంఘించి

ఉరమును మెడయు విరుగాల(ద్రొక్కి, పశువును చంపునట్లుగ చంప(బ్రయత్నిం చెను. అంత దైన్యముతో నా ధృష్టద్యుమ్ను డిట్లు అర్థించినాడు.

క. గురుపుత్ర శస్త్ర నిహతిం
బొరిపుచ్చుము తడమనేల పుణ్యగతికిఁ జె
చ్చెరఁ బోవునట్లు సేయుట
పరికింపఁగ మేలకాదె పగతురకైనన్ [సౌప్తిక 1-151]

ధృష్టద్యుమ్నుడు తన్ను హింసించుచున్న అశ్వత్థామనట్లు దీనముగ కోరినను ఆగురు తనయుడు క్రౌర్యము వహించినాడే గాని కొంచెము కూడ జాలి, దయ చూపలేదు-కాలను, కేలను చదిపి, ధృష్టద్యుమ్నుడు వేదన పడుటను గాంచి ఇంచుకంతయు కరుణలేక 'కౌర్య ధుర్యుడై' అతనిని సంహరించినాడు (సౌప్తిక-1-158). కరి తురగములను కూడ అశ్వత్థామ 'క్రూర విచేష్టిత విభ్రమముతోడ' సమయించినాడు. (సౌప్తిక-1-176). మరియు నిద్రించువారి నందరిని 'పెంపారు దారుణక్రూరత్వంబునఁ గ్రోలు మసంగి యించుక యరవాయి గొనక చెండియుం దుంచియుం జించియు' (సౌప్తిక-1-191) చంపినాడు-ఇది క్రౌర్యమునకు దయా విహీనతకు పరాకాష్ఠ.

కారుణ్య గుణము :

పాండవులందు ధర్మార్జును లిరువురు అక్రూరులు, దయాగుణ సంపన్నులు. ధర్మరాజు అక్రూర స్వభావుడని భీష్ముడు ధృతరాష్ట్రుని కెరింగించినాడు (అను-4-138). దయాస్వరూపుడు అర్జునుడు. దయకు మారుపేరు అర్జునుడు. అర్జునుని దయాగుణము సర్వజనులకు ప్రశంసార్హమైనది-శత్రువీరులును ప్రశంసింప దగినది—

కౌరవ పాండవులు కురుక్షేత్రము నందు రణమొనరించుటకై సైన్య సమేతులై మొగ్గరములను తీర్చిరి. శస్త్ర సంపాతన సమయమేతెంచినది. కపిధ్వజుడు గాండీవము ధరించి, గుణము సారించి బాణపాణియగుచు నెదిరి సైన్యమును పరికించినాడు. ప్రతి పక్షమునమున్న "సోదర సుతమాతులాచార్యాదులగు బంధుశిష్ట జనంబుల నాలోకించి 'పరమ కృపా వేశంబున' నత్యంత విషాదంబు నొందినాడు (భీష్మ-1-180). ఎల్ల భువనముల నేలుటకైనను నిట్టి 'క్రూర

కర్మము' చేయ జాలనవిన అర్జునుని దయాగుణము కొనియాడదగినది. (భీష్మ-1-185). మరియు శోకమానసుడై 'పరమ కరుణా భరితుండునై' శర శరాస నంబులు విడిచి కన్నీరు దొరుంగ ఊరకున్న 'దయాసింధువు ఆ సవ్యసాచి (భీష్మ-1-189).

ధర్మజుడు భీష్ముని చంప ప్రయత్నించుచు ప్రియమైన తాతను సంహ రింప దలచుటకు చింతించుచు 'రాజధర్మ మింత క్రూర కర్మ'మగునె అని బాధ పడినాడు. (భీష్మ-1-158). మరియు అర్జునుడు ధర్మము తప్పి పితామహుని చంపుట కొర్వక 'ధర్మజు తమ్ములు క్రూర కర్ములే?' (భీష్మ-3-301). అని కృష్ణుని ప్రశ్నించినాడు.

మరియు పదునాల్గవ నాటి రాత్రి కయ్యమగు చున్నపుడు సకల సైనికులును నిద్రాపరవశులై ఆయుధములు విడుచువారును, తమ వారిని తామ ఎదిరి పొడుచు వారునునై అనేక ప్రకారముల వికల సంచారములు గావించుచుండిరి. ఆ దీన దశను పరికించిన గాండీవి-

క. అడరెడు నిద్రా భరమునఁ
గడు దస్సితి రెల్లవారుఁ గలనను జాడ్యం
బెడలఁగఁ జొక్కి మడుపుఁడి
ప్పుడ చంద్రుఁడు పొడుచు వెండి పోరుట యొప్పున్.

(ద్రోణ-5-268)

అని ప్రకటించినాడు. అదివిని రెండు పక్షముల వారును యుద్ధము మాని విశ్రమించిరి. మరియు నా కౌరవ సైన్యము అర్జునుని కరుణార్ద్ర హృదయు నిట్లు కీర్తించెను-

ఆ. కరుణ కలవు మమ్ము గారవంబున సుఖా
న్వితులఁజేసి తనఘ నీకు సురలు
వరము లెపుడు నిచ్చువారు గావుత మనో
రథముఁబొందు మమర రాజ తనయ (ద్రోణ-5-270)

శత్రు సైన్యము కూడ అర్జునుని కరుణను కీర్తించి అతనికి దేవతలు

ము లిత్తురని పొగడుట అర్జునుని దయాపతాకకు ఒక కలికితురాయిగా ...కొన వచ్చును.

అష్టాదశాక్షోహిణీ సైన్యమునందు ఎవరికి లేని కరుణ అర్జునునికి కలదు. ...నసనే అతడు యుద్ధారంభమున యుద్ధవిముఖుడైనాడు. మరి ఏ ఒక్కరును ...ముఖులేల కాలేదు? అర్జునునికున్న కారుణ్యము వారికి లేదనియే చెప్పవలెను. ... నిశానసమయ యుద్ధము నందును అర్జునునికి మాత్రమే సైనికుల చేష్టలకు ... ఉపొంగినది. అందువలననే అర్జునుడు దయకు ప్రతీకగా పేర్కొనుట ...గినది.

దయామయుడైన వాడే ఉత్తమ మానవుడు. దయావిరహితుడైన మాన... దానవునితో సమానము.

దయాగుణమును వినుతించిన సూక్తులను పరికించిన పిదప పాపపుణ్య...లను వేర్పాటు చేయు సూక్తులను పరిశీలించుట ఇక మీదట కర్తవ్యము.

## జ్ఞాపికలు

. పూలవానలూ-తేనెసోనలూ- ఆంధ్రప్రభ-వారపత్రిక 4-3-87 పు 74
. అందే పు-74
. ఆంధ్ర మహాభాగవతము- ప్రథమ స్కంధము-ప. 14
. సంస్కృత మహాభారతము- శాంతి పర్వము
. నిర్వచనోత్తర రామాయణము 1-16
. ఆంధ్ర మహాభాగవతము- దశమ స్కంధము-ప. 1013
. అందే అష్టమ స్కంధము ప-86
. పూలవానలూ-తేనెసోనలూ- ఆంధ్రప్రభ వారపత్రిక 4-3-87 పు-74
. అందే- పు-74
. అరణ్య పర్వము 7-446
. ఆంధ్ర మహాభాగవతము- దశమ స్కంధము. ప-

# పాప పుణ్యవైచక్షణ్యము

పాప పుణ్యములకు సంబంధించిన సూక్తులు ఈ అధ్యాయమునందు ప్రసక్తములగు చున్నవి. పాప మనగానేమి? పుణ్యమనగానేమి? అట్లే పాప కార్యము లేవి? పుణ్య కార్యములేవి? పాపఫలమేమి? పుణ్యఫలమేమి? ఇత్యాది విషయములను వివక్షించు సూక్తులు భారతమున పెక్కులు గలవు. క్రూరుడు, దుర్మార్గుడు పాపకార్యముల నొనరించును. అక్రూరుడు, సన్మార్గ ప్రవర్తకుడు పుణ్యకార్యములను చేయును. కొంతమంది దుష్ప్రవర్తకులు పాప కార్యములు చేయునపుడు వారి ఆత్మ ఘోషించుచునే యుండును. అయినను ఆత్మఘోష వినక పురాకృత జన్మకార్యముగ పాపములను చేయుచునే ఉందురు. అట్లే పుణ్యకర్మముల నొనరించు వారును తమ పురాకృత సుకృత కారణముగ వానిని చేయుచునే యుందురు.

పాపభీతి గలవారు పాపకర్మలను చేయలేరు. ఆ భీతిలేని వారే అట్టి పాప కార్యములకు కడంగు చున్నారు. పుణ్యమును వ్యక్తీకరించు సూక్తులకంటె పాపములను చెప్పు సూక్తులు భారతము నందనేకములు కలవు. పాపడెట్టివాడో, పాపము లేవో పలుమార్లు పలువిధములుగ చెప్పబడినది. మొదట పాప కార్యములను చేయకుండిన జాలునదియే పదివేలు. జన్మలన్నింటిలోను మానవజన్మ ఈ లోకమున ఉత్తమమైనదిగా పరిగణింప బడుచున్నది. కావున ఈ ఉత్తమ జన్మ నెత్తినవాడు పాపమును చేయకపోవుట ఉత్తమము. ఒక్కొక్కపుడు సత్పురుషుడును తెలియక పాపములను చేయుచున్నాడు. తెలిసి చేసినను, తెలియక చేసినను వాడు ఆ పాప ఫలమును అనుభవింపక తప్పదు. పదునాలుగేండ్ల ప్రాయము వరకు బాల్యమున చేయు పాపములు వారికి చెందవు. కాని పదునాలుగేండ్ల వయసు వచ్చునంతకు వారికి ఇతరులు పాపములు చేసినచో పాపఫలములను చేసిన వారనుభవింపక తప్పదని మాండవ్య మహర్షి ఒక మర్యాదగావించినాడు.[1] ఈ విషయమును వ్యక్తీకరించు రమ్యమైన ఇతిహాస మొకటి భారతము నందు గలదు. ఆ ఇతిహాసమును ఇట పేర్కొనుట అప్రస్తుత ప్రసంగము కాదను భావముతో నాకథ సంక్షిప్తముగ నీయధ్యాయమునందు ప్రసక్త

మగు చున్నది. ఈ కథలో కొంత భాగము సత్యవైశిష్ట్యమను నధ్యాయమున నుద్ధరింప బడుటను చదువరులు గమనించియే యుందురు. [చూడుము, పు. 124, 125]

తొల్లి మాండవ్యుడను మహర్షి మహీవలయంబు నందుగల అఖిల తీర్థములనెల్ల నేక చారియయి సేవించెను. ఒకానొక నగరమున కెడగల్గు ప్రాంతమున నడవిలో నాశ్రమంబు గావించుకొనెను. తద్ద్వార వృక్షమూలము నందు ఆబ్రహ్మర్షి ఊర్ధ్వ బాహుండై మౌనవ్రతముతో ఉగ్రతపము నాచరించుచుండెను అంత ఒకనాడు ఆ రాజు గారి ధనమును దొంగిలించి. ముచ్చులు పారిపోయి వచ్చి మాండవ్య మహర్షి ఆశ్రమమునందు డాగిరి. ముచ్చులను వెన్నంటి వచ్చిన ఆరెకులు-దొంగలు ఇటు వచ్చిరి గమనించితివా? అని ఆ మునిని ప్రశ్నించిరి. మాండవ్యుడు మౌన వ్రతముతో నున్న కారణమున వారికి సమాధాన మీయడాయెను. ఆరెకులు కోపముతో నయ్యాశ్రమము నంతయు శోధించి. ముచ్చులతో గూడ రాజధనమును గ్రహించిరి. మరియు మాండవ్యుడే ఆ ముచ్చులను దాచి నాడని, అతడే దొంగలకు నాయకుడని ఏమియు ఎరుగని యట్లు తపమాచరించు చున్నట్లు నటించు చున్నాడని భావించి, దొంగలతో కూడ మాండవ్యుని బంధించి రాజు చెంతకు కొంపోయిరి. తపో వేషమును ధరించిన ముచ్చుని భావించి, మాండవ్యుని పురివెలుపల శూలప్రోతుని గావించిరి. శూలము బాధను ఓర్చి అతిశాంత స్వభావుడై, నిరాహారుడై ముని తపమాచరించు చుండెను.

అంత ఒకనాటి రాత్రి పుహా మునులు పక్షులై మాండవ్యుని కడ కేతెంచిరి. మాండవ్యుని తపము పేర్మికి మెచ్చి- మహాత్మా నీకిట్టి దుఃఖమును గావించిన వారెవ్వరని? ప్రశ్నించిరి. దానికి మాండవ్యు డిట్లనియెను.

తే. ఎఱిఁగి యెఱిఁగి నన్నాడుగంగనేల దీని
సుఖము దుఃఖంబు ప్రాప్తించు చోట నరుఁడు
దగిలి తన కర్మ వశమునఁ దనకుఁ దాన
కర్త గా కన్యులకు నేమి కారణంబు? (అను-4-267)

ఈ పలుకులను విన్న ఆ నగర రక్షకులు తమ రాజునకు సకలము నెరింగించిరి. ఆ రాజు మాండవ్యుని కడకేతెంచి, తన అజ్ఞానమును సహించి, తన్ను ప్రసాదింపుమని వేడుకొనెను. మరియు శూలమును తీయుటకై ప్రయత్నించి, అది రాకున్న విరుపై పలు ఖండింప చేసెను. మాండవ్యుని కంఠ పార్శ్వము నందు శూల శేషము అంతర్గతమై యుండెను. అందువలన నా మాండవ్యుడు అణి మాండవ్యుడుగా ప్రసిద్ధి నొందెను. ఆ మహర్షి ఘోర తప మాచరించి, ఎల్ల లోకములను గమించి, ఒకనాడు యమపురికి జనెను. బ్రాహ్మణుడగు తనకు నట్టి క్రూరదండము విధించుటకు గల కారణమేమని బ్రహ్మర్షి యముని ప్రశ్నించెను-దానికి ప్రత్యుత్తరముగా యమధర్మ రాజిట్లని చెప్పెను.

క. సొలయక తూనిఁ గలం గొ
ఋల 'బెట్టితి నీవు నీ చిఱుత కాలము త
త్ఫల మిప్పు డనుభవించితి
తొలగునె? హింసాపరులకు దుఃఖప్రాప్తుల్. (ఆది-4-271)

ఈ సమాధానమును విని మాండవ్యుడలుకతో జన్మము మొదలుగా పదు నాల్గు సంవత్సరములు దాటునంతకు పురుషుండు బాలుండు వాడెద్ది చేసినను పాపము పెద్దగా కలుగదు-వానికి ఇతరులు ఎగ్గు చేసిన యెడల వారు పాతకు లగుదురని మాండవ్యుడు ఒక మర్యాదగావించెను-మరియు నిట్టి ధర్మము తలంపక బాల్యమున నల్ప దోషము గావించిన తనకు బ్రాహ్మణోచితము గాని ఘోర దండము గావించిన వాడవు గావున మర్త్యలోకమునందు శూద్ర యోనిని జన్మింపుమని యమధర్మరాజువే శపియించగా నా యముడు విదురుడుగా నుదయించెనట.[2]

**పాప కార్యములు :**

పాపములనగా వెంటనే మనకు పంచమహాపాతకములు జ్ఞప్తికి వచ్చును. అవి గో, బ్రాహ్మణ, స్త్రీ, శిశు, భ్రూణహత్యలు-ఇవి మహాపాపములుగా పరిగణింపబడుచున్నవి. ఇవి కాకుండ నింకను వేరు పాపములు గలవు. ఆ పాపము లెట్టివో ఇక పరిశీలింతము.

కోపము పూని పురమునకు, ఊరికి, వనమునకు అగ్నిపెట్టుట బ్రాహ్మణునితో నసత్యములాడి అతనికి అధిక తరమగు దుఃఖము నావహిల్ల చేయుట, అనునవి బ్రహ్మహత్యా సమములనిరి. (అను-2-69).

వేదములందు పేర్కొనబడిన కర్మలాచరింపక పోవుటయు, ఆ వేదములందు నిషేధింపబడిన వానిని ఆచరించుటయు ఈ రెండును పాప కార్యములని ప్రాజ్ఞులైన వారు చెప్పుచున్నారు. (శాంతి-1-291). అనగా వేదవిహిత కర్మలాచరింపక పోవుట పాపము-

ఉదయం సాయం సంధ్యలందు నిద్రించుట పాతకము-పాత్రుడైన వాడు ఇంటికి వచ్చినపుడు అతని కోర్కెతీర్చి పూజ ఆచరింపక పోవుట పాపమే-పరదారగమనము మహాపాపము-గురులకు ఎదురు చేయుట పాతకమే-గ్రామములను నాశనము చేయుట మంచిదిగాదు-వేద విక్రయము, రసవిక్రయ మొనరింపరాదు-భృత్యుని రక్షింపవలెను-అసత్యము వాడరాదు-గహన దాహమున నన్య కర్మకృతి నాచరింపరాదు-తన కర్మను తాను విడువరాదు-అనవసరముగ పశువును కొట్టరాదు-భూమి సురుల సంపదను గ్రహింపరాదు-శరణార్థియై వచ్చినవానిని రక్షింపక వదలుటయు, బ్రాహ్మణవధయు పాపములని బుధ జనములు పేర్కొనుచున్నారు (శాంతి-1-293). 'బ్రాహ్మణో నహంతవ్యః' యను పలుకు ప్రసిద్ధమైనది-

బంధు జనముల కంటెను మిత్రుడు ఒకప్పుడు మేలగుచున్నాడు-'సఖ్యమ్ సాప్త పదేన'[4] మను వాక్యము మైత్రి యెడల ప్రశస్తమైనది-అట్లే సంబంధము సాప్తపదీనము.[5] మిత్రులకు ద్రోహ మొనరింపరాదు. మిత్రద్రోహము దారుణమైనది. కృతఘ్నత కంటెను భయంకరమైన పాపము మిత్రద్రోహము-ఎంత ఆప్తుడైనను వాడు మిత్ర ద్రోహమును చేసినను, కృతఘ్నత పాటించినను అట్టి వారితో వైరము పెట్టుకొని వారిరువురిని త్యజింపవలెను-

క. ఆరయ మిత్ర ద్రోహము
దారుణమగు పాతకము కృతఘ్నత కంటెన్
వైరము గొని విడువ వలయు
నా రెండు తెఱఁగుల వారి నాప్తులనైనన్. (శాంతి-3-525)

రాజైన వాడు ధనములకు తృప్తి పడరాదు-అనగా ధనసంపాదనపై ఎన్నటికి తృప్తి వలదు-ఎంత సంపాదించినను ఇంకను సంపాదించవలసినదే గాని తృప్తి చెందరాదు-యుద్ధమునకు రాజు వెనుదీయరాదు-యుద్ధ మొనరించుట క్షత్ర ధర్మము కావున రాజు యుద్ధ మొనరింపవలెను. రాజు ప్రజలను కన్న బిడ్డలవలె రక్షింపవలయును. ధనములతో తృప్తి నొందుట, యుద్ధమున కోహటించుట, ప్రజలను రక్షింపక పోవుట అను మూడు కార్యములును రాజన్యులకు పాతకములగుచున్నవి (శాంతి-1-156). కామ క్రోధములు కలిగి ప్రవర్తించు రాజునకు తన ప్రజలొనరించు పాపమునందు చతుర్థభాగము తప్పక అనువర్తించును (శాంతి-1-177). కావున రాజునకు కామ క్రోధాదులు పాపకారకములగుచున్నవి-

ఉదయించు సూర్యుని చూడరాదు. పరవనిత నగ్నయై నిరంబరయైయున్నపుడు పరికించరాదు. తన పురీషము తాను చూచుట కీడు-అట్లే తాను చేసిన పాపమును దాయుట అకార్యమగుచున్నది-అనగా మనము చేసిన పాపమును మనము బయటికి చెప్పుకొనవలయును-'చేసిన పాపము చెప్పుకొనిన పోవును' అను వాక్యము మనము వినుచునేయున్నాము. నిజ పాప గుప్తి పనికిరాదు (శాంతి-4-118). ఋతు స్నాతయై పుత్రార్థము భర్తను గోరి వచ్చిన భార్యయందు పతి విముఖుడు కారాదు- అట్లు భార్యయందు ప్రతి కూలుడైన భర్తకు భ్రూణహత్యా దోషము వాటిల్లునట-

క. ఋతు మతియై పుత్త్రార్థము
పతిఁ గోరిన భార్యయందుఁ బ్రతికూలుఁడై
ఋతు విఫలత్వము సేసిన
నతనికి మఱి భ్రూణ హత్యయగు నండ్రు బుధుల్ (ఆది-3-188)

ఉపవాసము ఉండుట ఆరోగ్యకరమని వైద్యశాస్త్రము చెప్పుచున్నది- 'లంకణమ్ పరమౌషధమ్' ఉపవాసముండి పూజచేయుట పుణ్యప్రాప్తి కలుగ చేయునని మనవారి నమ్మకము- శివరాత్రినాడు జాగరము, ఉపవాసముండుట కైలాస ప్రాప్తియని విశ్వాసము- కార్తికమాసములో నాలుగు సోమవారములు గాని, పౌర్ణమినాడు గాని ఉపవాసము చేయుట వలన పుణ్యప్రాప్తికలుగునని స్త్రీ

జనుల ప్రగాఢ విశ్వాసము. అలిగి ఉపవాసముండుట మనలో గలదు- గాంధీమహాత్ముడు పెక్కుమార్లు ఉపవాసమున్నాడు- నిరాహార దీక్షతోనే పొట్టి శ్రీరాములు గారు కీర్తిశేషులైనారు- నిష్ఠతో ఉపవాసము చేయువారు ఎట్టి పరిస్థితులలోను మాసము దినములలోనే చేయవలయును- మాసాధి కోపవాస వృత్తి పాప మందురు. [అను-4-151]

వక్ర విచారులైన వారిని పాపకారులను ఎట్టివారును మనసార విశ్వసింపరు- వారల నాత్మీయులుగ భావింపరు [అరణ్య-7-410]. ఒకనిని అనవసరముగ నిందించుట కుపురుషలక్షణము. అట్లే ఇతరులయందు పాపము ఏమాత్రము లేనపుడు పాపము కలిగించి, వానిపై వేసినపుడు ఆ పాపము పుట్టించిన వానికే తగులును- కావున పాపము పలుకులు మాటాడరాదు- మరియు నొకనిపై అనవసరముగ పాపము వేయరాదు- ఇట్టి సందర్భమున మౌనవ్రతము మంచిది-

క. ఏ పాపమేని లేనిది
   కాపురుషత నొకని మీఁదఁ గలిగించిన న
   ప్పాపము చేసిన వాఁడగు
   నా పొలువ యనంగ విందు మార్యుల చేతన్ [శాంతి-3-439]

ఆత్మహత్య మహాపాతకమందురు- అట్లే ఆత్మ వినాశము జరుగనిచ్చుటయు మహాపాపమే-కృపాచార్యుడు దుర్యోధనునితో పదునేడు దినముల యుద్ధానంతరము పాండవులతో సంధిచేసికొనుమని చెప్పినాడు. ఎందువలననగా నప్పటికి ప్రధాన కౌరవ వీరులు భీష్మద్రోణ కర్ణాదులు మడిసిరి. దుశ్శాసనాది భ్రాతృవర్గమును నుడిసినది- అపుడు కృపుడు దుర్యోధనునితో నిట్లనినాడు- ఆత్మ వినాశము కలుగుట విపుల పాతకము-

క. కల వారెల్లను డెగి నీ
   తలన నిలిచెఁ గార్యమధిప తగనొడఁబడు మి
   ట్టులమగు నాత్మ వినాశము
   కలుగుట యది విపుల పాతకం బండ్రు బుధుల్ (శల్య-1-57)

కల్లును సేవించుట పాతకము (శాంతి-1-107). కల్లు త్రావుట, గుర్వు

పత్నిని రమించుట, బ్రాహ్మణుని వధించుట, బ్రహ్మ స్వవిషయమును దొంగి లించుట, క్రూరజనులతో సఖ్యమొనరించుటయు మహాపాతకములని భారతము బోధించు చున్నది. (శాంతి-1-168).

వంచన సేయుట రాజులకు తగదు- నికృతిచేయుట. జూదమాడుట అను నీరెండును క్షత్రియులనుసరింప వలసిన నీతి క్రమములుగావు. ధర్మమార్గ ప్రవర్తకులైన వారి రెండును అవశ్యము వర్జింప వలయును- జూదము పృథివీ పతులకు కడుపాప వృత్తము (సభా-2-16).

యజ్ఞ యాగాదు లొనరింప వలెనన్న ధనముకావలెను- కావు. అధనమును తపృక సంపాదింపనగును. ఆ ధనముతో క్రతువులు చేయవలయును- క్రతువు లొనరించి దేవతలను తృప్తులను చేయనిచో నది కిల్బిషకారి యని వేదవిదులు చెప్పుదురు [శాంతి-1-78]. శరణార్థియైన వానిని అవశ్యము రక్షింపవలెను. రక్షింపని వారికి, శరణార్థిని సంతోషము కల్గింపని వారికి కల్మషము చెందును. ఆ కల్మషము ఏమి చేసినను ఎన్నటికి వదలిపోదు. (శాంతి-3-341).

మన కొరకు శ్రమించు వారికి సహాయము చేయుట మానవధర్మము- రాజునకు యుద్ధమునందు భటులు తోడ్పడుదురు. యుద్ధరంగములో పోరాడి వ్రణములు పొందిన భటుని రక్షింపనట్టి రాజునకు లభించు పాపము ఇంతింత అని చెప్పరా నట్టిది (శాంతి-2-422). దొంగ తనము జరుగు చున్నపుడుగాని, వధ జరుగు చున్నపుడు గాని చూచి అద్దానిని ఉపేక్షింపరాదు- అట్లు ఉపేక్షించి నచో నశ్వమేధ భ్రూణ హత్య లొనరించినంత ఫలము వచ్చునని వేదముల యందు వినంబడు చున్నది. అశ్వమేధ యాగమును చెరగొట్టినంత గాని, భ్రూణ హత్య చేసినంతగాని పాపము సంభవించును. (ఆది-8-122). అశ్వముపాలు. ఒంటెపాలు. గాడిదపాలు నింద్యములుగ పరిగణింప బడెడివి. బ్రాహ్మణులట్టి పాలను సేవించుటచే పాపమును పొందు చున్నారు-

క. తురగియు నుష్టియు ఖరియును
గురిసిన దుగ్ధములు నింద్యకోటి గణితముల్
ధరణీ సురాది జనుల
పొ్రరువునఁ బోయిన నఘంబుఁ బొందుదురధిపా.

[శాంతి 1-323]

ఆధునిక కాలమునందు జరిగిన పరిశోధనలలో తేలిన అంశమేమనగా గాడిదపాలు త్రాగిన కొన్ని రోగములు పోవుటయేగాక, శరీరము చాల దృఢము గాను, చర్మము మందముగాను నగుననియు వార్తాపత్రికలలో నొక వార్తగ ప్రకటించియున్నారు–మరియు దొంగతనము చేయువారు కొందరు గాడిదపాలు త్రాగుదురనియు, పట్టు వడినపుడు ఎంత కొట్టినను వారికి దెబ్బల బాధ తెలియ దనియును చెప్పుదురు–

దండార్హులైన వారిని దండింపక వదలిపెట్టినచో నింద్రు నంతటి రాజున కైనను కిల్బిషము కలుగును. (శాంతి–1–96). రాజు దండనీతిని పాటింపకున్న సన్యాసులు కూడ దుష్పథ ప్రవర్తకు లగుదురు–ప్రజలు అన్యోన్య ధనధాన్య పశు భూమిదారహరణమును గావింతురు–అప్పుడు ఆ పాపము రాజునకు చెందును (శాంతి–1–108).

పురుషహీనమైన సతిని కాంక్షించుట పాపము. నేలమీద పడిపోయిన మాంసపు ముద్దను పక్షులెట్లు అపేక్షించుచున్నవో, అట్లే పురుషహీనమైన యువ తిని చూచి ఎల్లవారును చులకనపేక్షింతురు–హీనమతులైన వారిది పాతకమని తెలియక కోరుదురు–

ఆ. పడినయామిషంబు పక్షులపేక్షించు
నట్లు పురుషహీన మయిన యువతిఁ
జూచి యెల్లవారుఁ జులుక నపేక్షింతు
రిదియుఁ బాప మనక హీన మతులు. [ఆది–6–257]

పురుషుడు లేని యువతి అనగా విధవస్త్రీనేగాదు పరదారను అపేక్షింప రాదు. పరదార గమన మంతటి పాపము ఇంకొకటిలేదు–ఇది ఆయుక్షీణ కారికాన తద్వర్జనము కడుమేలు (అను–4–91).

విద్య యొసగును వినయము, పలు చదువులు చదివి పండితుడైన వాడు వినయవంతుడు కావలెనేగాని విద్యా గర్వముచే నొరుల గొప్ప కీర్తిని దూల పుచ్చరాదు–అట్టి వానికి బ్రహ్మహత్యా దోషము వాటిల్లును–కావున విద్యావంతు డెప్పుడును వినయవంతుడు గావలెను–గర్వికారాదు–